శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీవేంకటేశదివ్యసాహితి

( నాలాయిర దివ్యప్రబంధంలో ఆళ్వార్లు
శ్రీవేంకటేశ్వరస్వామిని స్తుతించిన పాశురాలు - తాత్పర్యంతో )


## ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ. ఎ. శింగరాచార్యులు



(చతుర్థ) ఉభయవేదాంత సభల జ్ఞాపిక
జూలై, 2011


సమర్పణము
శ్రీమతి అలమేలు మంగ శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తి దంపతులు

# శ్రీవేంకటేశదివ్యసాహితి

**శ్రీమాన్ డా॥ ఈ.ఎ. శింగరాచార్యులు**

ప్రథమ ముద్రణ : జూన్, 2008

ద్వితీయ ముద్రణ : జూలై, 2011

ప్రతులు : 1000

ఆవిష్కరణము : 22-7-2011

సందర్భము : (చతుర్థ) ఉభయవేదాంత సభలు

వేదిక : శ్రీపద్మావతీ కల్యాణమండపం, తిరుచానూర్‌రోడ్ తిరుపతి





వెల : అమూల్యం

ముఖచిత్రం : తిరుమల గిరులపై వేంకటేశ్వరుడు


ఈ పవిత్రగ్రంథం భగవద్భాగవతాచార్య కైంకర్య నిష్ఠులు

**శ్రీమతి అలమేలుమంగ, శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తి దంపతులు**

భక్తిశ్రద్ధలతో సమర్పించిన పవిత్రద్రవ్యంతో, వారు తిరుపతిలో నిర్వహించే (చతుర్థ) ఉభయవేదాంతసభల పవిత్ర జ్ఞాపికగా ముద్రింపబడుతున్నది.

**దివ్యసూరినిర్మితా వేంకటేశసాహితీ శ్రావ్యశబ్దగుంఫితా హృద్యతత్త్వబంధురా ।**
**భావుకాళిహృత్సుధా భక్తకోటిసన్నిధౌ గోపకృష్ణమూర్తినా నమ్రచేతసాఽర్ప్యతే ॥**


ప్రతులకు :

శ్రీ పి. గోపాలకృష్ణమూర్తిగారు
హైదరాబాద్-60. సెల్ : 9848129366

డి.టి.పి. : చంద్రశేఖర్, తిరుపతి

ప్రింటింగ్ :
సి.యన్. ప్రింటర్స్, 99, ప్రకాశంరోడ్, తిరుపతి.





శ్రీమతే రామానుజాయ నమః

న్యాయవేదాంతవిద్వాన్

**ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారు**

భారద్వాజభవనం, నరసాపురం


# శుభాశంసనము

శ్రీరంగమంగళమణిం కరుణానివాసం
శ్రీవేంకటాద్రిశిఖరాలయకాలమేఘమ్ ।
శ్రీహస్తిశైలశిఖరోజ్జ్వలపారిజాతం
శ్రీశం నమామి శిరసా యదుశైలదీపమ్ ॥

"కోయిల్ తిరుమలై పెరుమాళ్ కోయిల్ తిరునారాయణపురమ్" అని శ్రీవైష్ణవ సంప్రదాయంలో అనుసంధింపబడే ప్రధాన దివ్యదేశాలు నాల్గింటిలో మధ్యమణి న్యాయంగా వెలుగొందే తిరుమల కలియుగ వైకుంఠంగా ప్రసిద్ధి చెందింది. ఆ గిరులపై వేంచేసి ఉండే స్వామి **"కలౌ వేంకటనాయకః"** అని కలియుగ ప్రత్యక్షదైవంగా, భక్తుల కొంగుబంగారంగా కీర్తింపబడుతున్నాడు.

వేదాలలో, పురాణాలలో, ఆళ్వార్ల దివ్యప్రబంధాలలో, పూర్వాచార్య స్తోత్రాలలో లౌకికసంస్కృతవాఙ్మయంలో, ప్రాచీన ద్రావిడవాఙ్మయంలో శ్రీవేంకటాచలమహిమ, అచటి స్వామివైభవం విస్తృతంగా ప్రతిపాదింపబడింది. ఆళ్వార్లలో భక్తాంఘ్రిరేణువులనే తొండరడిప్పొడి ఆళ్వార్లు తప్ప మిగిలిన ఆళ్వార్లు రెండువందలకు మించిన (207) పాశురాలలో తిరువేజ్గడముడైయాన్‌ను గానం చేశారు. ఈ పాశురాలన్నీ శబ్ద మాధుర్యాన్ని, అర్థగాంభీర్యాన్ని కలిగినవి.

భగవానుని రూపాలు పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చారూపభేదంతో అయిదు విధాలని వేదాలు, ఆగమాలు, పురాణాలు, ఆళ్వార్ల, పూర్వాచార్యుల సూక్తులు తెల్పుతున్నాయి. ఈ అయిదు రూపాలను శ్రీవేంకటేశ్వరుని విషయంగా **"మనత్తుళ్ళాన్ వేజ్గదత్తాన్ మాకడలాన్ మఱ్ఱుమ్ నినైప్పరియ నీళ్ అరఙ్గత్తుళ్ళాన్- ఎనైప్పలరుమ్ దేవాదిదేవ నెనప్పడువాన్ మున్నొరునాళ్ మావాయ్ పిళన్దకన్"** అని అంటూ పూదత్తాళ్వార్లు ఇరణ్డామ్ తిరువన్దాదిలో (28) అనుసంధించారు. ఈ పాశురంలో "మనత్తుళ్ళాన్" అని అంతర్యామిరూపం, "మా కడలాన్" అని

వ్యూహం, **"నినైప్పరియ నీళ్ అరజ్గత్తుళ్ళాన్"** అని అర్చారూపాలకు మూలం అయిన శ్రీరంగంలోని శ్రీరంగ నాథుని అర్చామూర్తి, **"దేవాదిదేవన్"** అని పరరూపం, **"మున్నొరునాళ్ మావాయ్ పిళన్ద మకన్"** అని కేశిహంత అయిన శ్రీ కృష్ణుని స్మరించడంద్వారా విభవం - ఈ విధంగా పరత్వాదిపంచకాన్ని **"వేజ్గదత్తాన్"** విషయంగా ఆళ్వార్లు అనుసంధించడం సుస్పష్టం.

ఇక ప్రధానాలైన విభవావతారాలను ఇంచుమించుగా అన్నిటినీ ఆళ్వార్లు తిరువేజ్గడముడైయాన్ విషయంగా అనుసంధించడాన్ని గమనించవచ్చు. **"శజ్గమాకడల్ కడైన్దాన్.... వేజ్గదత్తుజ్గణ్‌మాల్** అనే నాచ్చియార్ తిరుమొళ్రిలోని **(8-7)** పాశురం సముద్రమథన వృత్తాంతాన్ని ప్రస్తావించడంద్వారా కూర్మావతారాన్ని, తిరుమళ్రిశై యాళ్వార్లు తిరుచ్చన్దవిరుత్తంలో **"కుస్టిల్ నిన్టు.... మణ్ ఒన్టు శెన్ట తొన్టైయుణ్డ తొన్టిదన్టు పన్టియాయ్" (48)** అని వరాహావతారాన్ని, తిరుమజ్గైమన్నన్ పెరియతిరుమొళ్రిలో **(7-3-5) "వేజ్గడత్తరియై"** అని నృసింహావతారాన్ని, **"మాన్‌కొణ్డతోల్ మార్బిల్ మాణియాయ్ మావలిమణ్ తాన్ కొణ్డు తాళాలళన్ద పెరుమానై"** అని వామన రూపాన్ని, నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్రిలో **"అన్టుఞాల మళన్ద పిరాన్ పరన్ శెన్టు శేర్ తిరువేజ్గడమామలై" (3-3-8)** అని త్రివిక్రమావతారాన్ని, పెరియాళ్వార్లు **"తెన్నిలజ్గై మన్నన్ శిరమ్ తోళ్ తుణి, శెయ్‌దు మిన్నిలజ్గ పూణ్ విబీడణనమ్బిక్కు.... వేజ్గడవార్" (2-6-9)** అని శ్రీరామావతారాన్ని, **"నిచ్చలుమ్ తీమైకళ్ శెయ్‌వాయ్ నీళ్ తిరువేజ్గడత్తె న్దాయ్" (1-4-3)** అని శ్రీకృష్ణావతారాన్ని అనుసంధించారు. మిగిలిన అవతారాలను సైతం ఆళ్వార్లు శ్రీవేంకటేశ్వరుని విషయంలో అనుసంధించడాన్ని సందర్భానుగుణంగా అన్వయించే అవకాశం ఉన్నది. విస్తరభీతిచేత ఇంతటితో ఈ అంశాన్ని ముగిస్తున్నాను. కాబట్టే ప్రతివాదిభయంకరం అణ్ణన్ తమ సుప్రభాతస్తోత్రంలో **"మీనాకృతే కమఠకోల"** ఇత్యాదిగా దశావతారాలను అన్నిటినీ శ్రీవేంకటేశ్వరుని విషయంగా అనుసంధించారు.

వేదాంతదేశికులు రహస్యత్రయసారంలో **"ఔపనిషదవిద్యావిశేషజ్గళ్‌తోఱుమ్ అనుసంధేయగుణవిశేషజ్గళ్ నియతజ్గళానాప్పోలే భగవచ్ఛాస్త్రోక్తమాన రూపవిశేషాను సంధానత్తుక్కుమ్ గుణవిశేషజ్గళ్ నియతజ్గళ్"** అని వచించారు. దీనినిబట్టి



ఉపనిషత్తులలో తెలుపబడ్డ బ్రహ్మవిద్యావిశేషాలు అన్నిటిలో ఒక్కొక్క విద్యలో కొన్ని కొన్ని గుణవిశేషాలు నియతాలు అయినట్లే, పాంచరాత్రశాస్త్ర ప్రతిపాదితాలైన భగవానుని రూపవిశేషాల అనుసంధానంలోను గుణవిశేషాలు నియతాలు - అని తెలుస్తున్నది. నమ్మాళ్వార్లు ద్రావిడవేదసాగరం అయిన తిరువాయ్‌మొళ్రి ప్రబంధంలో కొన్ని దివ్యదేశాలలోని అర్చామూర్తివిశేషాలలో ఒక్కొక్క కల్యాణగుణం విశేషించి అనుసంధేయమని తెలిపినట్లుగా ఆచార్య హృదయకారులు ప్రతిపాదించారు. ఈక్రమంలో, తిరుమలలోని శ్రీవేంకటేశ్వరుని రూపంలో **"నికరిల్ పుకళ్రాయ్"** అని అంటూ వాత్సల్యగుణం ప్రకాశిస్తూన్నదని అనడం పైకి తెలిపిన వైదిక, ఆగమప్రక్రియానుసారంగా అన్వయించు కోవడంలో విప్రతిపత్తి ఏమీ లేదుకదా!

**"పళ్రుందొస్టుమ్ వారాద వణ్ణమే విణ్ కొడుక్కుమ్"** (ఏకొఱత లేని రీతిలోనే వేంకటాచలం పరమపదాన్ని ఇస్తుంది...... (ముదల్-తిరు-76) అని అంటూ పొయ్‌కై ఆళ్వార్లు అనిష్టనివృత్తిపూర్వకం అయిన ఇష్టప్రాప్తిని వేంకటాచలం అనుగ్రహిస్తుందని అన్నారు. ఇదే భావాన్ని నమ్మాళ్వార్లు తిరువాయ్‌మొళ్రిలో **"తిరువేజ్గడ మామలై ఒన్టుమే తొళ్రునమ్ వినై యోయుమో", "తిరువేజ్గడమ్ నజ్గట్కు శమన్గొళ్ వీడు తరుమ్"** అని **(3-3-8, 7)** అనుగ్రహించారు. ఈ రీతిలో అళ్వార్ల దివ్య ప్రబంధాలలో పలుచోట్ల వర్ణింపబడ్డ తిరుమల వైభవం భాగవతవైభవంలోనే పర్యవసిస్తుందని, భగవానుడొక్కడే మోక్షప్రదాత అనే శాస్త్రార్థానికి విరుద్ధం కాదని గుర్తించాలి.

జీవుని అచేతనవత్ పారతంత్ర్యాన్ని, అచేతనంకంటే జీవునకు ఉండే వ్యావృత్తిని కులశేఖరులు తమ ప్రబంధంలో శ్రీవేంకటేశ్వరుని వైభవాన్ని కీర్తించే **"పడియాయ్ కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అనే సూక్తిద్వారా తెలియజేశారు. ఈ సూక్తిలో **"పడియాయ్ కిడన్దు"** అని అచేతనవత్ పారతంత్ర్యం, **"ఉన్ పవళవాయ్ కాణ్బేనే"** అని అచేతనంకంటే ఉండే వ్యావృత్తి తెలుపబడ్డాయి. గోదాదేవి తమ నాచ్చియార్ తిరుమొళ్రి ప్రబంధంలో **"వేజ్గడత్తు ప్పదియాక వాళ్రీర్‌కాళ్" (8-9)** అని అంటూ వేంకటాద్రిలోని నిత్యనివాసం - ఉజ్జీవనం రెండూ పర్యాయాలు అని అన్నారు.

ఇటువంటి ఎన్నో అద్భుతమధురవిశేషాలను కల, శ్రీవేంకటేశ్వరవైభవ ప్రఖ్యాపకా లైన, నాలాయిరంలోని దివ్యసూరుల పాశురాలను అన్నిటినీ ఒకచోట చేర్చి తాత్పర్య సహితంగా జూన్ 2008లో విజయనగరం వాస్తవ్యులు భాగవత శేఖరులు శ్రీ దాసరి సన్యాసిరాజు, శ్రీమతి నరసయ్యమ్మ దంపతులు ఇటు భగవత్కైంకర్యాన్ని, ఆచార్యపరిచర్యను, అటు తమ పుత్రుని మనోరథ పూర్తిని, తమ తల్లిదండ్రుల, పితామహీపితామహుల విషయంలో సేవను చేసికొనే ఉద్దేశ్యంతో ముద్రించారు. ఇప్పుడు ఈ గ్రంథాన్ని అద్వితీయమైన రీతిలో ఉభయవేదాంత సభలను పలుచోట్ల నిర్వహిస్తున్నవారు, శ్రీవైష్ణవ కైంకర్యసిరిని పరిపూర్ణంగా కలిగినవారైన శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తిగారు ఈ యేడు జూలై 22, 23, 24 తేదీలలో తిరుపతిలో నిర్వహించే చతుర్థ ఉభయవేదాంత సభల జ్ఞాపికగా తిరిగి ముద్రించడం చాలా సముచితం. శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తిగారిని హృదయ పూర్వకంగా అభినందిస్తూ, వారి సత్సంప్రదాయసేవ అప్రతిహతంగా, బహుగుణీకృతంగా కొనసాగేటట్లు శ్రీనివాసప్రభువు వారిని అనుగ్రహించాలని మంగళాశాసనం చేస్తున్నాను. వీరు బహుద్రవ్యాన్ని వెచ్చించి అందించే ఈసద్గ్రంథాన్ని సద్వినియోగం చేసుకోవలసిందిగా సంప్రదాయజ్ఞులైన పాఠకులను వేడుతూ, స్వస్తి.

నరసాపురం — ఇట్లు

16-7-2011 — **ఈ. రంగాచార్యులు**



# విజ్ఞప్తి

వినా వేంకటేశం న నాథో న నాథః
సదా వేంకటేశం స్మరామి స్మరామి ।
హరే వేంకటేశ ప్రసీద ప్రసీద
ప్రియం వేంకటేశ ప్రయచ్ఛ ప్రయచ్ఛ ॥

## అర్చామూర్తి వైభవం

"అంతర్బహి శ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః" అనే వైదికసూక్తి ప్రకారం భగవానుడైన శ్రీమన్నారాయణుడు సర్వత్ర వ్యాపించి ఉన్నా ఉపాసకుల సౌకర్యంకోసం, సకలచేతనులు తనను ఆశ్రయించి ఉజ్జీవించడంకోసం పర-వ్యూహ-విభవ-అంత ర్యామి - అర్చామూర్తులనే అయిదు రూపాలను ఆ స్వామి కల్గి ఉంటాడు. వీటిలో, పరమ పదంలో ఉండే రూపం పరరూపం; క్షీరాబ్ధిలో ఉండే రూపం వ్యూహం; శిష్టరక్షణ కోసం, దుష్టశిక్షణార్థం. ధర్మసంస్థానంకోసం ఎత్తిన రామకృష్ణాద్యవతారాలు విభవాలు; చేతనాచేతనపదార్థాలలో అన్నిటిలో వ్యాపించి ఉండి, వాటిని నియమించే రూపం అంతర్యామి; దివ్యక్షేత్రాల్లో, గృహాదుల్లో భక్తులకు అభిమతం అయిన ద్రవ్యంతో వారికి ఇష్టం అయిన తీరులో చేయబడ్డ మూర్తులలో నిత్యసన్నిహితంగా ఉండే, సర్వాపరాధ సహిష్ణువు అయిన మూర్తివిశేషం అర్చామూర్తి. ఈ అయిదు రూపాలు **"అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్, శుక్రేణ జ్యోతీగ్ంషి సమను ప్రవిష్టః ప్రజాపతి శ్చరతి గర్భే అంతః"** ఇత్యాది సంస్కృతవేదసూక్తుల్లోను, **"విణ్ మీదిరుప్పాయ్ మలైమేల్ నిఱ్పాయ్ కడల్ శేర్ప్పాయ్ మణ్మీదుఴల్వాయ్ ఇవఱ్ఱుళ్ ఎఙ్గుమ్ మఱైన్దు ఉఱైవాయ్"** అని మొదలైన ద్రావిడవేదసూక్తులలోను ప్రస్తావింపబడ్డాయి. పై శ్రుతిలో **"అంభస్య పారే"** అని అనడంద్వారా పద్మనాభ నామకమైన వ్యూహం, **"భువనస్య మధ్యే"** అనడంవల్ల సూర్యామండలాంతర్వర్తి అయిన విభవం, **"నాకస్య పృష్ఠే"** అని పరరూపం, **"శుక్రేణ జ్యోతీంషి సమనుప్రవిష్టః"** అని అర్చారూపం, **"ప్రజాపతి శ్చరతి గర్భే అంతః"** అని అంతర్యామి చెప్పబడ్డాయని విజ్ఞుల వివరణం. వీటి అన్నిటిలో, అర్చావతారం సకలకల్యాణగుణపూర్ణం, శుభాశ్రయం, సర్వసమాశ్రయ ణీయం, కాబట్టి **"సర్వం పూర్ణమ్"** అనే రీతిలో సంపూర్ణం; ప్రశస్తతమం. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు **"పూర్తియుళ్ళదు అర్చావతారత్తిలే"** అని ఈ విషయాన్ని

నొక్కి వక్కాణించారు. "అర్చావతార స్సర్వేషాం బాంధవో భక్తవత్సలః" ఇత్యాది పలు సూక్తులు ఈ విషయంలో అనుసంధేయాలు.

"స్వయంవ్యక్తదైవార్షాదయ స్తు అర్చావతారభేదాః. దైవాదిష్వపి విశిష్ట ప్రతిష్ఠానా నంతరప్రసాదోన్ముఖేశ్వరసంకల్పాధీన మప్రాకృతత్వ మను సంధేయమ్" - అని అంటూ దేశికులు న్యాయసిద్ధాంజనంలో పల్కిన సూక్తి కూడా స్మరణీయం.

## విగ్రహారాధన వేదమూలకం :

విగ్రహారాధనం వైదికం కాదని, తరువాతి కాలంలో అది ఏర్పడినదని, వేదంలో అర్చామూర్తి ఆరాధనకు ఆధారాలు ఏవీ లేవని కొందరి నవీనవిమర్శకుల అభిప్రాయం. కాని, ఇది సరి కాదు. విగ్రహారాధన పరమవైదికమనే సత్యాన్ని సమర్థించే వేదప్రమాణాలు ఎన్నో ఉన్నాయి. **"అదో యుద్దారు ప్లవతే సింధోః పారే అపౌరుషమ్, తదారభస్వ దుర్హణో తేన గచ్ఛ పరస్పరమ్" (10-155-3)** అనే ఋగ్వేద సూక్తిని సాయణాచార్యుల వారు **"అదః= విప్రకృష్టదేశే వర్తమానమ్, అపౌరుషమ్ = నిర్మాత్రా పురుషేణ రహితమ్, యత్ దారు = దారుమయం పురుషోత్తమం దేవతాశరీరమ్, సింధోః పారే = సముద్ర తీరే, ప్లవతే = జలస్యోపరివర్తతే"** - అని వ్యాఖ్యానించడం ఆ కాలంలోని విగ్రహారాధనను నిరూపిస్తున్నదని విజ్ఞుల భావన. ఇదే రీతిలో, **"ప్రవిష్ణవే శూష మేతు మన్మ గిరిక్షతే ఉరుగాయాయ వృష్ణే" (1-155-2), "అద్భ్యః సంభూతః పృథివ్యై రసా చ్చ", "హృదా మనీషా మనసాఽభి క్లుప్తః"** ఇత్యాది పలు వేదసూక్తులు విగ్రహారాధనను బలపరుస్తున్నవి. ఆగమ శాస్త్రాలలో ఇది సమూర్తయజనం అని, ఉత్తమ బ్రహ్మవిద్య అని బహుధా శ్లాఘింప బడిందికూడా. స్మృతి, పురాణ, ఇతిహాసాది, వాఙ్మయంలో కూడా విగ్రహారాధ నను సమర్థించే పలు ప్రమాణాలున్నాయి. విస్తరభీతిచేత వాటిని ఇక్కడ ప్రస్తావించడం లేదు.

## వేంకటాచలప్రాధాన్యం;

ఈరీతిగా భగవానుడు ఆసేతుహిమాచలంలోగల పలు దివ్యక్షేత్రాలలో విగ్రహ రూపంలో వేంచేసి ఉన్నా, వాటిలో, శ్రీవైష్ణవసంప్రదాయప్రకారం 108 దివ్యదేశాలు ముఖ్యాలు. పరమపదం, క్షీరాబ్ధి- అనే రెండు తిరుపతులు తప్ప మిగిలిన 106 ఈ లీలావిభూతిలోనే ఉన్నాయి. ఈ 108 దివ్యక్షేత్రాలు దివ్యసూరులచేత తమ దివ్య ప్రబంధాలలో గొప్పగా కీర్తింపడ్డాయి. వీటిలో, వేంకటాచలం **"వడవేఙ్గడమ్", "వడతిరుమలై"** అని ప్రసిద్ధి చెందిన దివ్యదేశం. ఇది పూర్వకాలంలో ద్రావిడదేశానికి



ఉత్తరదిక్కుగాకూడా ప్రసిద్ధి చెందింది. "వడవేఙ్గడమ్ తెన్ కుమరి" అనే తొల్కాప్పియ గ్రంథవ్యాఖ్యానసూక్తి ఈ విషయాన్ని తెలుపుతున్నది.

## వేదంలో వేంకటాచల ప్రస్తావన

**అరాయి కాణే వికటే గిరిం గచ్ఛ సదాన్వే ।**
**శిరింబిఠస్య సత్త్వభిః తేభిష్ట్వా చాతయామసి ॥ (7-153-8)**

(పేదవాడా! గుడ్డివాడా! నీవు మహాలక్ష్మికి నివాసభూతుడైన శ్రీవేంకటాచలపతి యొక్క నివాసం అయిన వేంకటాచలానికి సాత్త్వికులైన భగవద్భక్తులతో కలసి వెళ్ళు. నీ పాపాలన్నీ తొలగిపోతాయి), అనే ఋగ్వేదసూక్తి **"రయిః కకుద్మాన్ విదధద్వినష్టం రయివద్విధానమ్, తస్మై కకుత్రే వికటాయ స్వాహా"** (పారమాత్మికో పనిషత్) (నిరవధికైశ్వర్యస్వరూపుడు, వృషభాచలనివాసి, అందఱికీ అన్ని విధాలైన వరాలను అనుగ్రహించేవాడు, ఋగ్యజుస్సామాధర్వణాలనే నాల్గు వేదాలలో సుప్రసిద్ధుడు అయిన వేంకటేశ్వరునకు నా ఆత్మను సమర్పిస్తున్నాను) ఇత్యాది పలు వైదికసూక్తులు వేంకటాద్రివైభవాన్ని కీర్తిస్తున్నాయి. పూర్వం ఉదాహరించిన **"అరాయి కాణే"** అనే ఋక్కు వేంకటాచలాన్నిగూర్చి చెబుతున్నదనే విషయాన్ని **"ఏవం శ్రీకృష్ణరూపేణ క్రీడితో వేంకటాచలే, అరాయి కాణే వికటే గిరిం గచ్ఛేతి తం విదుః, ఏవం వేదమయః సాక్షాత్ గిరీశః పన్నగాచలః"** అనే బ్రహ్మపురాణశ్లోకాలు తెలుపుతున్నవి. అంతేకాక, అనందాఌ్వాన్ విరచితం అయిన శ్రీవేంకటాచలేతి హాసమాల అనే సంస్కృతగ్రంథంలో ఈ ఋక్కును శ్రీరామానుజులవారు వేంకటా చలపరంగా వ్యాఖ్యానించారనికూడా తెలుపబడింది. పన్నెండు పురాణాల్లో విస్తృతంగా ప్రతిపాదింపబడ్డ వేంకటాచలమాహాత్మ్యాన్ని సంకలనం చేసి, తి.తి.దేవస్థానంవారు నాగరిలిపిలో చాలాకాలం క్రితమే ముద్రించారు.

## వేంకటశబ్దనిర్వచనం

వేంకటమనే సంస్కృతపదానికి రెండువిధాలైన వ్యుత్పత్తులను పురాణాలు తెలిపాయి.

సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే ।
సర్వపాపాపహారిత్వాత్ వేంకటాద్రి రితి స్మృతః ॥

అనే వరాహపురాణశ్లోంవల్ల అన్ని పాపాలు "వేం" అనే పదంచేత చెప్పబడతాయని, కటశబ్దానికి దాహం అని, పాపాలను అన్నిటినీ సమూలంగా దహిస్తుంది కనుక

వేంకటమని చెప్పబడుతున్నదని తెలుస్తున్నది. ఈ భావాన్నే **"శెన్టు వణఙ్గుమినో శేణుయర్ వేఙ్గడత్తై నిన్టు వినై కెడుక్కుమ్ నీర్మైయాల్"** అని తిరుమఙ్గైఆళ్వార్లు, **"వేఙ్కడఙ్గళ్ మెయ్‌మ్మేల్ వినై ముర్‌ఱవుమ్"** (తిరువాయ్ 3-3-8) అని నమ్మాళ్వార్లు అనుసంధించారు.

**వకారో౽మృతబీజం తు కట మైశ్వర్య ముచ్యతే ।**
**అమృతైశ్వర్యసంఘత్వాత్ వేంకటాద్రి రితి స్మృతిః ॥**

అనే వామనపురాణసూక్తివల్ల అమృతైశ్వర్యసంఘాతరూపం కనుక ఈకొండ వేంకటశబ్దంచేత వ్యవహరింపబడుతున్నదని తెలుస్తున్నది. ఈ భావాన్ని **"తిరువేఙ్గడమ్ నఙ్కుట్కు శమన్గళ్ వీడు తరుమ్ తడమ్ కున్టమే"** (తిరువాయ్-3-3-7) అని నమ్మాళ్వార్లు అనుసంధించారు. ఈ రెండు వ్యుత్పత్తులను తెలిపేటపుడు ఆళ్వార్లు పలుమార్లు ముందు నామాన్ని తరువాత అర్థాన్ని అనుసంధించడం గమనార్హం.

## వేంకటాచలప్రాచీనత

కృతయుగంలో భగవానుడు శ్వేతవరాహావతారాన్ని ఎత్తి, భూమిని ఉద్ధరించిన తరువాత, ఇంకా కొంతకాలం భూమిపై నివసించాలని ఆశపడ్డాడు. స్వామి కోరికపై వైకుంఠనుండి గరుడునిచే భూమికి తీసికొని రాబడిన క్రీడాపర్వతమే వేంకటాచలమని పురాణాలు పేర్కొంటున్నాయి. అందువల్ల కృతయుగంనాటి ఈ కొండకు గల సంప్రదాయసిద్ధమైన ప్రాచీనత తెలుస్తున్నది. శిలాశాస్త్రనిపుణులుకూడా ఈ కొండ స్వరూపస్వభావాలను పరిశీలించి చాలా ప్రాచీనమైనదని తేల్చారు. అంతేకాక, కొండపై కన్పించే శిలాతోరణం ఈ కొండ ప్రాచీనతకు బలమైన సాక్ష్యం అని వారి అభిప్రాయం.

## అదిశేషుని రూపంలో కొండ

తిరుమలలో కన్పించే పర్వతశ్రేణులు చాలా దూరం వ్యాపించి ఉన్నాయి. ఇవి శ్రీశైలం వరకు విస్తరించాయి. ఆకాశంపైకి వెళ్ళి ఈ పర్వతశ్రేణుల ఆకారాన్ని గమనిస్తే పెద్ద సర్పం చుట్ట చుట్టుకొని పరుండి ఉన్న సన్నివేశాన్ని తలపిస్తుందని పరిశోధకులు అంటున్నారు. ఈ సర్పరూపంలో శిరస్సు తిరుమలగా, మధ్యభాగం అహోబిలంగా, శ్రీశైలం చివరి భాగంగా చెప్పవచ్చునని వారు అంటున్నారు. (శ్రీ ఎన్. రమేశన్‌గారు రచించిన "హిస్టరీ ఆఫ్ తిరుపతి" గ్రంథాన్ని చూడండి) అదిశేషుడే ఈ వేంకటాద్రి రూపంగా పరిణమించాడనే పౌరాణికగాథ సత్యమని ఈ పర్వత శ్రేణుల ఆకృతి ఋజువు చేస్తున్నదనడంలో ఏ సందేహం లేదుకదా!



## ద్రావిడవాఙ్మయంలో వేంకటాద్రిప్రస్తావన

ద్రావిడవాఙ్మయంలో చాలా పురాతన గ్రంథంగా చెప్పబడే తొల్‌కాప్పియ గ్రంథానికి గల ఒక ప్రాచీన వ్యాఖ్యలో వేంకటాద్రి ప్రస్తావన ఉన్నది. సంఘకాల వాఙ్మయానికి చెందిన **అకనానూఱు, పుఱనానూఱు** అనే సంకలనగ్రంథాలలోకూడా వేంకటాచల ప్రస్తావన ప్రచురంగా కన్పిస్తున్నది. క్రీ.శ. 2వ శతాబ్దానికి చెందిన శిలప్పదికారంలో కన్పించే **"నీఙ్గ నీరరువి వేఙ్గడమ్ ఎన్నుమ్ ఓఙ్గుయర్ మలై యత్తుచ్చి పనైయణఙ్కాట్రి యుమ్ పాల్ వెణ్‌శఙ్గముమ్ శెఙ్గణ్ నెడియోన్"** ఇత్యాది సూక్తులు వేంకటాచలప్రసిద్ధిని, ఆ కొండపై ఉండే దైవం శంఖచక్రధారి అయిన శ్రీమన్నారాయణుడేనని ఋజువు చేస్తున్నవి. పరిపాడల్‌వంటి ప్రాచీనద్రావిడ గ్రంథాలుకూడా ఆ అంశాన్ని నొక్కిచెప్పాయి. భగవద్రామానుజులు పలు వేదపురాణేతిహాససూక్తులను ఉట్టంకిస్తూ వేంకటాద్రివాసుడు శ్రీమన్నారాయణుడనే సత్యాన్ని అప్రధృష్యంగా ఋజువు చేసిన వైనం వేంకటాచలేతి హాసమాలలో తెలుపబడినది. **"తిరుమలై ఒఴుకు"** అనే వేంకటాచలంలోని ఆచార్య వ్యవహారాలను తెలిపే సాంప్రదాయిక చరిత్రగ్రంథంలో కూడా ఈ అంశాన్ని స్పష్టంగా గమనించవచ్చు. ఇవేకాక, తరువాతి కాలంలో వేంకటాద్రిని, అచటి స్వామిని కీర్తిస్తూ శ్రీపిళ్ళై ప్పెరుమాళ్ అయ్యఙ్గార్ రచించిన **తిరువేఙ్గడత్తన్దాది, తిరువేఙ్గడత్తు మాలై** - అనే గ్రంథాలు, **"తిరువేఙ్గడ క్కోవై", "మేక విడుతూదు"** మొదలైన పలు కావ్యాలు వెలువడ్డాయి. ఇక, దివ్యసూరుల ప్రబంధాలలో కన్పించే వేంకటాచల స్తుతిప్రాచుర్యం సుప్రసిద్ధం కదా!

ఆంధ్రవాఙ్మయంలో వేంకటాచలప్రస్తావననుగూర్చి విచారించినపుడు, మొట్ట మొదటగా ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన నృసింహపురాణంలో తిరుమల ప్రస్తావన కన్పిస్తున్నదని పరిశోధకులు చెబుతారు. 15వ శతాబ్దానికి చెందిన అన్నమాచార్యుల వారు వేంకటేశ్వరు నిపై 32 వేల కీర్తనలు రచించారు. శ్రీకృష్ణదేవరాయలు రచించిన ఆముక్తమాల్యదలో, ముక్కుతిమ్మన రచించిన పారిజాతాపహరణంలో వేంకటేశ్వరునిగూర్చిన ప్రస్తావన ఉన్నది. తరిగొండ వేంగమాంబ వేంకటేశ్వరునిపై రచించిన పలు కావ్యాలు కూడా పేర్కొనదగినవి. ఇవేకాక, వేంకటేశ్వరునిగూర్చి రచింపబడ్డ ముద్రిత - అముద్రిత ఆంధ్రకృతులు ఎన్నో ఉన్నాయి.

నాలాయిరంలో తిరువేఙ్గడముడైయాన్ పాశురాలు

ఆళ్వార్లు పన్నెండుమందిలో భక్తాంఘ్రిరేణువులనే తొణ్డరడిప్పొడి ఆళ్వార్లు, మధురకవులు అనే ఇద్దరు తప్ప మిగిలిన పదిమంది వేంకటేశ్వరుని కీర్తించారు. ఆళ్వార్లు శబ్దతః వేంకటేశ్వరుని పొగడిన పాశురాల సంఖ్యనుగూర్చి విభిన్నాభి ప్రాయాలు కన్పిస్తున్నాయి.

శ్రీమాన్ సుదర్శనాచార్యస్వామివారి వివరణంతో టి.టి.డి.వారు ముద్రించిన గ్రంథంలో ఆళ్వార్ల పాశురాలు 197 అని, పూర్వాచార్యులైన తిరువరఙ్గత్తముదనార్, శ్రీ దేశికులు అనుగ్రహించిన పాశురాలు 3 అని - మొత్తం పాశురాల సంఖ్య 200 గా చూపబడింది. ఈ వివరణలలో తిరుమలకు సంబంధించిన పలు పాశురాలు కన్పించడంలేదు. ఉదాహరణకు - ఇరణ్డామ్ తిరువన్దాదిలోని 48వ, 70వ పాశురాలు పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యలో స్పష్టంగా తిరుమల పరంగా వివరింప బడినా అవి ఈ వివరణంలో చోటు చేసికోకపోవడాన్ని గమనించాలి. అదే రీతిలో తిరుచ్ఛన్దవిరుత్తంలోని "కున్దిల్ నిన్ఱ" అనే 48వ పాశురం, 65వ పాశురం, తిరువాయ్‌మొழிలోని 2-8-7, 5-10-6, 8-2-8, 10-4-4 సంఖ్యలు గల పాశురాలు, పెరియతిరుమొழிలోని 2-8-2, 7-1-3, 8-2-6 సంఖ్యలు గల పాశురాలు - ఇవన్నీ శ్రీవేంకటేశ్వరుని పరంగానే అన్వయించి, అర్థం చెప్పబడినా ఇవి ఆ గ్రంథంలో కానరావు. ఇందువల్ల ఈ గ్రంథం ఒకవిధంగా అసంపూర్ణం అనే చెప్పాలి. ఇక శ్రీ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ స్వామివారు (తమిళ శ్రీసుదర్శన పత్రికాసంపాదకులు - పుత్తూరు అగ్రహారం) నాలాయిర దివ్యప్రబంధలోకంలో చూపించిన వివరాలలోకూడా పెరియతిరువన్దాదిలోని "కల్లుమ్ కనైకడలుమ్" అనే 68వ పాశురం, తిరువాయ్‌మొழிలోని "విణ్‌మీదిరుప్పాయ్" (6-9-5) అనే పాశురం, తిరునెడున్దాణ్డకంలోని "పొన్నానాయ్'' (10) అనే పాశురం తిరుమలకు సంబంధించినవి అయినా, అవి కన్పించడం లేదు. అంతేకాక, ఈ గ్రంథంలో తిరువాయ్ మొழிలోని "మాలుక్కు" (6-6) అనే దశకంలోని 11 పాశురాలు శ్రీవేంకటేశ్వరుని పరంగా పూర్వాచార్యులచే చూపబడినా, ఈడు వ్యాఖ్యలో చివరి పాశురం మాత్రమే వేంకటేశ్వరుని పరంగా వివరింపబడడం గమనార్హం.

ఇక, తిరుప్పల్లాణ్డులోని "పల్లాణ్డు పల్లాణ్డు" అనే మొదటి పాశురం శ్రీవేంకటేశ్వరుని పరంగా అన్వయించవచ్చునని ఈగ్రంథంలో వివరింపబడింది. పెరియతిరుమడల్‌లోని "మన్నుమ్ వడమలైయై" అనే సూక్తిని కొన్ని గ్రంథాలు



తిరుమలపరంగా చూపడం ప్రామాదికం. ఈ ప్రయోగం క్షీరాబ్ధిమధనంలో కవ్వంగా ఉపయోగపడిన మందరాన్ని నిర్దేశిస్తుందని పూర్వాచార్య వ్యాఖ్య. పూర్వాచార్య వ్యాఖ్యలనుబట్టి చూస్తే ఒక విషయం మాత్రం సుస్పష్టం. దివ్యసూరి సూక్తులలో ఎక్కడైనా స్వామి నిలచిన ఉన్న సన్నివేశంగాని, నిర్విశేషంగా కొండపై ఉండే సన్నివేశంగాని చెప్పబడితే, అది తిరుమలలోని స్వామి పరంగానే పూర్వా చార్యులు వ్యాఖ్యానించారు. పైన చూపించిన వివరాలనుబట్టి నాలాయిరంలోని పాశురాల సంఖ్యను ఈ విధంగా లెక్కించవచ్చునని తోస్తుంది.

| | | |
|---|---|---|
| పొయ్‌కై ఆళ్వార్లు | - | 10 |
| పూదత్తాళ్వార్లు | - | 11 |
| పేయాళ్వార్లు | - | 19 |
| తిరుమழிశై ఆళ్వార్లు | - | 16 |
| నమ్మాళ్వార్లు | - | 48 |
| కులశేఖరాళ్వార్లు | - | 11 |
| పెరియాళ్వార్లు | - | 08 (7+1 తిరుప్పల్లాణ్డు) |
| ఆణ్డాళ్ | - | 16 |
| తిరుప్పాణ్ ఆళ్వార్లు | - | 02 |
| తిరుమఙ్గై ఆళ్వార్లు | - | 66 |
| మొత్తం | - | 207 |

తిరువరఙ్గత్తముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూற்றన్దాదిలో రెండు పాశురాలలో వేంకటేశ్వరుడు స్తుతింపబడ్డాడు.

కాలాన్నిబట్టి నాలాయిరదివ్యప్రబంధంలో మొట్టమొదటి ప్రబంధాలుగా చెప్పదగిన ముదలాళ్వార్ల తిరువన్దాదిప్రబంధాల్లో కన్పించే దివ్యక్షేత్రాల ప్రశంసలో ప్రముఖంగా కన్పించేది వేంకటాచలమే. ఇందువల్ల, చారిత్రకదృష్టిలో పరిశీలించి నపుడు, ప్రాచీనకాలంలో ద్రావిడదేశంలో వేంకటాచలానికి ఉన్న ప్రసిద్ధి ద్యోతక మవుతుంది. "శెన్దమిழ் పాడువార్ వణఙ్గుమ్ దేవర్" అనే సూక్తికూడా ఈ విషయాన్ని బలపఱుస్తున్నది. కాబట్టే, భగవద్రామానుజులవారు ఇయఱ్పా ప్రబంధానికి ప్రధానప్రతిపాద్యుడు వేంకటేశ్వరుడేనని నిర్ణయించి, తిరుమలకొండపై జరిగే అధ్యయనోత్సవాలలో ముందుగా ఇయఱ్పాప్రబంధాన్ని అనుసంధించాలనే కట్టడిని ఏర్పాటుచేశారు.

తిరుప్పావై ప్రబంధప్రతిపాద్యుడుకూడా వేంకటేశ్వరుడేనని, "శెల్వ త్తిరుమాలాల్, వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై" ఇత్యాదిగా ఈ ప్రబంధంలో కన్పించే పదప్రయోగాలు ఈ విషయాన్ని సూచిస్తున్నాయని పెద్దల అభిప్రాయం. తిరువాయ్ మొழிప్రబంధంలోని "**ఒழிవిల్ కాలమ్**" అనే (3-3) దశకంలో "**అన్గు శాల మళన్దపిరాన్ పరన్ శెన్రు శేర్ తిరువేఙ్గడమామలై**" అని వేంకటేశ్వరుని త్రివిక్రమ రూపిగా అనుసంధించారు. "**ఆழி యెழ**" దశకంలోని మొదటి పాశురంలో కూడా నమ్మాழ்వార్లు "**అప్పన్ ఊழி యెழఉలకమ్ కొణ్డ వాతే**"అని అన్నందున ఈ దశకం వేంకటేశ్వరునిపరంగా అన్వయింపబడిందని చెప్పవచ్చు. ఈ దశకంలోని పలు పాశురాలలో "**అప్పన్**" అని ప్రయోగింపబడింది. "**తిరుమలై అప్పన్**" అనే పేరు వేంకటేశ్వరునకు ప్రసిద్ధం అయిన నామం కదా! తిరుప్పావై ప్రబంధంలోకూడా గోదాదేవి 3వపాశురంలో "**ఓఙ్గి ఉలకళన్ద ఉత్తమన్ పేర్పాడి**"అని త్రివిక్రమ స్వరూపుడైన వేంకటేశ్వరస్వామిని ఆశ్రయించాలని సంకల్పించి, 17వ పాశురంలో "**అమ్బర మూడఱుత్తి ఓఙ్గి ఉలకళన్ద ఉమ్బర్కోమానే! ఉఱఙ్గాదు ఎழுన్దిరాయ్**" అని ఆ త్రివిక్రమమూర్తి అయిన వేంకటేశ్వరునకు సుప్రభాతాన్ని పాడడమే కాకుండా, 24వ పాశురంలో "**అన్రివ్వులకమ్ అళన్దాయ్ అడి పోற்றி**" అని త్రివిక్రమరూపుడైన వేంకటేశ్వరునకు మంగళంపాడిందికదా! తిరుప్పావై తనియన్ పాశురంలోని "**వేఙ్గడ వెఱ్పెన్నై విది ఎన్ర ఇమ్మాற்றమ్**" - అనే సూక్తికూడా ప్రకృతంలో అనుసంధేయం.

ఇవన్నీ ఒక ఎత్తు అయితే, తిరువాయ్మొழி ప్రబంధప్రతిపాద్యుడు వేంకటేశ్వరుడే కావడం ఇంకొక ఎత్తు. తిరువాయ్మొழி ద్వయార్థం ప్రతిపాదకం అనే అంశం అందఱు అంగీకరించే విషయం. ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యంలో ప్రతిపాదింపబడ్డ కైంకర్యప్రార్థన తిరువాయ్మొழிలోని "**ఒழிవిల్ కాలమెల్లామ్**" (3-3) అనే దశకంలోను, పూర్వవాక్య ప్రతిపాదితం అయిన శరణాగతి "**ఉలక ముణ్డ పెరు వాయా**" (6-10) అనే దశకంలోను ప్రతిపాదింపబడ్డాయి. ఈ రెండు వేంకటేశ్వరస్వామిని కీర్తించేవే. కనుక తిరువాయ్మొழி ప్రబంధం సాకల్యంగా వేంకటేశ్వరుని పరం - అని చెప్పవచ్చు. కాబట్టే భగవద్విషయ తనియన్ శ్లోక వ్యాఖ్యను అనుగ్రహించిన పిళ్ళైలోకమ్ జీయర్ ఆ వ్యాఖ్య చివరలో - "**తిలదములకు క్కాన తిరువేఙ్గడత్తానై యలకిల్ పుకழ்న్దాది ఆయిరముములకురైత్తాన్ శడకోపన్ ఉత్తమర్కళ్ నెఞ్జిల్ విరిత్తాన్ పెరుమ్బూదూర్ వేన్దు.**" (లోకానికి తిలకంవలె ఆభరణంవంటివాడైన శ్రీవేంకటేశ్వరుని సాటి లేని కీర్తిని కల వేయి పాశురాలతో కలసిన అన్దాది ప్రబంధంతో శఠకోపులు కీర్తించారు. దానిని శ్రీపెరుమ్బూదూర్లోని స్వామి వివరించారు.) అనే పాశురాన్ని అనుగ్రహించారు. తిరువాయ్మొழி పాశురాలను దృష్టిలో ఉంచుకొని బ్రహ్మసూత్రాలకు శ్రీభాష్యాన్ని అనుగ్రహించిన భగవద్రామానుజుల వారుకూడా శ్రీభాష్యప్రారంభంలో "**శ్రుతిశిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా**" అని అంటూ సముచితేష్ట దేవతా ప్రార్థన చేసినందువల్ల శ్రీభాష్యప్రతిపాద్యుడుకూడా వేంకటేశ్వరుడేనని చెప్పవచ్చు. ఇక్కడ "**శ్రుతిశిరసి**" అంటే సంస్కృత వేదాంతమే కాదు, ద్రావిడ వేదాంతంకూడా. ఈ విధంగా ఉభయవేదాంత ప్రతిపాద్యుడు తిరుమల వేంకటేశ్వరుడు అని కొందఱు అభిజ్ఞుల చమత్కారోక్తి.



## శ్రీవేంకటేశ్వరుని వాత్సల్యగుణం

అర్చామూర్తిలో అన్ని కల్యాణగుణాలు సంపూర్ణంగా ఉంటాయని అనడంలో ఏ సందేహం లేదు. కాని, ఆழ்వార్లు తమ దివ్యప్రబంధాలలో ఒక్కొక్క దివ్యదేశంలోని అర్చామూర్తిలో ఒక్కొక్క కల్యాణగుణం విశేషంగా ప్రకాశిస్తున్నదని అన్నారు. ఆ క్రమాన్నిబట్టి చూస్తే - "**మణ్ణోర్ విణ్ణోర్ వైప్పిల్- పోకిన్ద ఏழுలకుక్కు ఉయిర్పాశమ్ వైత్త నికరిల్ వాత్సల్య ముజ్జ్వలమ్**" అనే ఆచార్యహృదయకారుల సూక్తి ప్రకారం తిరుమలలోని వేంకటేశ్వరునిలో వాత్సల్యమనే మహాగుణం స్ఫుటంగా ప్రకాశిస్తున్నదని చెప్పవలసిఉన్నది. భగవానునకు ఉండే కల్యాణగుణాలలో వాత్సల్యమనే గుణం చాలా దొడ్డది. కరుణ, క్షమ, మార్దవాది ఆత్మగుణాల కిది మూలం. కాబట్టే శ్రీరామానుజుల వారు శరణాగతిగద్యలో భగవత్కల్యాణగుణాలలో ఒకటిగా వాత్సల్యాన్ని ఒకసారి అనుసంధించడంతో తృప్తిపడకుండా, తిరిగి "**ఆశ్రితవాత్సల్యైకజలధే**" అని అంటూ ఈ గుణాన్ని పలుమార్లు ప్రత్యేకంగా అనుసంధించారు. పై ఆచార్యహృదయ అసకృత్ గ్రంథ సూత్రాన్ని శ్రీమద్వరవర మునులు - "**కణ్ణావా నెన్నుమ్ మణ్ణోర్ విణ్ణోర్క్కు**" (భూలోక వాసులకు, పరమపదవాసులకు నేత్రస్థానీయుడు) అని, "**తణ్ణరువి వేఙ్గడమే వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు**" (చల్లని కొండ సెలయేళ్ళను కల వేంకటాచలమే పరమపద వాసులకు, భూలోకవాసులకు దాచి ఉంచిన నిధి) అని అనే రీతిలో ఉభయ

విభూతుల లోనివారికి చేర్చిపెట్టిన నిధివలె ప్రాప్యంగా ఉండే తిరుమలలో **“పోక్కిన్ఱ కాలజ్గళ్ పోయ కాలజ్గళ్ పోకు కాలజ్గళ్ తాయ్ తన్దై యుయిరాకిన్ఱాయ్”** (వర్తమాన భూత భవిష్యత్కాలాలో అన్నిటిలో తల్లి, తండ్రి, ప్రాణంగా అయినవాడవై ఉన్నావు) అన్నట్లు, **“కణ్ణాయ్ ఏఴులకుక్కుమ్ ఉయిరాయ వెమ్ కార్వణ్ణనై”** (ఏడు లోకాలలోని వారికి నేత్రభూతుడై, ప్రాణమైన మా మేఘవర్ణుని) అని చెప్పబడే రీతిలో అన్నికాలాల లోను ఆత్మలందరికి సర్వవిధబంధువై, అందఱికి ఆత్మయై, అంతర్యామియొక్క గుణం అయిన, **“ఎన్ కణ్ పాశమ్ వైత్త”** (నీచుణ్ణి అయిన నాపట్ల వ్యామోహాన్ని కల్గిన) **“నికరిల్ పుకఴాయ్”** (సాటిలేని కల్యాణగుణాన్ని కలవాడా) అని అన్నట్లు చాలా తక్కువవాడను అయిన నాపట్ల పాశాన్ని కల్గి ఉన్నాడనే సాటిలేని గుణాన్ని కలవాడా! అని చెప్పబడే వాత్సల్యం **“పరమ్ శుడర్ శోది”** (గొప్పగా ప్రకాశించే జ్యోతిస్స్వరూపుడు) అని పలికే రీతిలో సేవించేటట్లుగా ఉజ్జ్వలంగా ఉంటుంది'' - అని వివరించారు. పై తిరువాయ్మొఴిసూక్తిని, ఆచార్య హృదయసూక్తిని, శ్రీవరవర మునుల వ్యాఖ్యను దృష్టిలో ఉంచుకొనే 19వ శతాబ్దం ఉత్తరార్ధంలో - 20వశతాబ్దం ప్రారంభంలో తిరుపతిలో వేంచేసి ఉన్న ఉద్దండ పండితులు, **మహావిద్వాన్, తిరుమలై అనన్దాణ్పిళ్ళై పురిశై శ్రీరంగాచార్య స్వామివారు** - ఉజ్జ్వలవేంకటనాథస్తోత్రమనే స్తుతిలో ఈవాత్సల్య గుణాన్ని కీర్తిస్తూ, ఆనన్దాఴ్వాన్ గడ్డపారదెబ్బవల్ల తనకు చుబుకంపై ఏర్పడిన దెబ్బ గుర్తును ఈనాటికీ వేంకటేశ్వరుడు తన రూపంలో ధరించి ఉండడం స్వామి వాత్సల్యానికి గుర్తు- అని అన్నారు. ఇటువంటి వాత్సల్యం అనే మహాగుణాన్ని కలవాడు వేంకటేశ్వరుడు.

## పూర్వాచార్యవ్యాఖ్యానసూక్తుల్లో వేంకటేశ్వరుని వైభవం

పూర్వాచార్యులు తాము అనుగ్రహించిన దివ్యప్రబంధవ్యాఖ్యానాలలో వేంకటాచల వైభవాన్ని, వైశిష్ట్యాన్ని ఆ యా సందర్భాల్లో సముచితంగా వ్యక్తంచేశారు. ఉదాహరణగా ఒకటి, రెండు సూక్తులు మాత్రం విన్నపింపబడుతున్నాయి. పరమపదంలో ఉండే పరరూపం కంటే, క్షీరాబ్ధిలో ఉండే వ్యూహరూపంకంటే వేంకటాచలంపై వేంచేసి ఉండే స్వామి శీలాదిగుణావిష్కరణద్వారా ఎక్కువగా ప్రకాశిస్తున్నాడనే విషయాన్ని నమ్పిళ్ళై- **“వేఙ్గడత్తు ఎఴిల్ కొళ్ శోది”**అనే తిరువాయ్మొఴి (3-3-1) సూక్తిని **“వానార్ శోదియైయుమ్, నీలాఴిచ్చోది యైయుమ్** వ్యావర్తిక్కిఱదు. వానార్ శోది పకళ్విళక్కుప్పట్టిరుక్కుమ్. నీలాఴిచ్చోది కడల్ కొణ్డు కిడక్కుమ్. వేఙ్గడత్తెఴిల్ కొళ్ శోది కున్ఱత్తిట్ట విళక్కాయిరుక్కుమ్. వేఙ్గడమ్ మేయ విళక్కిఱే”అని వ్యాఖ్యానించడం ఇందుకొక నిదర్శనం. ఈ సూక్తిని కొంచెం వివరంగా అనుభవిద్దాం. నమ్మాఴ్వార్లు తిరువాయ్ మొఴిలో పరమపదంలో ఉండే పరరూపాన్ని **“వానార్ శోది”(2-5-5)** అని, క్షీరాబ్ధిలోని వ్యూహరూపాన్ని పెరియతిరువన్దాదిలో **“నీలాఴిచ్చోదియాయ్”(34)** అని సాధారణంగా నిర్దేశించి, ఇక్కడ వేంకటాచలంలో అధివసించి ఉండే అర్చామూర్తిని మాత్రం **“వేఙ్గడత్తు ఎఴిల్ కొళ్ శోది”** అని విశిష్టమైన జ్యోతిస్సుగా నిర్దేశించారు. అత్యర్కానలదీప్తం అయిన పరమపదంలో ఉండే రూపం ఎంత గొప్పది అయినా, అక్కడ సౌశీల్య సౌలభ్యాదిగుణాలు వ్యక్తం కావు, కనుక **“సకృద్దివాహైవాభవతి”, “అథ యదతః పరో దివో జ్యోతి ర్దీప్యతే”** అనే ఛాందోగ్య సూక్తుల చొప్పున పగటి దీపంలా ఉంటుంది. వ్యూహంలోని రూపంకూడా జ్యోతిస్సు అయినా, బ్రహ్మాదులు కొంతమందికి తప్ప అందఱికీ అందుబాటులో ఉండేది కాదు. కనుక అదికూడా మినుకు మినుకుమని ఉంటుంది. ఇక, ఎత్తైన వేంకటాచలంపైన వెలిగే అందమైన జ్యోతిస్సు **“కానముమ్ వానరముమ్ వేడుముడై వేఙ్గడమ్”** అని చెప్పే రీతిలో వ్యాధులను, తిర్యక్కులను సైతం అనుగ్రహించడంవల్ల సౌశీల్యాదిగుణాలతో మిక్కిలిగా ప్రకాశిస్తుంది - అని ఈ సూక్తిలోని భావం. దీనివల్ల పర, వ్యూహాలకంటే అర్చామూర్తి అయిన వేంకటేశ్వరుని కుండే వైశిష్ట్యం తెలుపబడింది. ఇపుడు ఇంకో ఉదాహరణాన్ని గమనిద్దాం.

శ్రీవైష్ణవదివ్యదేశాలలో తిరుమాలిరుమ్శోలై అనబడే వనగిరికి, తిరుమల అనబడే వేంకటాద్రికిమధ్య పరస్పరసామ్యాన్ని తెలుపుతూ తిరుమఙ్గైమన్నన్ పెరియ తిరుమడల్ అనే ప్రబంధంలో **“తెన్ననుయర్ ప్పొరుప్పుమ్ దెయ్వ వడమలైయుమ్”** అని అనుగ్రహించారు. దక్షిణ దిక్కులో ఉండే వనగిరి, ఉత్తరదిశలో ఉండే వేంకటగిరి అనే ఈ రెండు భూదేవికి రెండు అందమైన స్తనాలవంటివి అని ఈ సూక్తి భావం. ఈ రెండింటిలోకూడా వేంకటాద్రికి ఉండే వైశిష్ట్యాన్ని నంబిళ్ళై తిరువాయ్మొఴి ఈడు వ్యాఖ్యలో **“మున్నీర్ ఞాలమ్” (3-2)** అనే దశకానికి ప్రవేశాన్ని అనుగ్రహిస్తూ, **“ఆర్యర్కళ్ ఇఴన్ద** మ్లేచ్ఛభూమియిలుళ్ళార్క్కు ముకమ్ కొడుత్తుక్కొణ్డిరుక్కిఱ నీర్మైయితే అఙ్గు; కానముమ్ వానరముమ్ వేడుమానవర్గళుక్కు ముకమ్ కొడుత్త నీర్మై యుణ్డిఱే యిఙ్గు” అని అనుగ్రహించడంవల్ల, ఈసూక్తిని అరుంబద

కారులు "వనశైలస్థితే రపి వేంకటాచలస్థితా శీలాధికతాం ప్రదర్శ్య సమాధత్త ఇతి పరిహారాంతర మాహ" అని వివరించడంవల్ల వనగిరికంటె వేంకటగిరికి ఉండే వైశిష్ట్యం ఈసూక్తి తెలుపుతున్నది అనే అంశం స్పష్టం. ఇటువంటి వ్యాఖ్యాన స్వారస్యాలను సహృదయులు "న హి నిందాన్యాయం" తో గ్రహించాలి.

తిరువాయ్‌మొళి ప్రబంధంలోని "ముడిచ్చోది" అనే దశకంలో "తెఱ్కుత్తిరుమలై" అనబడే తిరుమాలిరుమ్ శోలైలో వేంచేసి ఉండే అళకర్ (సుందరబాహుస్వామి) సౌందర్యాన్ని, ఆ స్వామిదివ్యావయవాలకు, వాటికి అలంకరింపబడ్డ పలు దివ్యాభరణాలకు గల సుఘటితత్వాన్ని, వేదవైదికపురుషులు కూడా పరిచ్ఛేదించడానికి సాధ్యం కాని స్వామి గొప్పతనాన్ని, దానినికూడా కబళీకరించే రీతిలోని ఆశ్రితవాత్సల్యాన్ని దర్శించి అనుభవించి విస్మితులయ్యారు. ఈ విధంగా సుందరబాహుస్వామి అనుభవాన్ని పొందిన ఆళ్వార్లకు ఇంకా ఇంకా ఆ అనుభవాన్ని పూర్ణంగా పొందాలనే ఆశ కల్గింది. కాని, సుందబాహుస్వామి సౌందర్యం అపరిచ్ఛిన్నం అయినందున, ఆళ్వార్లు దానిని పరిచ్ఛేదించి అనుభవించలేకపోయారు. ఈ విధంగా తాము అనుభవించలేకపోవడానికి గల కారణం తమ కరణసంకోచమేనని తలచి శోకించే వీరిని చూచి భగవానుడు "ఆళ్వార్లూ! మీరు నన్ను పూర్తిగా అనుభవించలేకపోవడం మీ కరణసంకోచంవల్ల కాదు సుమా! కరణసంకోచం లేని నిత్యసూరులుకూడా నన్ను అనుభవించేటపుడు ఈ విధంగానేసుమా పూర్తిగా అనుభవించలేక ఆర్తిని పొందుతారు. దీనికి కారణం పరవ్యూహ విభవాలతోపాటు, అర్చావతారంతోపాటు తేడా లేకుండా అన్నిటిలోను విషయం (నావైభవం) అపరిచ్ఛిన్నం కావడమే. మీరు తలచిన రీతిలో అనుభవాన్ని పొందేటట్లుగా నేను వేంకటాద్రిపై వేంచేసి ఉన్నాను. అక్కడకు వచ్చి నన్ను దర్శించి ఆనందించండి'' అని అన్నాడు. అపుడు ఆళ్వార్లు "కణ్ణనై క్కణ్డు కొణ్డు నిలైప్పెఱ్ఱు ఎన్నెఞ్జమ్ పెఱ్ఱతు నీడుయిరే!" అనే రీతిలో మనస్సులో సమాశ్వాసాన్ని పొంది, భగవదనుభవాన్ని పొందారు. ఈ విషయాన్ని నమ్బిళ్ళై తమ ఈడులో "అళకరుడైయ సౌందర్యాదికళై అనుభవిక్కప్పుక్కవిడత్తిల్ విళాక్కొలైక్కొణ్డు అనుభవిక్కలాయిరున్దతిల్లై ..... అపరిచ్ఛిన్నవిషయమాకైయాలే పరిచ్ఛేదిత్తు అనుభవిక్కవొణ్ణాతొళియ,... తమ్ముడైయ కరణసంకోచనిబంధనమాక వన్దదెన్ఱు అనుసంధిత్తు... నిర్మర్యాదవ్యసనసాగరాంతర్నిమగ్నరాయ్, "ముడిన్దేనే యన్ఱో !" ఎన్ఱు ఇవర్ శోకిక్క, "నీర్, కరణసంకోచత్తాలే వన్దదు ఎన్ఱు శోకిక్కవేణ్డా. కరణసంకోచమిల్లాతారుమ్ నమ్మై అనుభవిక్కుమిడత్తిల్ ఇప్పడియే కాణుమ్ పడువతు" ఎన్ఱు ఇవరిళవై ప్పరిహరిక్కక్కోలి, "నీర్ నినైత్త వకైకళెల్లామ్ పరిమాఱుకైక్కీడాక వడక్కిల్ తిరుమలైయిలే నిన్ఱోమ్; అఙ్గే కిట్టి అనుభవియుమ్" ఎన్ఱు తాన్ అఙ్గు నిఱ్కిఱ నిలైయై క్కాట్టి సమాధానమ్ పణ్ణ సమాహితరాయ్ త్తలైక్కట్టుకిఱార్" అని స్పష్టం చేశారు. ఇందువల్ల ఈ దశకం చివరలో ఆళ్వార్లు "నిలైప్పెఱ్ఱ ఎన్నెఞ్జమ్ పెఱ్ఱతు నీడుయిరే" అని తమ మనస్సు సమాశ్వాసాన్ని పొందింది; ఆత్మవస్తువు నిత్యత్వాన్ని పొందింది'' అని అనడానికి కారణం వేంకటాద్రిలో వేంచేసి ఉండే తన అనుభవాన్ని వారికి భగవానుడు కల్గించడమేనని ఏర్పడుతున్నది. కనుక ఈ దశకం వేంకటేశ్వరుని అనుభవానికి సంబంధించినదని తెలుస్తున్నది. పై నమ్బిళ్ళైసూక్తిని వివరించే అడైయవళైన్దాన్ అరుంబదం- "అఙ్గు నిఱ్కిఱ నిలైయై ఇతి) - అనుభవిత్తు కైంకర్యమ్ ప్రార్థిక్కవేణ్డుకైయాలే, ఇత్తిరువాయ్‌మొళియుమ్ తిరువేఙ్గడముడైయాన్ విషయమెన్ఱు కరుత్తు" అని పల్కింది. దీనివల్లకూడా ఈ దశకం శ్రీవేంకటేశ్వరుని అనుభవానికి సంబంధించినదని తెలుస్తున్నది. ఈ సందర్భంలో ఒన్బదినాయిరప్పడివ్యాఖ్యను అనుగ్రహించిన నంజీయర్ "తిరుమలైయిలే నిన్ఱరుళినపడియై క్కాట్టి యరుళ" అని, ఇరుపత్తు నాలాయిరప్పడి వ్యాఖ్యలో పెరియవాచ్చాన్‌పిళ్ళై -"వడక్కుత్తిరుమలైయిలే నిఱ్కిఱ నిలైయై క్కాట్టి సమాధానమ్ పణ్ణ" అని అనుగ్రహించడం, ఆఱాయిరప్పడి వ్యాఖ్యలో తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ 10వ పాశురంలోని "కణ్ణనై క్కణ్డుకొణ్డు" అనే సూక్తిని "ఎమ్బెరుమానై తిరుమలైయిలే కణ్ణాలే కాణప్పెఱ్ఱేన్" అని అనడం, ఈ దశకసారాన్ని వివరించే తిరువాయ్‌మొళి నూఱ్ఱన్దాదిపాశురంలో "కణ్ణన్ ఒరుమైప్పడుత్తాన్" అనే సూక్తిని వ్యాఖ్యానిస్తూ శ్రీపిళ్ళైలోకమ్‌జీయర్ "కరణసంకోచముడైయ తిర్యక్కుకళుమ్ పరిచర్యై పణ్ణుమ్బడియాన పెరియతిరుమలైయిల్ నిలైయై క్కాట్టి సమాధానమ్ పణ్ణినాన్" అని అనడం, "పన్నీరాయిరప్పడి వ్యాఖ్యాత అయిన అళకియమణవాళ చ్చీయర్" "ఒళివిల్ కాలమ్" (2-3) దశకప్రవేశంలో "నివృత్తవిరోధికరై క్కొళ్ళుమ్ శేషవృత్తియై క్కొళ్ళుకైక్కాకవన్ఱో! నామ్ సన్నిహితరాయిఱ్ఱు" - ఎన్ఱు పెరియతిరుమలైయిల్ నామ్ నిఱ్కిఱ నిలైయై ప్రకాశిప్పిత్త ఈశ్వరనుక్కు" అని పల్కడం ఈ విషయాన్ని మఱింత ద్రఢీకరిస్తున్నది.



అయినా, ఈ దశకంలోని పాశురాలు శ్రీవేంకటేశుని స్తుతించే పాశురాల సంఖ్యలో పరిగణింపబడకపోవడానికి కారణం శబ్దతః శ్రీవేంకటేశ్వరుని తిరునామం

ప్రయోగింపబడకపోవడం కావచ్చు. అయితే, అభిజ్ఞులైన పెద్దల సూక్తి ఈ విషయంలో ప్రమాణం.

ఇప్పుడు సుప్రసిద్ధ ఉభయవేదాంతవిద్వాంసులు, తిరుపతి వాస్తవ్యులు కీర్తిమూర్తులు, న్యాయవేదాన్త విద్వాన్, శ్రీవైష్ణవసింహ బిరుదాంకితులు, **ఉ.వే. శ్రీమాన్ టి.ఏ. కృష్ణమాచార్యస్వామివారు "తిరుమలైయప్పన్ తిరువరుళ్"** అనే వ్యాససంకలనాత్మకమైన గ్రంథంలో తెలిపిన కొన్ని మధురమైన అంశాలు ప్రస్తావింపబడుతున్నాయి.

నమ్మాఴ్వార్లు అనుగ్రహించిన తిరువాయ్‌మొఴి ప్రబంధంలో **"వీఱ్ఱిరున్దేఴులకుమ్" (4-5)** అనే దశకంలో **"పోఱ్ఱి"** అని అంటూ భగవానునకు మంగళాశాసనం చేశారు. ఈ దశకంలో వేంకటేశ్వరునిగూర్చి ఆఴ్వార్లు కీర్తించినట్లుగా పల్కిన ఆచార్యుల వివరణానికి తగినట్లుగా మంగళాశాసనంకూడా ఆ స్వామిని గూర్చినదే అని అనడం యుక్తం. **"మాఱి మాఱాత తణ్ణమ్మలై వేఙ్గడత్తణ్ణలై"** అనే శ్రీవేంకటేశ్వరుని ప్రస్తావన తప్ప వేఱు ఏ అర్చావతార ప్రసక్తి ఈ దశకంలో లేదనే విషయంకూడా ఇక్కడ గమనార్హం. అంతేకాక, **"వేఙ్గడత్తణ్ణలై కారిమాఱన్ శడకోపన్‌శొల్ ఇప్పత్తాల్"** అని అనడంవల్ల ఈ దశకం పూర్తిగా శ్రీవేంకటేశ్వరుని గూర్చినదే- అని చెప్పవచ్చు. పైగా, ఈ దశకంలో నమ్మాఴ్వార్లు చేసిన కొన్ని ప్రయోగాలు శ్రీవేంకటేశ్వరునకు చక్కగా పొసగడం కూడా గమనించదగినది. **"మైయకణ్ణాళ్ మలర్‌మేల్ ఉఱై వాఴ్ ఉఱై మార్బినన్" (4-5-2)** అనే ప్రయోగం అలర్‌మేల్‌మఙ్గై నిత్యవాసం చేసే వక్షస్సును కల వేంకటేశ్వరునకు తగినది. **"కూనల్‌శఙ్గత్తడక్కైయవనై" (4-5-9)** అనే ఇంకొక ప్రయోగంకూడా **"కూనేఱు శఙ్గమిడత్తాన్‌తన్"** అనే కులశేఖరులచే **(4-1-)** కీర్తింపబడ్డ వేంకటేశ్వరునకే చెందుతుంది. **"నమక్కుమ్ పూవిన్ మిశై నఙ్గైక్కుమ్ ఇన్బనై"** (లక్ష్మీదేవి ఆనందాన్ని కల్గించడానికి ముందే మనకు ఆనందాన్ని కల్గించేవాడు) అని అనడంద్వారా తెలుపబడ్డ, మనతో ఏ భేదం లేకుండా కలసి వర్తించడమనే శీలగుణం శ్రీవేంకటేశ్వరునకు చెందినదే అనే విషయాన్ని **"మాఱి మాఱాత"** అనే **(4-5-11)** పాశురవ్యాఖ్యలో "నమక్కుమ్ పూవిన్ మిశై నఙ్గైక్కుమ్ ఇన్బనై" ఎన్ఱు నిత్యానపాయినియాన పెరియపిరాట్టియార్‌క్కు మున్బే నిత్యసంసారికళుక్కుమ్ శీలవత్తైయై చ్చొల్లిఱ్ఱాకైయాలే, శీలత్తుక్కెల్లైయాన తిరువేఙ్గడముడైయానై



**యాయిఱ్ఱు కవిపాడిఱ్ఱు"** అని అంటూ వ్యాఖ్యాత నమ్బిళ్ళై స్పష్టం చేశారు. కాబట్టి ఈ **"వీఱ్ఱిరున్దేఴులకుమ్"** అనే దశకం పూర్ణంగా శ్రీవేంకటేశ్వరునకు చెందినది. దీనినిబట్టి ఈ దశకంలో **"పోఱ్ఱి"** అని ఆఴ్వార్లు పల్కిన మంగళాశాసనం శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి చేసినదేనని దృఢపడుతున్నది. ఇంతేకాక, నమ్మాఴ్వార్లు శ్రీవేంకటేశ్వరుని **"ఎన్నై తన్నై తన్నై తన్నై తన్నైక్కుమ్ మున్నై... తిరువేఙ్గడత్తు అణ్ణల్" (3-3-2)** అని అంటూ తమ కులదైవంగాను, **"కులతొల్లడియేన్" (6-10-1)** అని అంటూ తమను పరంపరగా అతని దాసులకు దాసునిగాను సుస్పష్టంగా పల్కినందువల్ల **"వీఱ్ఱిరున్దేఴులకుమ్"** దశకంలో ఆఴ్వార్లు తమ కులదైవం అయిన శ్రీవేంకటేశ్వరునకే మంగళాశాసనం చేయడం యుక్తం.

ఇక, పొంగి పొర్లే భక్తితో భగవానునకు మంగళాశాసనాన్ని **"పల్లాణ్డు పల్లాణ్డు"** అని అంటూ చేసిన పెరియాఴ్వార్లు అనే తిరునామాన్ని పొందిన భట్టనాథుల విషయంలో గమనిద్దాం. ఈ ఆఴ్వార్లకుకూడా కులదైవం శ్రీవేంకటేశ్వ రుడే. **"శెన్నియోఙ్గు తణ్ తిరువేఙ్గడముడైయాయ్!"** (పెరియా-తిరు-5-4-1) అని సంబోధించి, **"ఎమ్మనా! ఎన్ కులదెయ్‌వమే" (5-4-3)** అని పల్కడం గమనించదగినది. **"పఱవై యేఱు పరమ్‌పురుడా !" (5-4-2)** అనే పాశుర వ్యాఖ్యలో వ్యాఖ్యాన చక్రవర్తి పెరియవాచ్చాన్‌పిళ్ళై, తిరువేఙ్గడముడైయాన్ గరుడవాహనాన్ని అధిరోహించి వచ్చి, పెరియాఴ్వార్లను పరమపదానికి తీసికొనిపోడంకోసం త్వరపడుతున్నాడు- అని పల్కడం కూడా గమనార్హం. ఇంతేకాక **"పెరుమ్ పదమాకిన్ఱదాల్" (5-4-2)** అనే సందర్భంలో **"పెరుమ్ పదమ్"** అనేదానికి **"పెరియతరమ్"** అనే అర్థాన్ని అనుగ్రహించి, దానిని **"మేల్ శాత్తుమ్ పెరియట్టముమ్ పెఱ్ఱు, తిరుప్పొలిన్ద శేవడి తన్ శెన్నియిన్ మేల్ పొఱిక్కప్పెఱ్ఱు త్తిరుప్పల్లాణ్డు పాడినపడి"** అని వ్యాఖ్యాత వివరించారు. ఇందువల్ల పెరియాఴ్వార్లు పాండ్యరాజ్యంలో పరతత్త్వ నిర్ణయం చేసి, వాదశుల్కధనాన్ని పొందిన వెంటనే భద్రగజాన్ని అధిరోహించి, ఊరేగింపుగా వీథులలో వేంచేయడాన్ని చూచి సంతోషించి, మధురానగరంలో ఆకాశంలో ప్రత్యక్షమైన గరుడవాహనారూఢుడు స్వామి శ్రీవేంకటేశ్వరుడేనని పూర్వోదాహృత ప్రమాణాలవల్ల, వివరణంవల్ల స్పష్టం. ఆ శ్రీవేంకటేశ్వరునకే పెరియాఴ్వార్లు మొట్టమొదటగా **"పల్లాణ్డు పల్లాణ్డు"** ఇత్యాదిగా మంగళాశాసనం చేసినట్లుగా పెరియవాచ్చాన్‌పిళ్ళై స్పష్టీకరించారని అనడం యుక్తం. ఇంతేకాక, పల్లాణ్డు ప్రబంధంలోని మొదటి పాశురంలో గల **"మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా !"**

అనేది శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి చేసిన సంబోధనే - అనే అంశాన్ని నిరూపించడానికి పలు ప్రమాణాలున్నాయి. వాటిలో కొన్నిటిని మాత్రం గమనిద్దాం.

పాశురంలో **"మణివణ్ణన్"** అని నిర్దేశింపబడినవాడు శ్రీవేంకటేశ్వరుడే. పెరియాళ్వార్ల పుత్రిక గోదాదేవి నాచ్చియార్ తిరుమొళి మొదటి దశకంలోని మొదటి పాశురంలో వేటెవ్వరినీ ప్రస్తావించకుండా **"వేఙ్గడవఱ్కెన్నై విదిక్కిఱ్ఱియే"** (1-1) అని, **"వేఙ్గడవాణనెన్నుమ్ విళక్కినిల్ పుక వెన్నై విదిక్కిఱ్ఱియే"** (1-3) అని శ్రీవేంకటేశ్వరుని రెండుమార్లు ప్రస్తావించి ఆ దశకంలోని చివరి పాశురంలో **"మణివణ్ణఱ్కెన్నై వకుత్తిడు"** అని ఆ స్వామియే మణివర్ణుడని పల్కి ముగించడాన్ని గమనించవచ్చు. పెరియాళ్వార్లు **"శెన్నియోఙ్గు తణ్ తిరువేఙ్గడముడైయాయ్!"** (పెరియా-తిరు- 5-4-1) అని సంబోధించి, అతనినే **"మరుప్పొశిత్త మల్లడర్త్తాయ్"** (5-4-7) అని సంబోధించి, అతడే మల్లులను సంహరించాడని అనడంకూడా గమనించాలి.

నమ్మాళ్వార్లు, వేఱు ఏ మూర్తినిగూర్చిన ప్రస్తావన లేని **"శార్వే తవనెఱి"** (తిరువాయ్-10-4) అనే దశకంలో **"మలైమేల్ తాన్ నిన్ఱు ఎన్ మనత్తుళ్ ఇరున్దానై"** అని అంటూ తిరువేఙ్గడముడైయాన్‌నుగూర్చి పల్కి, అతనినే చివరలో **"మల్‌తిణ్డోళ్‌మాలై"** అని, **"మాలుక్కు"** (6-6) అనే దశకంలో **"మఱ్పొరు తోళుడైయాయ పిరాన్"** అని పల్కి, చివరలో **"కట్టెళిల్ శోలై నల్ వేఙ్గడవాణనై"** అని అంటూ అతడు శ్రీవేంకటేశ్వరుడేనని తెలుపడంకూడా గుర్తించదగినది.

తిరుమంగై మన్నన్ కూడా **"మల్లార్ తోళ్ వడవేఙ్గడవనై వరచ్చొల్లాయ్ పైఙ్కిళియే!"** (పెరియ.తిరు-10-10-5) అని, **"విల్లార్ మలి వేఙ్గడమామలై మేయ మల్లార్ తిరడోళ్ మణివణ్ణనమ్మానై"** అని అంటూ పల్లాణ్డులోని **"మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణన్"** శ్రీవేంకటేశ్వరుడేనని తెలుపడం దీనిని బలపరుస్తుది. ఇంతేకాదు, ఆ ఆళ్వార్లు పెరియతిరుమొళి ప్రబంధంలోని **"మానమరు మెన్నోక్కి"** (11-5) అనే దశకంలో **"వెళ్ళత్తాన్ వేఙ్గడత్తానేలుమ్ కలికన్ఱి యుళ్ళత్తినుళ్ళే యుళన్"** అని శ్రీవేంకటేశ్వరుని ప్రస్తావించి, **"ఇరున్దమిళ్‌నూల్ పులవర్"** అయిన ఆ ఆళ్వార్లకు **"ఉలకముణ్డ పెరువాయన్"** శ్రీవేంకటేశ్వరుడేనని మనస్సులో తోచడంవల్ల, ప్రళయకాలంలో లోకాలను గ్రసించి తన బొజ్జలో పెట్టుకొన్న వృత్తాంతాన్ని విస్తృతంగా కీర్తించి, **"మైన్నిన్ఱ కరుఙ్కడల్‌వాయ్"** (11-6) అనే దశకంలో **"మల్లాణ్డ తడక్కైయాల్**



**పకిరణ్డ మకప్పడుత్త కాలత్తు"** అని శ్రీవేంకటేశ్వరునియొక్క మల్లులను నిరసించిన బలిష్ఠబాహువులనుగూర్చి ప్రస్తావించారు. అయితే, ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. ఈ దశకంలో- **"కణ్ణాళన్ కణ్ణమఙ్గై నకరాళన్"** (7) అని తిరుక్కణ్ణమఙ్గలోని స్వామినిగూర్చి ప్రస్తావించడంవల్ల మల్లులను నిరసించిన దృఢమైన బాహువులను కలవానినిగా ఆ స్వామిని కీర్తించినట్లు చెప్పవచ్చుకదా!- అన్నది ఆ సందేహం. దీనికి సమాధానం ఏమంటే- శ్రీవేంకటేశ్వరునితో తిరుక్కణ్ణమఙ్గలోని స్వామికి గల ఏదో, ఆళ్వార్లు మాత్రం తెలిసిన, ఒక సామ్యాన్ని పురస్కరించుకొని **"మైన్నిన్ఱ"** దశకంలో తిరుక్కణ్ణమఙ్గ స్వామిని ప్రస్తావించారు- అని భావించాలి. ఈ విధంగా సామ్యం లేకపోతే, **"ఒరునల్ శుఱ్ఱమ్"** (10-1) అనే దశకంలో **"కరునెల్‌శూళ్ కణ్ణమఙ్గైయుళ్ కాణ్డుమే"** (10-1-1) అని పల్కిన వెంటనే, **"పొన్నై మామణియై అణియార్న్ద తోర్ మిన్నై వేఙ్గడత్తుచ్చియిల్ కణ్డు పోయ్"** (10-1-2) అని శ్రీవేంకటేశ్వరుని ఆళ్వార్లు ప్రస్తావించి ఉండరుకదా !

దీనినిబట్టి పల్లాణ్డుప్రబంధంలో పెరియాళ్వార్లు **"మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా! ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు"** అని మంగళాశాసనం చేయడం- శ్రీవేంకటేశ్వరునిగూర్చే- అనే విషయం చక్కగా ద్రఢీకరింపబడింది కదా!

## ప్రకృతముద్రణనుగూర్చి

ఆళ్వార్ల నాలాయిరదివ్యప్రబంధంలో శ్రీవేంకటేశ్వరుని కీర్తించే పాశురాలను అన్నిటినీ ఏర్చి కూర్చి, వాటికి తెనుగులో, తమిళంలో ప్రతిపదార్థతాత్పర్యాలతోపాటు విశేషాలను గడచిన శతాబ్దిలో ప్రసిద్ధిచెందిన ఉభయవేదాంత విద్వాంసులు దర్శన సార్వభౌమ, ఉవే.శ్రీమాన్. టి.కె. వి.ఎన్. సుదర్శనాచార్యస్వామివారు సిద్ధం చేయగా ఆ గ్రంథాలను తి.తి.దేవస్థానంవారు ప్రచురించారు. ఆ ప్రతులు చాలాకాలంగా దుర్లభాలు. ఈ లోటును గుర్తించిన ఆత్మీయులు, ఆస్తికులు, విజయనగరం వాస్తవ్యులు - భాగవతాగ్రేసరులు అయిన శ్రీమాన్ దాసరి సన్యాసి రాజుగారు, శ్రీమతి నరసయ్యమ్మగారు దంపతులు, తమ కుమారుడు, కీర్తిమూర్తి. శ్రీమాన్ దాసరి వేంకటరాయలుగారు పెద్దల పేరుతో - అంటే - తమ తాత, ముత్తాతల పేర్లతో చేయాలని ఆశపడ్డ ఈ కైంకర్యాన్ని అటు తమ జననీజనకుల, పితామహీ పితామహుల విషయంలో కైంకర్యరూపంగా జూన్ 2008లో ముద్రించారు. అయితే ఆ ప్రతులు కూడా చెల్లిపోయినందున హైదరాబాద్ వాస్తవ్యులు, మిత్రమణి, భాగవతాగ్రేసరులు శ్రీమాన్ పి.గోపాలకృష్ణమూర్తిగారు ఈ గ్రంథాన్ని ద్వితీయ

ముద్రణ చేయడానికి ముందుకు రావడం వారికి సంప్రదాయ ప్రచారంలోగల అభినివేశాన్ని తెలుపు తున్నది. వారిని నేను మనసారా అభినందిస్తూ, నా కృతజ్ఞతలను తెలుపుకొంటున్నాను. ఈ గ్రంథముద్రణను శ్రీమాన్ గోపాలకృష్ణ మూర్తిగారు తాము తిరుపతి దివ్యక్షేత్రంలో నిర్వహింపదలచిన (చతుర్థ) ఉభయవేదాంత సభల స్మృతిగా చేయడం కూడా చాలా సముచితం. శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తిగారు బహుముఖంగా చేస్తున్న శ్రీవైష్ణవ సంప్రదాయ ప్రచారం శ్రీశ్రీశ్రీ చిన్నజీయరుస్వామివారు, శ్రీమాన్ రఘునాథాచార్య స్వామివారివంటి మహనీయుల ప్రశంసలకు, మంగళాశాసనాలకు పాత్రమౌతున్నది. ఈవిధంగానే వీరి సేవాకార్యక్రమాలు నిర్విఘ్నంగా, నిరంతరంగా, బహుముఖంగా, బహుగుణీ కృతంగా వర్ధిల్లుతూ కొనసాగాలని, ఆవిధంగా శ్రీనివాస ప్రభువు, పెద్దలు వారిని కటాక్షించాలని కోరుకుంటున్నాను. పూర్వంవలెనే ఈ గ్రంథం ఆస్తికులైన సహృదయపాఠకులకు ఆనందాన్ని కలిగిస్తుందని నమ్ముతూ, స్వస్తి.

**దివ్యసూరినిర్మితా వేంకటేశసాహితీ**
**శ్రావ్యశబ్దగుంఫితా హృద్యభావబంధురా ।**
**భావుకాళిహృత్సుధా భక్తకోటిసన్నిధౌ**
**గోపకృష్ణమూర్తినా నమ్రచేతసాఽర్ప్యతే ॥**

ఇట్లు, విన్నవించే
భాగవతవిధేయుడు

తిరుపతి.
16-7-2011.

**ఈ. ఏ. శింగరాచార్యులు**



శ్రీమతే వేంకటేశాయ నమః
శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీవేంకటేశదివ్యసాహితి

## ముదలాళ్వార్లు

తులాయాం శ్రవణే జాతం కాంచ్యాం కాంచనవారిజాత్ ।
ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే ॥

తులాధనిష్ఠాసంభూతం భూతం కల్లోలమాలినః ।
తీరే ఫుల్లోత్పలే మల్లపుర్యా మీడే గదాంశజమ్ ॥

తులాశతభిషక్జాతం మయూరపురి కైరవాత్ ।
మహాంతం మహదాఖ్యాతం వందే శ్రీనందకాంశజమ్ ॥

శ్రియఃపతి, సకలకల్యాణగుణాకరుడు అయిన భగవానుడు చేతనులను అందఱిని ఉజ్జీవింపచేయడంకోసం ఈ లోకంలో **"యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత, అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్"** అని గీతలో తాను వచించిన రీతిలో స్వయంగా రామకృష్ణాద్యవతారాలను పెక్కింటిని ధరించి చేతనరక్షణాన్ని చేయడమే కాకుండా, **"జ్ఞానీత్వాత్మైవ మే మతమ్'** అనే రీతిలో తనకు ఆత్మస్థానీయులైన జ్ఞానులనుకూడా ఈలోకంలో అవతరింపజేసి, వారిద్వారా చేతనరక్షణకర్తవ్యాన్ని నిర్వహిస్తాడు.**"ఆత్మానమ్ సృజామ్యహమ్"** అనే గీతాసూక్తిలోని పరమార్థం ఇదే అని పెద్దల హృదయం. ఈ విధంగా భగవదాజ్ఞచేత అవతరించినవారే ఆ*ళ్వా*ర్లు అనబడే దివ్యసూరులు. వీరు దక్షిణభారతదేశంలో అవతరించడంచేత వీరి ప్రబంధాలు అన్నీ ద్రావిడభాషలో అనుగ్రహింపబడ్డాయి. ఈ ఆ*ళ్వా*ర్లలో పొయ్గై ఆ*ళ్వా*ర్లు, పూదత్తా*ళ్వా*ర్లు, పేయా*ళ్వా*ర్లు- అనబడే మొదటి ముగ్గురు సంప్రదాయంలో ముదలా*ళ్వా*ర్లు అనే పేరుతో వ్యవహరింప బడుతున్నారు.

---

**గమనిక :** ద్రావిడ వర్ణమాలలోని '*ళ*' అనే అక్షరాన్ని తెలుగులోని 'ళ' అక్షరంతో సమానంగా, '*న్ఱ*' అనే సంయుక్తాక్షరాన్ని 'ట్ర' అనే సంయుక్తాక్షరంతో సమానంగా, '*ఱ*' అనే అక్షరాన్ని 'ఱ' అనే అక్షరంతో సమానంగా ఉచ్చరించవచ్చును.

ద్వాపరయుగాంతంలో సిద్ధార్థినామసంవత్సరంలో తులామాసంలో వీరు ముగ్గురు వరుస నక్షత్రాలలో అవతరించారు. పాంచజన్యాంశంతో శ్రవణానక్షత్రంలో పొయ్‌కై ఆళ్ళ్వార్లు, కామోదకీ అనే గద అంశతో ధనిష్ఠానక్షత్రంలో పూదత్తాళ్ళ్వార్లు, నంద కాంశతో శతభిషక్ నక్షత్రంలో పేయాళ్ళ్వార్లు అవతరించారు. పొయ్‌కై ఆళ్ళ్వార్లు **"ముదల్ తిరువన్దాది"** అనే ప్రబంధాన్ని, పూదత్తాళ్ళ్వార్లు **"ఇరణ్డామ్ తిరువన్దాది"** అనే ప్రబంధాన్ని, పేయాళ్ళ్వార్లు **"మూన్దామ్ తిరువన్దాది"** అనే ప్రబంధాన్ని రచించారు. ఈ ప్రబంధాలలో ఒక్కొక్క ప్రబంధంలో వెణ్బావృత్తనిబద్ధాలైన 100 పాశురాలున్నాయి.

వేర్వేరు ప్రదేశాలలో అవతరించిన వీరు ముగ్గురూ ఒకరికొకరు తెలియకుండా చాలాకాలం భగవద్గుణానుభవంతో కాలం గడుపుతూ, **"ఓడిత్తిరియుమ్ యోకికళ్"** అన్నట్లు గ్రామైకరాత్రంగా తిరుగుతూ ఉన్న సమయంలో, వీరిని ముగ్గురిని ఒకచోట చేర్చి, అనుగ్రహించాలని భగవానుడు సంకల్పించాడు. ఒకనాడు పొయ్‌కై ఆళ్ళ్వార్లు తిరుక్కోవలూర్ అనే దివ్యదేశాన్ని చేరి, అక్కడి అర్చామూర్తిని సేవించి, అప్పటికి రాత్రి అయినందువల్ల ఆ ఊరిలో ఉండే మృకండుముని ఇంటి వీథి సావడిలో పరుండి విశ్రాంతి తీసికొంటున్నారు. అపుడు అక్కడికి పూదత్తాళ్ళ్వార్లు వచ్చారు. ఆ ఇద్దఱూ కలిసి ఆ చిన్న అరుగుపై కూర్చుని భగవద్గుణానుభవం చేస్తుండగా, అపుడే, పేయాళ్ళ్వార్లుకూడా అక్కడికి వచ్చారు. ముగ్గురు నిల్చుని ఉండడానికి మాత్రం చాలే ఆచోట వారు ముగ్గురు నిల్చుని సత్కాలక్షేపం చేసే ఆ చీకటి సమయంలో, గొప్ప వర్షం ప్రారంభమయింది. అపుడు వారి ముగ్గురి మధ్య భగవానుడు సలక్ష్మీకుడై ప్రవేశించాడు. తమమధ్యలో వేఱెవరో ప్రవేశించినట్లు గుర్తించిన ఆ ముగ్గురు ఆళ్ళ్వార్లు, ఆవ్యక్తి ఎవరో చూడాలని తలచి, యోగదృష్టితో దర్శించారు. అపుడు వారికి భగవదనుగ్రహంవల్ల భక్తిరూపాపన్న జ్ఞానం కల్గింది. అపుడు వారు అనుగ్రహించినవే మూడు అన్దాదిప్రబంధాలు. ఈ అన్దాది ప్రబంధాలలోని శ్రీవేంకటేశ్వరుని స్తుతించే పాశురాలు క్రమంగా నివేదింపబడు తున్నాయి.

## పొయ్‌గై ఆళ్ళ్వార్లు - ముదల్ తిరువన్దాది

**1. అవ :** త్రివిధకరణాలతో భగవత్కైంకర్యాన్ని చేయడం పరమపదంలోనే కదా సాధ్యం! ఈ లోకంలో వీలుకాదు కదా! అని అంటే, పరమపదంలోని నిత్యసూరులు సైతం భగవానుని సౌలభ్య-సౌశీల్యాది గుణానుభవంకోసం తిరుమలకు వచ్చి, సేవిస్తున్నారు. అందువల్ల తిరుమలలోనే మోక్షం కరతలామలకం అవుతుందని అంటున్నారు.



**ఎళ్ళువార్ విడై కొళ్వార్ ఈన్తుళ్ళాయానై,**
**వళ్ళువా వగై నినైన్దు వైగల్- తొళ్ళువార్,**
**వినైచ్చుడరై నన్దువిక్కుమ్ వేఙ్గడమే, వానోర్**
**మనచ్చుడరై త్తూణ్డుమ్ మలై** **26వ పా.**

ప్రయోజనాంతరపరులు - అంటే - భగవత్కైంకర్యాన్ని కాదని, ఇహలోకంలోని ఐశ్వర్యానందాలను కోరే ఐశ్వర్యార్థులు, ఆత్మానుభవాన్ని మాత్రం ఆశపడే కైవల్యార్థులు, సదా భగవానుని అనుభవించే పరమైకాంతులు - అనే భేదం లేకుండా వీరి అందఱి పాపాలను నశింపజేసి, నిత్యసూరుల మనస్సు అనే ప్రదీపాన్ని ప్రజ్వలింపజేసే కొండ (ఏది అంటే) పరమభోగ్యం అయిన తిరుమలేసుమా!

విశే : ముదల్ తిరువన్దాదిలోని పాశురాలు శహనారాగం - త్రిపుట తాళంలో కూర్చబడ్డాయి.

**2. అవ:** మనం శ్రీరామ శ్రీకృష్ణాది భగవదవతారాలకు పిమ్మట పుట్టాముకదా!ఆ అవతరాలను ఈనాడు దర్శించలేముకదా! అనిఅంటే, అతడే ఈ సంసారంలో తిరుమలకు అత్యంతాభినివేశంతో వచ్చి, సర్వసమాశ్రయణీయుడై ఉండగా, ఇక మనకేమి లోటు? అని ఆళ్ళ్వార్లు అంటున్నారు.,

**వగై యఱు నుణ్‌కేళ్వి వాయ్‌వార్‌గళ్, నాళుమ్,**
**పుగై విళక్కుమ్ పూమ్బునలుమ్ ఏన్ది, తిశైతిశైయిన్,**
**వేదియర్‌గళ్ శెన్ఱిఱైఞ్జుమ్ వేఙ్గడమే, వెణ్ శఙ్గమ్**
**ఊదియవాయ్ మాలుగన్ద ఊర్** **37వ పా.**

ప్రయోజనాంతరాలను, దేవతాంతరాలను తెలియజేసే శాస్త్రాలను నిరసించ గల్గినది, అల్పఫలం ఏదో, అనల్పఫలం ఏదో వివేకించి తెలిసికోవడానికి అవసరం అయినది అయిన బహుశ్రవణాన్ని కల్గిన వైదికులు పలు పలు దిక్కులనుండి ప్రతిదినం వచ్చి, ధూప-దీప-పుష్ప-తీర్థ- నైవేద్యాలను సిద్ధం చేసికొని ఆరాధనను చేసే తిరుమల, భారతయుద్ధంలో శత్రువులందఱూ భయపడేటట్లు పాంచజన్యమనే శంఖాన్ని నోటిలో పెట్టుకొని ఊదిన శ్రీకృష్ణుడు అభిమానించే దివ్యదేశం.

**3. అవ :** పరమపదంలో ఉండే వారందఱూ మనకు సేవ్యులు. అదే రీతిలో, తిరుమలలో ఉండే చరాచరాలు సైతం మనకు ఉద్దేశ్యభూతులని ఇందులో అంటున్నారు.

నిత్యసూరి నాథుడైన భగవానుడు మనఃపూర్వకంగా తిరుమలకు వచ్చి నిత్యవాసం చేస్తున్నాడు- అని కూడా అంటున్నారు.

ఊరుమ్ వరి యరవమ్ ఒణ్ కుఱవర్ మాల్యానై,
పేర వెఱిన్ద పెరు మణియై, - కారుడైయ,
మిన్నెన్డు పుగ్గ్ఱడైయుమ్ వేఙ్గడమే, మేలశురర్
ఎమ్మెన్ను మాల దిడమ్ 38వ పా.

తమ పొలాలోని పంటలను ఏనుగులు మేయాలని వచ్చినపుడు, ఆ ఏనుగులను పొలాలనుండి బయటకు తరిమివేయడంకోసం అక్కడ కావలి కాసే కోయలు తాము మంచెలపైనుండి తమ చేతుల్లో ఉండే పెద్ద పెద్ద రత్నాలను ఏనుగుల పైకి విసరుతారు. అపుడు అక్కడ సంచరించే కొండచిలువలు ఏనుగుల పైకి విసరిన రత్నాలను చూచి, ఏనుగులను మేఘాలని, మెఱిసే రత్నాలు మెఱుపులని భ్రమించి, మెఱుపు మెఱసిన తరువాత పిడుగు పడుతుంది కనుక, అవి పిడుగుకు భయపడే స్వభావాన్ని కల్గినవి కనుక అవి పుట్టలలోకి దూరుతాయి. ఈవిధంగా అత్యాశ్చర్యకరం అయిన సన్నివేశా లతో మిక్కిలి దర్శనీయమై వెలిగేది, పరమభోగ్యం అయినది, నిత్యసూరులు ఎంతో ఆదరంతో సేవించేది అయిన తిరుమలే శ్రియఃపతి ఆదరంతో వేంచేసి ఉండే దివ్యదేశం.

తిరుమలలోని చరాచరాలు అన్నీ ఉపాదేయాలు - అని పాశురసారం. శ్రీకులశేఖరుల ప్రబంధంలోని **"ఊనేఱు శెల్వమ్"** అనే దశకప్రమేయం అను సంధేయం.

**4. అవ :** భక్తులకు ఆపదలు కల్గినపుడు వాటిని తీర్చడంకోసం మాత్రమే భగవానుడు అవతారాలను ఎత్తుతాడు. పరమాదరంతో వేంచేసి ఉండేది మాత్రం శ్రీవేంకటాచలం లోనే - అని అంటూ పలు భగవల్లీలలను ఆళ్వార్లు అనుసంధిస్తున్నారు.

ఇడన్దదు పూమి ఎడుత్తదు కున్టమ్,
కడన్దదు కఞ్జనై మున్నఞ్జ, - క్కిడన్దదువుమ్
నీరోద మాకడలే నిన్ఱదువుమ్ వేఙ్గడమే,
పేరోదవణ్ణర్ పెరిదు 39వ పా.

పూర్వం మహాప్రళయకాలంలో అండభిత్తికి అంటుకొని ఉండే భూమిని మహావరాహ రూపాన్ని ధరించి భగవానుడు ఉద్ధరించాడు. ఇంద్రుడు రేపల్లెలో శిలా వర్షాన్ని (వడగళ్ళ వానను) కురిపించినపుడు గోకులాన్ని కాపాడడంకోసం గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా ఎత్తాడు. సాధువులను హింసించే కంసుణ్ణి భయపడే టట్లు చేసి, వధించాడు. ఈ అవతారాలను ఎత్తడానికి అనుకూలంగా పాల సముద్రంలో శయనించాడు. నిత్యసూరులకు, భూలోకవాసులకు దాచిన నిధిగా తన గొప్పతనం అంతా ప్రదర్శిస్తూ, పరమసులభుడై, పరమభోగ్యుడై తిరుమలలో వేంచేసి ఉన్నాడు.



**5. అవ :** అసురులకు ప్రభువైన హిరణ్యకశిపుని సంహరించి, లోకరక్షణను చేసిన నృసింహస్వామి స్థిరంగా వేంచేసి ఉండేది తిరుమలలోనే - అని ఆళ్వార్లు అంటున్నారు.

పెరువిల్ పగళి క్కుఱవర్ కై చ్చెన్డీ,
వెరువి పునమ్ తుఱన్ద వేళమ్,- ఇరు విశుమ్బిల్
మీన్ వీళ క్కణ్డు అఞ్జుమ్ వేఙ్గడమే, మేలశురర్
కోన్ వీళ క్కణ్డుగన్దాన్ కున్డు 40వ పా.

తిరుమల కొండపై ఉండే ఏనుగులు రాత్రి సమయంలో పంటపొలాలలోని పంటను మేస్తూ ఉండగా, వాటిని తరుమడంకోసం బాణాన్ని సంధించిన వింటిని ఒక చేతిలో, వెలిగించిన దివ్విటీని వేఱొక చేతిలో పట్టుకొని కోయలు వాటిని వెంబడించి పోయినపుడు, ఆ దివ్విటీని, బాణాన్ని సంధించిన వింటిని చూచి భయపడి ఏనుగులు పారిపోవాలని చూచాయి. అపుడు ఆకాశంనుండి అకస్మాత్తుగా ఒక నక్షత్రం ఆ ఏనుగులు పారి పోయే దారిలో గొప్ప తేజస్సుతో రాలిపడింది. దానిని చూచి ఏనుగులు ఇది నక్షత్రం అని తెలియలేక, "కోయలు దివ్విటీని విసరివేశారు" అని భ్రమించి, "ఈ దారిలో ఇక ఏ విధంగా పోగలం?" అని భయంతో నిలబడిపోయే అత్యాశ్చర్యకర సన్నివేశాన్ని కల్గినది వేంకటాద్రి - తనను ఆశ్రయించిన ప్రహ్లాదునకు విరోధి అయిన హిరణ్యకశిపుని వధించి, పరమభాగవతాగ్రేసరుడైన అతని రక్షించిన స్వామి, ఆ ఆశ్రితపక్షపాతం అనే గొప్ప గుణాన్ని వ్యక్తం చేస్తూ భక్తులకు ఈనాటికీ సేవను అనుగ్రహించే చోటు ఈ తిరుమల. అందువల్ల- ఆ తిరుమలను ఆశ్రయించు- అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి ఉపదేశిస్తూ ఆళ్వార్లు సంతోషిస్తున్నారు.

**6. అవ :** భగవానుని స్వరూప రూపదివ్యకల్యాణ గుణాదులను తెలిసికోవడం ఎవరికీ సాధ్యం అయ్యే పని కాదు- అని ఇందులో అంటున్నారు.

ఉణర్వార్ ఆర్? ఉన్పెరుమై ఊళ్లిదోఱూళ్లి,
ఉణర్వార్ ఆర్? ఉన్నురువన్దన్నై, - ఉణర్వారార్?
విణ్ణగత్తాయ్! మణ్ణగత్తాయ్! వేజ్గడత్తాయ్!, నాల్వేద
ప్పణ్ణగత్తాయ్! నీ కిడన్ద పాల్ 68వ పా.

పరమపదనాథా! భూలోకనాయకా! ఉభయవిభూతి నిర్వాహకుడవై, పరమ భోగ్యం అయిన శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామీ! కాలతత్త్వం ఉన్నంతవరకు ప్రయత్నించినా నీ గొప్పతనాన్ని తెలియగల్గినవారెవరు? నీ దివ్యాత్మస్వరూపాన్ని తెలియ గలవారు ఎవరు? ఆర్తరక్షణకోసం నీవు శయనించి ఉండే పాలసముద్రాన్ని తెలియ గలవారు ఎవరు? ఎవరూ లేరుసుమా!

కాలతత్త్వం ఉన్నంతవరకూ ప్రయత్నించినా భగవానుని స్వరూప-రూప-గుణ-విభూతుల మహిమ దురవగాహం - అని పాశురసారం. **"నాల్ వేద ప్పణ్ణకత్తాయ్"** - అని అనడంద్వారా స్వరప్రధానాలు, పరతత్త్వనిర్ణాయకాలు అయిన వేదశాస్త్రాల ప్రవర్తకుడు భగవానుడే అని సూచింపబడింది.

**7. అవ :** భగవానుని సేవించేవారు సద్గతిని పొందుతారని వేఱే చెప్పాలా?; అతనితో సంబంధాన్ని కల తిరుమలకొండే తనను ఆశ్రయించినవారికి సద్గతిని కల్గిస్తూ ఉండగా- అని అంటూ కైముతికన్యాయంలో ఆళ్వార్లు ఈ పాశురాన్ని అనుగ్రహిస్తున్నారు.

వళ్లి నిన్టు నిన్నై త్తొళువార్, వళువా
మొళ్లినిన్ట మూర్త్తియరే యావర్, - పళుదొన్టుమ్
వారాద వణ్ణమే విణ్ కొడుక్కుమ్, మణ్ణళన్ద
శీరాన్ తిరువేజ్గడమ్ 76వ పా.

పరమోదారుడు, పరమకారుణికుడు కావడంవల్ల లోకాలను అన్నిటినీ తన శ్రీపాదస్పర్శతో సద్గతిని పొందేటట్లు చేసిన మహానుభావుడు, ఈలోకంలోనివారికి (భూలోకవాసులకు), పరమపదవాసులకు పరమభోగ్యుడు అయిన స్వామి వేంచేసి ఉండే వేంకటాచలమే ఏ కొఱత లేకుండా మోక్షసామ్రాజ్యాన్ని అనుగ్రహించగల్గినదిగా ఉండగా, భక్తిమార్గంలో స్థిరంగా ఉండి, ఆ స్వామిని ఆశ్రయించేవారు నిత్యం, నిర్దుష్టం అయిన వేదాంతాలలో ప్రతిపాదింపబడ్డ రీతిలో జ్ఞానానందస్వరూపావిర్భావాన్ని పొందుతారు అనడంలో ఏమి సందేహం ఉన్నది? అతని సంబంధాన్ని గల తిరుమలను సేవించేవారే సద్గతిని పొందుతారు అని అంటే, ఆ భగవానుని సేవించేవారికి సద్గతి ప్రాప్తి కల్గుతుంది అనే విషయం కైముతికన్యాయసిద్ధంకదా!



**"వళువా మొళ్లినిన్ట మూర్త్తియరే యావర్"** - "పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే", అనే సంస్కృతవేదసూక్తి. **"తమ్మైయే నాళుమ్ వణజ్గి త్తొళువార్క్కు తమ్మైయేయొక్క అరుళ్శెయ్‌వర్"** అని ద్రావిడవేదసూక్తి స్మర ణీయాలు. తిరువాయ్‌మొళ్లిలోని **"పళుదొన్టుమ్ వారాద వణ్ణమే విణ్ కొడు క్కుమ్.... తిరువేజ్గడమ్"** అనే సూక్తి, **"తిరువేజ్గడమామలై మేయ... నమ్ విన్నై ఓయుమే"** (3-3-) అనే సూక్తి దీనికి సంవాదంగా స్మరణీయాలు.

**8. అవ :** అభిమానక్షేత్రాలలో భగవానుడు వేంచేసి ఉండే రీతులను మనం స్మరించి నట్లయితే మన పాపాలన్నీ అగ్నిలో పడిన దూదివలె రూపుమాసిపోతాయి - అని ఇందులో అంటున్నారు.

వేజ్గడముమ్ విణ్ణగరుమ్ వెఃకావుమ్, అఃకాద
పూజ్గిడజ్గిన్ నీళ్‌కోవల్ పొన్నకరుమ్, - నాన్గిడత్తుమ్
నిన్టాన్ ఇరున్దాన్ కిడన్దాన్ నడన్దానే,
ఎన్టాల్ కెడుమామ్ ఇడర్ 77వ పా.

భగవానుడు దివ్యదేశాలలో నిలచి, వేంచేసి ఉండే, కూర్చుని ఉండే పరుండి ఉండే, నడిచే సన్నివేశాలతో నెలకొని ఉన్నాడు. ఆ రీతులను అన్నిటినీ మనం అనుసంధిస్తే మనం నిల్చుని, కూర్చుని, పరుండి, నడుస్తూ చేసిన పాపాలన్నీ తామే నశిస్తాయి. దానివల్ల మన దుఃఖం తీరుతుంది.

**9. అవ :** ఒక స్త్రీ (సీతాదేవి) కోసం మాయామృగం అయిన మారీచుని వెంటబడి, బాణాన్ని సంధించి, అతణ్ణి సంహరించిన శ్రీరాముడు నిత్యవాసం చేసే పర్వతం కాబట్టి తిరుమలకు స్త్రీలు సైతం వచ్చి ఆశ్రయించవచ్చు- అని ఇందులో అనుగ్రహిస్తున్నారు.

పడైయారుమ్ వాట్కణ్ణార్ పారశినాళ్, పైమ్బూమ్
తొడైయలోడు ఏన్దియ తూపమ్, - ఇడై యిడైయిల్
మీన్ మాయ మాశూణుమ్ వేజ్గడమే, మేలొరునాళ్
మాన్ మాయ వెయ్‌దాన్ వరై 82వ పా.

ఏ విధమైన తత్త్వజ్ఞానం లేని స్త్రీలుసైతం సత్త్వోత్తరకాలం అయన ద్వాదశితిథిలో వాడని పూవులతో కూర్చిన పూమాలికలను శ్రీవేంకటేశ్వరునకు

అర్పించగా, ఆ తరువాత వారు సమర్పించిన ధూపంవల్ల ఆకాశంలో అక్కడక్కడ ప్రకాశించే నక్షత్రాలు మఱుగుపడేటట్లున్న పరమభోగ్యం అయిన తిరుమలే- పూర్వం మారీచుడనే మాయావి నశించేటట్లు బాణాన్ని సంధించి, విడచిన శ్రీరాముడు అభిమానించి, సంతోషంతో నిత్యవాసం చేస్తున్నది దివ్యదేశం.

**10. అవ :** ఓ నా మనసా! సర్వదేశ - సర్వకాలాలలో ఉండేవాడు, యోగుల హృదయాల్లో ఉన్నవాడు, పాలకడలిలో శయనించి ఉన్నవాడు, తిరుమలలో నిలుచున్న సన్నివేశంలో వేంచేసి ఉన్నవాడే ఇపుడు మన వద్దకు వచ్చి హృదయంలో ప్రవేశించాడు. ఏమి మన భాగ్యం! అని తమ మనస్సును ఉద్దేశిస్తూ ఆళ్వార్లు ఇందులో పల్కుతున్నారు.

**ఉళన్ కణ్డాయ్ నన్నెఞ్జే! ఉత్తమ నెన్డుమ్**
**ఉళన్ కణ్డాయ్, ఉళ్ళువారుళ్ళత్తు- ఉళన్ కణ్డాయ్,**
**వెళ్ళత్తినుళ్ళానుమ్ వేఙ్గడత్తు మేయానుమ్,**
**ఉళ్ళత్తి నుళ్ళానెన్డు ఓర్ 99వ పా.**

ఓ నామంచి మనసా! సర్వరక్షకుడైన పురుషోత్తముడు పాలసముద్రం, తిరుమల - మొదలైన చోట్లకు వచ్చి, నివసిస్తున్నది ఎందుకోసం? అంటే, తనను అడ్డు పెట్టనివారి హృదయాల్లో ప్రవేశించి, అధివసించడంకోసమే సుమా! అందువల్ల అతడిపుడు మన మనస్సులో ఎంతో ఆదరంతో వచ్చి ప్రవేశించాడు. నీవు ఈ విషయాన్ని తెలిసికొని ఆనందించు.

మనస్సును ఒక ప్రత్యేకవ్యక్తిగా, దాని కొక హృదయం ఉన్నట్లుగా చెప్పడం ఒక కవితా చమత్కారవిశేషం.

## పూదత్తాళ్వార్లు- ఇరణ్డామ్ తిరువన్దాది

**11. అవ :** సంకల్పమాత్రంతోనే అన్నిటినీ నిర్వహించగల్గిన సర్వశక్తి అయిన సర్వేశ్వరుడు, తనను మార్చుకొని, తక్కువ జేసికొని మనుష్యజాతీయుడై అవతరించడం- సాధుపరిత్రాణంకోసమే. భగవానుని అవతారానికి ముఖ్యకారణం ఇదే. దుష్టనిగ్రహం, ధర్మసంస్థాపనం అనేది సంకల్పమాత్రంచేతనే సిద్ధిస్తాయి. భాగవతుల నేత్రాలకు లక్ష్యభూతుడై, వారుచేసే కైంకర్యాలను స్వీకరించడంకోసం, వారిని సంతోషపెట్టడం కోసమే ఈ లోకంలో స్వామి ఈ విధంగా విభవావతారాలను ఎత్తి, అర్చారూపిగా సేవను అనుగ్రహిస్తూ ఉన్నాడు- అని అంటున్నారు.



**శెన్డదు ఇలఙ్గైమేల్ శెవ్వేతన్ శీఱ్ఱత్తాల్,**
**కీన్డదు ఇరావణనై క్కూఱుళ్గాల్, - నిన్డదువుమ్**
**వేయోఙ్గు తణ్ శారల్ వేఙ్గడమే, విణ్ణవర్దమ్**
**వాయోఙ్గు తొల్పుగళాన్ వన్దు 25వ పా.**

దేవతలను బాధించే అసురులను సంహరించి, వారిని రక్షించడంకోసం ఆ దేవతలచే కీర్తింపబడే సహజమైన కీర్తిని కల భగవానుడు నేరుగా కోపంతో దండెత్తినది లంకపై. కోపంతో సంహరించినది హిరణ్యకశిపుని. సాధుజనపరిత్రాణార్థంగా దివ్యమంగళవిగ్రహంతో పరమసులభుడై వేంచేసి ఉండేది వెదుళ్ళు ఎత్తుగా పెరిగే, మిక్కిలి చల్లని తోటలను కల్గిన తిరువేఙ్గడమే.

విశే: ఇరణ్డామ్ తిరువన్దాదిలోని పాశురాలు భైరవిరాగం - త్రిపుట తాళంలో కూర్చబడ్డాయి.

**12. అవ :** తాము అతడు విశ్లేషించకుండా వేంచేసి ఉండే చోటుకు చేరాలని ఆశించడం ప్రారంభించగానే, స్వామి తమ మనస్సులోనికి వచ్చి స్థిరనివాసం ఏర్పాటుచేసికొన్నాడు- అని అంటున్నారు.

**మనత్తుళ్ళాన్ వేఙ్గడత్తాన్ మాకడలాన్, మఱ్ఱుమ్**
**నినైప్పరియ నీళరఙ్గత్తుళ్ళాన్, - ఎనై ప్పలరుమ్**
**తేవాదిదేవ నెనప్పడువాన్, మున్నొరునాళ్**
**మావాయ్ పిళన్ద మగన్ 28వ పా.**

నిత్యసూరులకు నిర్వాహకుడై, పరమపదనాథుడైన భగవానుడు జగద్రక్షణార్థం మొదట క్షీరాబ్దిలోకి వచ్చి, ఉండి తరువాత శ్రీకృష్ణావతారరూపుడై అవతరించి, దానివల్లకూడా తృప్తిని పొందలేక, ఇంకా పరమసులభుడుగా ఉండాలని ఆశించి, శ్రీరంగం- తిరుమల మొదలైన దివ్యదేశాలలో నిత్యవాసం చేస్తూ, ఇపుడు నా మనస్సులోకి వచ్చి ప్రవేశించాడు. అతని మహౌదార్యం ఎంతటిది? వాత్సల్యం ఎంత గొప్పది? ఏమి నా భాగ్యం!

**13. అవ :** ఇందులో తమకు లభించిన మహాభాగ్యానికి సంతోషించి, ఆళ్వార్లు పల్కుతున్నారు. మనోవాక్కాయాలనే త్రికరణాలు భగవద్విషయంలో ఆసక్తాలైన రీతిని ఇందులో తెలుపుతున్నారు.

తుణిన్దదు శిన్దై తుழாయలజ్గల్, అజ్గమ్
అణిన్దవన్ పేర్ ఉళ్ళత్తుప్పల్ కాల్, - పణిన్దదువుమ్
వేయ్ పిఱజ్గు శారల్ విఱల్ వేజ్గడవనైయే,
వాయ్ తిఱజ్గళ్ శొల్లుమ్ వగై 33వ పా.

నా మనస్సు తులసీమాలలను అలంకరించుకొన్ని స్వామి తిరునామాలనే పలు మార్లు అనుసంధించడంలో దృఢంగా అసక్తమై ఉన్నది. నా శరీరం ఆస్వామి శ్రీపాదాలను సేవిస్తున్నది. వెదుళ్ళు నిండుగా ఉండే సానువులను (కొండ చరియలను) కల శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే, గొప్ప బలాన్ని కల స్వామి స్వభావాలనే నా వాక్కు ఎపుడూ కీర్తిస్తున్నది. ఆహా ! నా భాగ్యం ఎంత గొప్పది!

**14. అవ :** నిత్యసూరులు ఆశించి, అభిలషించే భగవానుని శ్రీపాదాలను సేవించేవారు లౌకికమైన అర్థంయొక్క లాభాలాభాలనుగూర్చి చింతించరు - అని ఇందులో అంటున్నారు.

ఉళదెన్ఱిఱుమావార్ ఉణ్డిల్లై యెన్ఱు,
తళర్దల్ అదనరుగుఙ్జారార్, - అళవరియ
వేదత్తాన్ వేజ్గడత్తాన్ విణ్ణోర్ ముడి తోయుమ్,
పాదత్తాన్ పాదమ్ పయిన్ఱు 45వ పా.

అసంఖ్యాకాలు అయిన (అపరిమితం అయిన) వేదాలలో పరతత్త్వంగా ప్రతిపాదింపబడ్డవాడు, ఆ గొప్పతనం ప్రకాశించేటట్లు శ్రీవేంకటాచలంలో నిత్య వాసం చేసేవాడు, అక్కడికి నిత్యసూరులుకూడా వచ్చి పాదసేవ చేయగా వేంచేసి ఉండేవాడు అయిన స్వామి శ్రీపాదాలను ఎల్లప్పుడూ అనుసంధించే భాగవతులు, తమకు సంపద ఉన్నదని గర్వించరు. ఉన్న సంపద పోయినా, కొంచెం కూడా బాధపడరు. లాభనష్టాలను గూర్చి ఏ విధమైన చింతను వారు పొందరు.

**15. అవ :** తనను ఆశ్రయించినవారిని ఈ రీతిలో లాభాలాభాలనుగూర్చి బాధపడ కుండా ఉండేటట్లు చేయడంకోసం వారు (భక్తులు) పడిన పాట్లవంటివి కావు, స్వామి పడిన పాట్లు. ఇందుకోసం తిరుమల మొదలైన దివ్యదేశాలలో పలుదినాలుగా ఆశ్రయించి ఉన్నాడు- అని ఆழ்వార్లు అంటున్నారు.

పయిన్ఱదు అరజ్గమ్ తిరుక్కోట్టి, పన్నాళ్
పయిన్ఱదువుమ్ వేజ్గడమే, పన్నాళ్ - పయిన్ఱదు



అణితిగழுమ్ శోలై అణి నీర్‌మలైయే,
మణి తిగழுమ్ వణ్ తడక్కై మాల్ 46వ పా.

నీలమణివలె వెలిగేవాడు, గొప్ప ఔదార్యాన్ని కల శ్రీహస్తాలను కలవాడు అయిన స్వామి, తనను ఆశ్రయించినవారు తమ లాభనష్టాలనుగూర్చి బాధపడ కుండా ఉండేటట్లు చేయడంకోసం పలు దివ్యదేశాలలో నిత్యవాసం చేస్తూ అనుగ్రహిస్తున్నాడు. వాటిలో ప్రధానమైనవి- శ్రీరంగం, తిరుక్కోట్టియూర్, తిరువేజ్గడం, తిరునీర్‌మలై. వీటిలో స్వామి నిత్యవాసం చేస్తూ, భక్తులను స్థితప్రజ్ఞు లనుగా చేసి ఆనందిస్తున్నాడు.

**16. అవ :** అందరు నిన్ను తెలిసికొనే రీతిలో అన్నిటినీ సృష్టించావు - అని అంటున్నారు.

ఉణర్న్దాయ్ మఱై నాన్గుమ్ ఓదినాయ్ నీతి,
మణన్దాయ్ మలర్‌మకళ్ తోళ్‌మాలే!, - మణన్దాయ్ పోయ్
వేయిరుమ్ శారల్ వియలిరుమ్ ఞాలమ్ శూழ்,
మాయిరుమ్ శోలై మలై -48వ పా

నాల్గు వేదాలను సృష్టికాలంలో వ్యక్తం చేశావు. వాటి అర్థాన్ని నిర్ణయించే వేదోపబృంహణాలైన ఇతిహాసాదులను అధ్యయనం చేయించావు. (నిర్మించావు) పద్మనివాసిని అయిన లక్ష్మియొక్క భుజాలను సంశ్లేషించావు. ఆశ్రితవ్యామోహాన్ని కల స్వామీ! వెదుళ్ళతో నిండిన కొండ చరియలను కల్గినది, ఆశ్చర్యకరమైన వైశాల్యాన్ని కల భూమిచేత పరివేష్ఠితం అయిన ఉన్నతమైన తోటలను కల్గినది, అందఱు ఆశ్రయించేటట్లున్నది. అయిన వేంకటాద్రి చేరావు.

**17. అవ :** వేంకటాచలాన్ని అద్భుతమైన రీతిలో ఇందులో ఆழ்వార్లు కీర్తిస్తున్నారు. లతలతో, వృక్షాలతో, తీర్థాలతో అందంగా ఉండే వేంకటాచలమే నేను ఎప్పుడూ ఆశపడే పర్వతం - అని అంటున్నారు.

నెఱియార్ కుழఱ్కற்ఱై మున్నిన్ఱు పిన్ తాழ்న్దు,
అఱియాదు ఇళఙ్గిరి యెన్ఱెణ్ణి, - పిఱియాదు
పూఙ్గొడిక్కళ్ వైగుమ్ పొరుపునల్ కున్ఱెన్ఱుమ్,
వేజ్గడమే యామ్ విరుమ్బుమ్ వెఱ్పు 53వ పా.

కొందఱు మహానుభావులు తిరుమలకు పోయే దారిలో ఎంతో ఆదరంతో, "వేంకటాచల మార్గంలో ఉండడమే మంచిది" అని భావించి, ఆ దారిలోనే ఉండి, శ్వాసను బిగపట్టి భగవానుని ధ్యానిస్తూ చిరకాలంగా యోగసమాధిలో చిరకాలం ఉన్నారు. అపుడు జటలు కట్టిన వారి కేశపాశం ముందుభాగంనుండి వెనుకకు వేలాడుతున్నది. దానిని చూచి పూతీగలు "ఇవి చిన్న చిన్న కొండలు" అని భ్రమించి వాటిపై పాకుతున్నవి.

పూర్వం వాల్మీకి మహర్షిపై పుట్ట పెరిగినట్లే, ఈ భాగవతులపైన కూడా పూలతీగలు పాకడం చాలా ఆశ్చర్యాన్ని కల్గించే సన్నివేశంగా ఉన్నది. ఇటువంటి అత్యాశ్చర్యకరం, పరమభోగ్యం అయినది, అలలతో కూడిన జలసమృద్ధిని కల్గినది అయిన వేంకటాచలమే మనం ఆశపడతగిన కొండ.

**18. అవ :** తిరుమాలిరుమ్‌శోలై, వేంకటాచలం- అనే పర్వతాలలో భగవానుడు గొప్ప ఆదరాన్ని కల్గి ఉన్నట్లే, తమ హృదయాలలోకూడా ఆదరాన్ని కల్గి ఉన్నాడనే గాఢమైన నమ్మికతో "నీకు బాలాలయం అయిన పాలకడలిని విడచిపెట్టవద్దు సుమా!" అని ఆళ్వార్లు స్వామిని ప్రార్థిస్తున్నారు.

వెఱ్పెన్టిరుఞ్జోలై వేఙ్గడ మెన్టివ్విరణ్డుమ్,
నిఱ్పెన్టు నీ మదిక్కుమ్ నీర్మైపోల్, - నిఱ్పెన్టు
ఉళఙ్గోయిల్ ఉళ్ళమ్ వైత్తుళ్ళినేన్, వెళ్ళత్తు
ఇళఙ్గోయిల్ కైవిడే లెన్టు 54వ పా.

(భూదేవికి రెండు స్తనాలవంటివి అయిన) తిరుమాలిరుమ్‌శోలై, తిరువేఙ్గడమ్ అనే రెండు కొండలపై నీవు ఎంత ఆదరాన్ని చూపిస్తున్నావో అంత ఆదరాన్ని నా హృదయం అనే కోవెలలోకూడా చూపిస్తున్నావు. ఆహా! ఏమి నీ ఔదార్యం! ఆశ్రిత వాత్సల్యం! నా హృదయంలో నీవు అభిమానించి ఉండడంకోసంగా సాధుజన రక్షణమే ప్రయోజనంగా కల్గిన అవతారాలకు మూలకందం అయిన క్షీరాబ్ధి అనే బాలాలయాన్ని మాత్రం విడువవద్దు స్వామీ!

**19. అవ :** తన భక్తుల కోసం భగవానుడు సాన్నిధ్యాన్ని పొందిన దేశాలను ఆళ్వార్లు ఇందులో ప్రస్తావిస్తున్నారు.

**తమరుళ్ళమ్ తఞ్జై తలైయరఙ్గమ్ తణ్‌కాల్,**
**తమరుళ్ళమ్ తణ్ పొరుప్పు వేలై, - తమరుళ్ళమ్**



**మామల్లై కోవల్ మదిళ్ కుడన్దై యెన్బరే,**
**ఏవల్ల ఎన్దైక్కిడమ్** **70 వ.పా.**

భక్తుల హృదయాలు, తఞ్జైమామణిక్కోయిల్, దివ్యదేశాలలో ప్రధానం అయిన శ్రీరంగం, తిరుత్తణ్‌కాల్, భక్తులు సదా ధ్యానించే, వారికి సర్వస్వం అయిన శీతల నగం వేంకటాద్రి, క్షీరాబ్ధి, భక్తులు అనుసంధించే (ఒక భక్తుని కోసం భూమిపై పరుండిన) తిరుక్కడల్‌మల్లై, తిరుక్కోవలూర్, ప్రాకారాలను కల తిరుక్కుడన్దై అనేవి శత్రునిరసన సమర్థుడైన స్వామికి నివాసస్థానాలు.

**20. అవ :** తిరుమలలోని తిర్యక్కులుసైతం భగవానునకు కైంకర్యం చేసే తీరును ప్రస్తావిస్తూ, వివేకం ఏ మాత్రం లేని ఆ జంతువులుకూడా సేవ చేస్తూ ఉండగా, వివేకాన్ని కల్గిన నీవు ఉదాసీనంగా ఉండవచ్చునా? నీవుకూడా ఆ విధంగానే కైంకర్యం చేయాలి - అని ఆళ్వార్లు తమ మనస్సును ప్రబోధిస్తున్నారు.

**పోదఱిన్దు వానరఙ్గళ్ పూఞ్జునైపుక్కు, ఆఙ్గలర్న్ద**
**పోదఱిన్దు కొణ్డేత్తుమ్, పోదు ఉళ్ళమ్!- పోదు**
**మణి వేఙ్గడవన్ మలరడిక్కే శెల్ల,**
**అణి వేఙ్గడవన్ పేరాయ్‌న్దు** **72వ పా.**

ఓ మనసా! తిరుమలకొండపై ఉండే వానరాలుకూడా బ్రాహ్మముహూర్తాన్ని గుర్తించి పూలతో శోభిల్లే కొండవాగులలోకి పోయి, అక్కడ పుష్పించిన పూలను కోసి తీసికొని వచ్చి భగవానుని పూజిస్తున్నవి. నీవుకూడా ఆ స్వామిని స్తుతించడానికై వెళ్ళు. వేంకటేశ్వరుని తిరునామాన్ని అనుసంధించి, నీలమణివంటి తిరుమేనిని కల ఆ వేంకటేశ్వర స్వామియొక్క పూలవంటి శ్రీచరణాలను పూలతో అలంకరించు.

వేర్వేరు అర్థాలలో **"పోదు"** అనే పదాన్ని ఇందులో నాల్గు సార్లు ప్రయోగించిన వైలక్షణ్యం గమనించదగినది.

**21. అవ :** ముందు పాశురంలో ఆళ్వార్లు **"పెరున్దమిళన్ నల్లేన్ పెరిదు"** అని అంటూ తమను గొప్ప తమిళకవిగా నిర్దేశించుకున్నారు. అపుడు వారిని చూచి భగవానుడు- "మీరు గొప్ప ద్రావిడకవులు" అనే విషయం లోకం అంతటా ప్రసిద్ధం అయేటట్లుగా ఒక పాశురాన్ని పాడండి చూస్తాను" అని అనగా, ఆళ్వార్లు అత్యాశ్చర్య కరంగా శృంగారరసభరితం అయిన ఈ పాశురాన్ని అనుగ్రహిస్తున్నారు.

పెరుగు మదవేఴమ్ మాప్పిడిక్కు మున్నిన్ఱు,
ఇరుకణిళ మూఙ్గిల్ వాఙ్గి, - అరుగిరున్ద
తేన్ కలన్దు నీట్టుమ్ తిరువేఙ్గడమ్ కణ్డీర్,
వాన్ కలన్ద వణ్ణన్ వరై 75వ పా.

గొప్పవైన ఆడ ఏనుగులముందు నిలబడి రెండు కణుపులను కల ఒక లేత వెదురును పెకలించి తీసి, సమీపంలో ఉండే తేనెలో దానిని ముంచి, వాటిని ఇచ్చి తృప్తిపఱచే, స్రవిస్తున్న మదజలాన్ని కల్గినవి అయిన మగ ఏనుగులు సంచరించే వేంకటాచలమేసుమా మేఘాలతో కలసిన (పోలిన) వర్ణాన్నికల తిరుమేనును కల్గిన స్వామి వేంచేసి ఉండే కొండ.

ఈ పాశురంలోని మత్తగజవృత్తాంతంద్వారా భగవానుడు లక్ష్మీదేవి ఇంగితాలకు పరాధీనుడై సృష్ట్యాది కార్యాలను చేస్తాడనే విషయం వ్యంగ్యం. **"వరైశెయ్ మాక్కళిర్"** (పెరియతిరు-1-2-5) అనే తిరుమంగైమన్నన్ పాశురార్థం అను సంధేయం. భగవద్రామానుజులు ద్వయార్థాన్ని తమ శిష్యులకు తిరుమలపై అనుగ్రహించిన వృత్తాంతాన్ని ఈ పాశురార్థంతో సమన్వయించి పెద్దలు వివరించడం ఒక సాంప్రదాయికరహస్యం.

## పేయాఴ్వార్లు- మూన్ఱామ్ తిరువన్దాది

**22. అవ :** ఇంద్రియజయాన్ని పొంది భగవానుని తెలిసికోవడం చాలా అరుదు. ఇక ఆ శక్తి లేనివారు నశించిపోవలసినదేనా? వారికి ముక్తి కలిగే ఉపాయమే లేదా! అని అంటే, సర్వసులభోపాయాన్ని ఆఴ్వార్లు ఇందులో ఉపదేశిస్తున్నారు.

మాఱ్పాల్ మనఙ్జుఴిప్ప మఙ్గైయర్తోళ్ కైవిట్టు,
నూఱ్పాల్ మనమ్ వైక్క నొయ్విదామ్, - నాఱ్పాల
వేదత్తాన్ వేఙ్గడత్తాన్ విణ్ణోర్ముడి తోయుమ్,
పాదత్తాన్ పాదమ్ పణిన్దు 14వ పా.

చతుర్వేదాలతో ప్రతిపాదింపబడేవాడు, వేంకటాద్రిలో నివసించేవాడు, నిత్యసూరుల కిరీటాలచే స్పృశింపబడే శ్రీపాదాలను కలవాడు అయిన భగవానుని శ్రీచరణాలను ఆశ్రయించి, ఆ సర్వేశ్వరుని విషయంలోనే చిత్తాన్ని పొందికగా నిలిపి ఉంచినట్లయితే స్త్రీల బాహువులను కౌగలించుకోవాలనే ఆశను విడచి, వేదాంతశాస్త్రంలో మనస్సును నిలుపడం సాధ్యం అవుతుంది.



విశే :- మూన్ఱామ్ తిరువన్దాదిలోని పాశురాలు మోహనరాగం, త్రిపుట తాళంలో కూర్పబడ్డాయి.

**23. అవ :** చల్లని తులసీమాలను అలంకరించుకొన్న భగవానుడు దివ్యదేశాలతో, నా చిత్తంతో తేడా లేకుండా అత్యాదరంతో వేంచేసి ఉన్నాడు - అని అంటున్నారు.

శిఱన్ద ఎన్ శిన్దైయుమ్ శెఙ్గణరవుమ్,
నిఱైన్ద శీర్ నీళ్ కచ్చియుళ్ళుమ్, - ఉఱైన్దదువుమ్
వేఙ్గడముమ్ వెఃకావుమ్ వేళుక్కై ప్పాడియుమే,
తామ్ కడవార్ తణ్తుఴాయార్ 26వ పా.

శీతలతులసీదామభూషితుడైన శ్రీమన్నారాయణుడు తిరుమలలోను, తిరువెఃకా అనే దివ్యదేశంలోను, తిరువేళుక్కైప్పాడి అనే దివ్యదేశంలోను నిర్వాహకుడు మాత్రమే. అంటే- ఆ దివ్యదేశాలను పరిపాలించడం కోసం మాత్రమే అక్కడ వేంచేసి ఉన్నాడు, గొప్పదైన నా హృదయంలోను, ఎఱ్ఱని నేత్రాలను కల ఆదిశేషునిపైన, పరిపూర్ణసంపత్తును కల కాంచీనగరంలోను సాదరంగా నిత్యవాసం చేస్తున్నాడు.

"శిఱన్ద" - అని తమ మనస్సును విశేషించి పల్కడం ఎందుకు? అని అంటే, దానిని భగవానుడు ఆశపడినందువల్ల. **"వేళుక్కై, ప్పాడి"** అని విడదీసి, యథోక్తకారిసన్నిధి, రేపల్లె - అని అర్థం చెప్పేవారూ ఉన్నారు.

**24. అవ :** యశోదాదేవి, శ్రీకృష్ణస్వామి తనకు సన్నిహితుడుగా ఉన్నందువల్ల స్నేహాన్ని కల్గి ఉన్నది. ఇపుడు ఆ భగవానుడు మనకు సన్నిహితుడుగా లేడే! అని అంటే, అతని సాన్నిధ్యాన్ని కల దివ్యదేశాలను ఆఴ్వార్లు ప్రస్తావిస్తున్నారు.

శేర్న్ద తిరుమాల్ కడల్ కుడన్దై వేఙ్గడమ్,
నేర్న్ద ఎన్ శిన్దై నిఱైవిశుమ్బు, - వాయ్న్ద
మఱైపాడగమ్ అనన్దన్ వణ్తుఴాయ్ క్కణ్ణి,
ఇఱైపాడి యాయ ఇవై 30వ పా.

క్షీరాబ్ధి, తిరుక్కుడన్దై, తిరువేఙ్గడమ్, పరమపదం, తిరుప్పాడకమ్ - మొదలైన దివ్యదేశాలతో, నిత్యనిర్దుష్టాలైన వేదశాస్త్రాలతో, మిక్కిలి అంతరంగభక్తుడైన ఆదిశేషునితో, నాచిత్తంతో తేడా లేకుండా దివ్యపరిమళాలను, వెదజల్లే తులసీ

మాలను ధరించిన భగవానుడు ప్రీతితో నిత్యవాసం చేస్తున్నాడు. అతని సౌశీల్యం, సౌలభ్యం ఎంత గొప్పవి! (అని విద్దులవుతున్నారు.)

**25. అవ :** ఈ పాశురంలోకూడా భగవానుడు నిత్యవాసం చేసే కొన్ని దివ్యదేశాలను ప్రస్తావిస్తున్నారు.

పాఱ్కడలుమ్ వేఙ్గడముమ్ పామ్బుమ్ పని విశుమ్బుమ్,
నూఱ్కడలుమ్ నుణ్ణూల తామరైమేల్, - పాఱ్ప
ట్టిరున్దార్ మనముమ్ ఇడమాగ క్కొణ్డాన్,
కురున్దొశిత్త గోపాలకన్ 32వ పా.

పాలసముద్రం, తిరువేఙ్గడమ్, ఆదిశేషుడు, శ్రీవైకుంఠం, సముద్రంవంటి అగాధాలైన వేదవేదాంగాలు, ఉపనిషత్ప్రతిపాద్యం అయిన పరమయోగుల హృదయకమలకోశం - అనే వీటిలో సాధుజనసంరక్షణార్థంగా రేపల్లెలో అవతరించి ఆశ్రితవిరోధులను నిరసించిన శ్రీకృష్ణుడు అత్యంతాదరంతో వేంచేసి ఉన్నాడు.

**"పని విశుమ్బు"** - సంసారతాపాన్ని తీరుస్తుంది కనుక పరమపదానికి **"పని"** అనే విశేషణం ప్రయోగింపబడింది. **"నూల్కడల్"** - సముద్రంవలె వేదాలు, శాస్త్రాలు, అనంతాలు. కనుక వాటికి సముద్రసామ్యం. **"అనంతా వై వేదాః"** కదా!

**26. అవ :** చేతనాచేతనాలు అనే సమస్తపదార్థాలు తానే అయినవాడు, వేదశాస్త్ర ప్రతిపాద్యుడైన స్వామి పూర్వం సుభగశీతలమై, పరమభోగ్యం అయిన తిరుమలకు వచ్చి, నివాసం ఏర్పరచుకొని, ఇపుడు నా హృదయంలో ప్రవేశించి, దానిని విడచి పోలేక పోతున్నాడు- అని ఆనందంగా ఆళ్వార్లు పల్కుతున్నారు.

ఇఱైయాయ్ నిలనాగి ఎణ్తిశైయుమ్ తానాయ్,
మఱైయాయ్ మఱై ప్పొరుళాయ్ వానాయ్, - ప్పిఱైవాయ్న్ద
వెళ్ళత్తరువి విళఙ్గొలి నీర్ వేఙ్గడత్తాన్,
ఉళ్ళత్తినుళ్ళే ఉళన్ 39వ పా.

**"పిఱై వాయ్న్ద"** - ఇది తిరువేఙ్గడానికి కాని, **"వెళ్ళత్తరువి"** అనే ప్రయోగానికి గాని విశేషణంగా అన్వయించవచ్చు. **"మలైమేల్ తాన్ నిన్ఱు ఎన్ మనత్తుళ్ ఇరున్దానై"**- అనే తిరువాయ్మొళి సూక్తి సంవాదంగా స్మరణీయం.

సర్వస్వామియై, పృథివి మొదలైన పంచభూతాలకు అంతర్యామియై, ఎనిమిది దిక్కులు తానే అయి, వేదప్రతిపాద్యుడై, పరమపదస్వరూపుడై, చంద్రుని ఒరసుకొనే



టట్లు ఎత్తుగా ప్రవహించే కొండసెలయేళ్ళలో శబ్దం చేస్తున్న నీటిని గల వేంకటాచలంలో వేంచేసి ఉన్న స్వామి నా మనస్సులో నిత్యవాసం చేస్తున్నాడు.

**27. అవ :** "సర్వాధికుడైన భగవానుడు ఆశగా మన వద్దకు వచ్చి ప్రవేశించిన తరువాత మనకు ఏ కొఱత లేదుసుమా!" అని అంటూ ఆళ్వార్లు తమ మనస్సును ఉద్దేశించి పల్కుతున్నారు.

ఉళన్ కణ్డాయ్ నల్నెఞ్జే !ఉత్తమ నెన్ఱుమ్
ఉళన్ కణ్డాయ్, ఉళ్ళువారుళ్ళత్తు- ఉళన్ కణ్డాయ్,
విణ్ణొడుఙ్గ క్కోడుయరుమ్ వీఙ్గరువి వేఙ్గడత్తాన్,
మణ్ణొడుఙ్గ త్తా నళన్ద మణ్ 40వ పా.

ఓ మంచి మనసా! పురుషోత్తముడు అయిన స్వామి ఒకడు ఉన్నాడని గుర్తించావు కదా! ఎల్లప్పుడు అతడుంటాడని తెలిసికొన్నావుకదా! ధ్యానించే యోగుల హృదయ కమలాలలో అతడు ఉన్నాడని తెలిసికొన్నావుకదా! ఆకాశాన్ని తాకే రీతిలో (పొంగి పొర్లే) వృద్ధి చెందే సెలయేళ్ళను కల వేంకటాద్రిలోని స్వామియే, భూలోకమంతా వ్యాపించేటట్లుగా త్రివిక్రమావతారంలో తన శ్రీపాదాలతో కొలిచిన స్వామి.

**28. అవ :** పరమభోగ్యం అయిన పరమపదంలో వేంచేసి ఉండే స్వామి మనకు సులభుడుగా ఉంటాడా? అని అంటే, మనవంటివారుకూడా ఆశ్రయించడానికి వీలుగా తిరుమలకు వచ్చి అతడు నిత్యసాన్నిధ్యాన్ని కల్గి ఉన్నాడు- అని ఇందులో బదులిస్తున్నారు.

పురిన్దు మదవేళమ్ మాప్పిడియోడు ఊడి,
త్తిరిన్దు శినత్తాల్ పొరుదు,- విరిన్ద శీర్
వెణ్కోట్టు ముత్తుదిర్క్కుమ్ వేఙ్గడమే, మేలొరునాళ్
మణ్కోట్టు క్కొణ్డాన్ మలై 45వ పా.

వేంకటాద్రిలోని మదపుటేనుగులు తమకు తగిన గొప్ప ఆడ ఏనుగులతో కలిసి సంచరించి, తరువాత వాటితో సంభవించిన ప్రణయకలహంవల్ల అటు ఇటు తిరుగుతూ, అచటి స్వచ్ఛమైన శిలాఫలకాలపై ప్రతిఫలించిన తమ రూపాలను చూచి, అవి వేటే ఏనుగులు అని భ్రమపడి వాటితో పోరాడుతున్నపుడు, ఘర్షణవల్ల ఆ ఏనుగుల దంతాలనుండి ముత్యాలు రాలుతున్నవి. అటువంటి వేంకటాచలమే,

పూర్వం తన కొమ్ముతో ప్రళయాబ్ధినుండి భూమిని ఉద్ధరించిన వరాహస్వామి వేంచేసి ఉండే పర్వతం.

**29. అవ :** చిత్రకూటపర్వతంలో సీతారాములు లీలావిహారాలను చేసినట్లుగా తిర్యక్కులుసైతం క్రీడారసాన్ని అనుభవించే తిరుమలయే శ్రీత్రివిక్రమస్వామి వేంచేసి ఉండే దివ్యదేశం- అని అంటున్నారు.

తెళివ్ద శిలాతలత్తిన్ మేలిరున్ద మన్ది,
అళివ్ద కడువనైయే నోక్కి,- విళఙ్గియ
వెణ్ మదియమ్ తా వెన్నుమ్ వేఙ్గడమే, మేలొరునాళ్
మణ్ మదియిల్ కొణ్డుగన్దాన్ వాళ్ఖ్పు 58వ పా.

అతినిర్మలంగా ఉన్న స్ఫటికశిలాతలాలపైన విహరిస్తూ లీలారసాన్ని అనుభవించే ఒక ఆడవానరం తన నాథుడు అయిన మగవానరం ముఖం చూచి, ఆకాశంలో ప్రకాశిస్తున్న చంద్రుణ్ణి తెచ్చి ఇమ్మనే వేంకటాచలమే, పూర్వం యుక్తిగా మహాబలిదగ్గర నుండి భూమిని స్వాధీనం చేసికొని, ఆశ్రితజనసంరక్షణం చేసి, ఆనందించిన శ్రీత్రివిక్రమమూర్తి అయిన స్వామి సుఖంగా నివసించే చోటు.

**"మన్ది"** - ఆడుకోతి. **"మన్ది పాయ్ వడవేఙ్గడమామలై"** అని అమలనాదిపిరాన్ సూక్తి. **"కడువన్"**- మగవానరం. దానశీలుడైన బలిని వశీకరించుకోవడానికి తగిన ఉపాయం యాచనయే అని నిశ్చయించుకోవడమే ఇచటి స్వామి బుద్ధికౌశలం.

**30. అవ :** భగవానుడు ఆశ్రితుల ప్రతిబంధకాలను పోగొట్టడమే కాకుండా, వారికోసం ఈ భూమిపై ఉండే దివ్యదేశాల్లో వేంచేసి ఉన్నాడు- అని అంటున్నారు. లేక, భగవానుడు దివ్యదేశాలలో వేంచేసి ఉండేది నా మనస్సులో నివసించడానికి ముందు మాత్రమే. నా మనస్సులో నెలకొని ఉన్న తరువాత ఇపుడు వాటిని విడచిపెట్టి మళ్ళీ వాటిని కన్నెత్తికూడా చూడడం లేదు- అని అంటున్నారనికూడా చెప్పవచ్చు.

పణ్డెల్లామ్ వేఙ్గడమ్ పాఱ్కడల్ వైగున్దమ్,
కొణ్డఙ్గుఱైవార్క్కు క్కోయిల్పోల్, - పణ్డు
వళఙ్గిళరుమ్ నీళ్శోలై వణ్పూఙ్గడిగై,
ఇళఙ్గుమరన్ఱ విణ్ణగర్ 61వ పా.

ఈ పాశురానికి మూడు విధాలుగా భావాన్ని చెప్పవచ్చు,



1. వేంకటాచలం, పాలకడలి, తుమ్మెదలు గుంపులు గుంపులుగా చేరిన దివ్యోద్యానాలతో నిండి ఉండే ఘటికాద్రి, సర్వేశ్వరుడు నిత్యయౌవనంతో నిండిన రూపంతో వేంచేసి ఉండే తిరువిణ్ణగర్- అనే ఇవి అన్నీ పూర్వం పరమపదంలో నిత్యవాసం చేసే నిత్యసూరులకు ఇపుడు నివాసస్థానాలు అయినవి.

2. పూర్వం వైకుంఠంలో, క్షీరసముద్రంలో, వేంకటాచలంలో నిత్యవాసం చేసే స్వామికి ఇపుడు తుమ్మెదలు గుంపులు గుంపులుగా సంచరించే పూల తోటలతో అందంగా ఉన్న ఘటికాద్రి, లేలేత వయస్సులో కౌమారదశలో స్వామి వేంచేసి ఉండే తిరువిణ్ణగర్ వాసస్థానాలై ఉన్నవి.

3. వైకుంఠం, క్షీరాబ్ధి, వేంకటాచలాలలో నిత్యవాసం చేసే స్వామి పరిశుద్ధమై, పరమభోగ్యమైన నామనస్సు వాసస్థానంగా పొందిన తర్వాత వాటిని విడచిపెట్టి నా మనస్సులో నిత్యవాసం చేస్తున్నాడు.

**31. అవ :** భగవానుడు సంసారంలో ఉండడం మాత్రమేకాదు, పరమపదం కంటే అధికమైన ఆదరాన్ని దివ్యదేశాలలో కల్గినవాడై, వాటిలో నిత్యవాసం చేస్తున్నాడని అంటున్నారు.

విణ్ణగరమ్ వెఃకా విరితిరైనీర్ వేఙ్గడమ్,
మణ్ణగరమ్ మామాడ వేళుక్కై,- మణ్ణగత్త
తెన్కుడన్తై తేనార్ తిరువరఙ్గమ్ తెన్కోట్టి,
తన్ కుడఙ్గై నీరేఱ్ఱాన్ తాళ్ఖ్పు 62వ పా.

తనను ఆశ్రయించిన దేవతల రక్షించడంకోసం వామనుడై, మహాబలివద్ద మూడడుగుల నేలను యాచించి, ముల్లోకాలను తన శ్రీపాదాలతో కొలిచిన శ్రీత్రివిక్రమ స్వామి వేంచేసి ఉండే దివ్యదేశాలు- తిరువిణ్ణగర్, యథోక్తకారిసన్నిధి (తిరువెఃకా), దివ్యతీర్థాలతో నిండి ఉండే వేంకటాచలం, భూలోక వైకుంఠం అయిన, గొప్ప మేడలను కల తిరువేళుక్కై, భూలోకంలో కీర్తించదగిన తిరుక్కుడన్తై, తేనెతో నిండిన పుష్పాలను కల ఉద్యానవనాలతో సమృద్ధం అయిన శ్రీరంగం, దక్షిణదేశంలోని తిరుకోట్టియూర్- అనేవి.

**32. అవ :** భగవానుడు తన దివ్యమంగళవిగ్రహంలో ఇతరదేవతాచిహ్నాలను కూడ ధరించి ఆళ్వార్లకు దర్శనం ఇవ్వగా, ఆహా! ఇది ఏమి సౌశీల్యం! సౌలభ్యం! - అని ఆశ్చర్యపడుతున్నారు.

తాழ் శడైయుమ్ నీళ్ముడియుమ్ ఒణ్ మழுవుమ్ శక్కరముమ్,
శూழరవుమ్ పొన్నాణుమ్ తోన్టుమాల్, - శూழుమ్
తిరణ్డరుని పాయుమ్ తిరుమలై మేల్ ఎన్దైక్కు,
ఇరణ్డురువు మొన్నాయ్ ఇశైన్దు 63వ పా.

చుట్టూ ప్రవహిస్తూ నీటిలో సమృద్ధం అయిన సెలయేళ్ళు నిత్యం పారే వేంకటాచలంలో వేంచేసి ఉండే మా స్వామి వేలాడే జడలు, దీర్ఘమైన కిరీటం, అందమైన గొడ్డలి, సుదర్శన చక్రం, నడుమును చుట్టుకొని ఉండే సర్పం, బంగారు మొలనూలు కల్గి ఉండడంచేత స్వామిలో హరిహరరూపాలు రెండు చేరి ఒకటిగా కలసి స్ఫురిస్తున్నవి. ఆశ్చర్యం!

హరిహరచిహ్నాలను ధరించడంద్వారా స్వామి తన సౌశీల్యప్రకటనను చేసిన తీరును చూచి ఆழ்వార్లు ఇందులో విద్దులైనారు.

**33. అవ :** తిరుమలలోని అత్యాశ్చర్యకరమైన ఒక సంఘటనను ఆழ்వార్లు ఇందులో ప్రస్తావిస్తున్నారు.

పార్త్త కడువన్ శునైనీర్ నిழల్ కణ్డు,
పేర్త్తోర్ కడువనెన ప్పేర్న్దు, - కార్త్త
కళఙ్గనిక్కు క్కైనీట్టుమ్ వేఙ్గడమే, మేల్ నాళ్
విళఙ్గనిక్కు క్కన్డు ఎఱిన్దాన్ వెఱ్బు 68వ పా.

అసురుడు ఆవేశించిన కపిత్థాన్ని (వెలగచెట్టును) వత్సంలో ఆవేశించిన వేఱొక అసురునిపై (వత్సాసురునిపై) విసరికొట్టి నశింపజేసిన శ్రీకృష్ణుడు వేంచేసి ఉండే వేంకటాద్రిపై ప్రవహించే స్వచ్ఛమైన కొండకాలువల నీటిలో కోతులు తొంగి చూచినపుడు, ఆ నీటిలో కన్పించే తమ నీడను అవి ఇంకొక వానరంగా భ్రమపడి, దూరంగా పోయి, కతేపళ్ళను తింటూ చూచేవారికి వినోదాన్ని కల్గిస్తున్నాయి.

తిరుమలలోని సకలచరాచరాలు ఉపాదేయాలు. కనుక, అచటి వానరచేష్టితాలు కూడా అనుభావ్యాలే.

**34. అవ :** మానసికం అయిన భగవద్గుణానుభవరసం ఉన్మస్తకం కాగానే ఆழ்వార్లు నాయకీభావాన్ని పొంది, భగవదనుభవాన్ని సాక్షాత్తు పొందాలని ఆశించారు. కాని, అది ప్రకృతిసంబంధంచేత సాధ్యం కాకపోవడంవల్ల విశ్లేషాన్ని పొంది విరహావస్థను అనుభవించారు. ఆ స్థితిని నాయికతల్లి తెలియజేసే రీతిలో ప్రస్తుతం పాశురం



అనుగ్రహింపబడింది- అని చెప్పవచ్చు. లేక, లోకంలోని జనులను చూచి -"మీరు దేనిని చేసినా భగవత్సంబంధం ఉండేటట్లుగా చేయండి. అపుడు సత్కాలక్షేపాన్ని చేయవచ్చు" అని ఆழ்వార్లు ఉపదేశిస్తున్నారని కూడా చెప్పవచ్చు.

వెఱ్పెన్ఱు వేఙ్గడమ్ పాడుమ్, వియన్ తుழாయ్
కఱ్పెన్ఱు శూడుమ్ కరుఙ్గుழల్ మేల్, - మల్పోన్ద
నీణ్డతోళ్ మాల్కిడన్ద నీళ్కడల్ నీరాడువాన్,
పూణ్డనాళెల్లామ్ పుగుమ్ 69వ పా.

శ్రీవేంకటేశ్వరుని విషయంలో గల విరహబాధవల్ల, నా కుమార్తె ఎవరైనా ప్రసంగ వశంచేత పర్వతమనే పదాన్ని ఉచ్చరిస్తే వెంటనే వేంకటాచలాన్ని కీర్తిస్తున్నది. నల్లని తన కేశపాశానికి శ్లాఘ్యమైన తులసీమాలికలు తగినవి అని వానిని అలంక రించు-కుంటున్నది. చాణూరముష్టికులనే మల్లవీరులను వధించిన పొడుగైన బాహువులను కల సర్వేశ్వరుడు పరుండి ఉండే విశాలమైన క్షీరాబ్ధిలో జలకమాడడం కోసం ప్రతి ఉదయం కుతూహలపడుతున్నది.

ఓ లోకులారా! మీరు దేనినైనా ఒక పర్వతాన్ని కీర్తించాలంటే, వేంకటాచలాన్ని కీర్తించండి. ఏదైన ఒక మాలికను అలంకరించుకోవాలంటే స్వామి ధరించిన తులసీ మాలికను శిరస్సులో ధరించండి. స్నానం చేయాలంటే క్షీరాబ్ధిలో స్నానమాడండి. (అనే భావాన్ని కూడా చెప్పవచ్చు)

**"పాడుమ్", "శూడుమ్", "పుగుమ్"** - అనే ఈ క్రియలను విధ్యర్థకాలుగా గ్రహించి **"పాడండి, ముడుచుకోండి, అవగాహించండి"** -అనే అర్థాలను చెప్పవచ్చు. అపుడు పాశురం నాయకీపాశురంకాదు.

**35. అవ :** తిరుమలలోని ఏనుగులుసైతం వేంకటేశ్వరుణ్ణి ఆరాధించే క్రమాన్ని చమత్కారపూర్వకంగా ఆழ்వార్లు ఇందులో వర్ణిస్తున్నారు.

పుగు మదత్తాల్ వాయ్ పూశి క్కీழ் తాழ்న్దు, అరువి
ఉగు మదత్తాల్ కాల్ కழுవి క్కైయాల్, - మిగు మదత్తేన్
విణ్డమలర్ కొణ్డు విఱల్ వేఙ్గడవనైయే,
కణ్డు వణఙ్గుమ్ కళిఱు 70వ పా.

శిరస్సునుండి, గండస్థలాలనుండి తన నోటిలో పడుతున్న మదజలంతో నోటిని శుద్ధి చేసికొని (ఆచమించి), పైనుండి కిందకు ప్రవహించే కొండవాగులవలె కారుతున్న మదజలంతో కాళ్ళను కడుగుకొని, మిక్కిలి మత్తును కల్గించే తేనెతో

నిండి ఉండే పూవును తన తొండంతో తీసికొని వచ్చి ఏనుగు మహాబలశాలి అయిన శ్రీనివాసుని సేవించి నమస్కరిస్తున్నది. తిర్యక్కులుసైతం తిరుమలయొక్క పవిత్రతాప్రభావంవల్ల భగవానునిపై భక్తిని కల్గి, ఆ స్వామిని ఆరాధించి ధన్య జీవులవుతున్నవని పాశురపరమార్థం.

తిరుమలలోని తిర్యక్కులుసైతం భగవత్కైంకర్యాన్ని చేస్తున్నాయని అనడంవల్ల ఈ కొండమహిమ సూచింపబడింది. ఏనుగులకు గండస్థలాదులనుండి మదజలం కారడం సహజం. ఆ<u>ఌ</u>్వార్లు తమ అధ్యవసాయానుగుణంగా దీనిని ఇక్కడ అన్వయించడం విశేషం.

**36. అవ :** తిరుమలలోని ఆశ్చర్యకరమైన ఒక సంఘటనను ఆ<u>ఌ</u>్వార్లు ఈ పాశురంలో అనుగ్రహిస్తున్నారు.

**కళిఱు ముగిల్ కుత్త క్కైయెడుత్తోడి,**
**ఒళిఱు మరుప్పొశిగై యాళి, - పిళిఱి**
**వి<u>ఌ</u> క్కొన్టు నిన్తదిరుమ్ వేఙ్గడమే, మేనాళ్**
**కు<u>ఌ</u>క్కన్టు కొణ్డెఱిన్దాన్ కున్టు** 71వ పా.

తిరుమలలోని మదపుటేనుగు మేఘాన్ని చూచి దానిని ఇంకొక ఏనుగు అని భ్రమించి, కోపంతో తన తొండాన్ని ఎత్తి పరుగెత్తి ఆ మేఘాన్ని మోదగా, అపుడు ఆ ఏనుగుకూడా భయపడేటట్లుగా గర్జిస్తూ, అచట ఉండే శరభం తన తెల్లని దంతాలు, తొండం ప్రకాశిస్తుండగా ఆ ఏనుగును వధిస్తున్నది. ఇటువంటి ఆశ్చర్యకర సన్ని వేశాలకు నిలయం అయిన వేంకటాచలమే, పూర్వం ఒకానొక సమయంలో వత్సాసురుని ఎత్తి విసరివేసిన శ్రీకృష్ణుడు వేంచేసి ఉండే పర్వతం.

37. అవ : శ్రీవేంకటాచలం సర్వోత్కృష్టులైన నిత్యసూరులకుకూడా స్వామి అయిన శ్రీమన్నారాయణుని నివాసస్థలం- అని అంటున్నారు.

**కున్టొన్టినాయ కుఱుమగళిర్ కోల్వళైక్కై,**
**శెన్టు విళైయాడుమ్ తీఙ్గ<u>ఴి</u> పోయ్,- వెన్టు**
**విళఙ్గు మది కోళ్విడుక్కుమ్ వేఙ్గడమే, మేలై**
**ఇళఙ్గుమరర్కోమా నిడమ్** 72వ పా

భగవదనుభవం అనే అమృతాన్ని పానం చేయడంవల్ల నిత్యం కౌమారదశను కల నిత్యసూరులకు స్వామి అయిన భగవానుడు నివసించే వేంకటాచలం ఎన్నో



ఆశ్చర్యకరమైన విషయాలకు నిలయం. జ్ఞానం లేనివారిలో మొదటివారైన కిరాత కాంతలు సైతం వేంకటాచలమే తమకు పరమప్రాప్యం అనే దృఢమైన నమ్మికతో ఉన్నారు. వారు తమ అందమైన చేతులతో వంచిన అందమైన వెదుళ్ళు తరువాత పట్టు విడువడంవల్ల మళ్ళీ పైకి వేగంగా వెళ్ళి చంద్రుని బాధించే రాహువును సంహరించి, చంద్రుని ప్రకాశింపజేస్తున్నవి. చూచే వారికి ఈ సన్నివేశం చాలా ఆశ్చర్యాన్ని కల్గిస్తున్నది.

**38. అవ :** ఆదిత్యమండలాంతర్వర్తియై, అతని రథాన్ని నడిపించేవాడు, గోపికలతో కలసి ఆదరంతో కుంభనృత్యాన్ని చేసేవాడు, వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడు అయిన భగవానుని శ్రీపాదాలను స్తుతించడమే జిహ్వా ఉన్నందులకు గల ప్రయోజనం- అని ఆ<u>ఌ</u>్వార్లు ఉపదేశిస్తున్నారు.

**ఇడమ్ వలమే<u>ఴ్</u> పూణ్డ ఇరదిత్తేరోట్టి,**
**వడముగ వేఙ్గడత్తుమన్నుమ్, - కుడ నయన్ద**
**కూత్తనాయ్ నిన్టాన్ కురైకఴలే కూఱువదే,**
**నాత్తన్నాలుళ్ళ నలమ్** 73వ పా.

గాయత్రి, బృహతి, ఉష్ణిక్, జగతి, త్రిష్టుప్, అనుష్టుప్, పంక్తి - అనే ఏడు ఛందస్సులనబడే ఏడు గుఱ్ఱాలను పూన్చిన సూర్యుని రథాన్ని మేరువునకు ఎడమ పక్కగా కుడి పక్కగాను, సూర్యునకు, అతని సారథికి, వాహనాలైన అశ్వాలకు అంతర్యామిగా ఉండి నడిపించేవాడు, పూర్వం గోకులంలో అత్యంతాదరంతో గోపికలతో పాటు కలిసి కుంభనృత్యాన్ని చేసినవాడు, ఇపుడు అందఱికీ సులభుడై అందఱినీ కాపాడడం కోసం ఉత్తరదేశానికి, దక్షిణదేశానికి మధ్యమణిగా ఉండే వేంకటాద్రిలో పరమకృపా మూర్తియై వేంచేసి ఉండేవాడు, శ్రియఃపతి అయిన భగవానుని శ్రీపాదాలను స్తుతించడమే జిహ్వకు తగిన ప్రయోజనం.

**"ధ్యేయ స్సదా సవితృమండలమధ్యవర్తీ"** - ఇత్యాది నిత్యాను సంధేయ పౌరాణిక సూక్తి స్మరణీయం.

**39. అవ :** తిరుమల శిఖరాల ఔన్నత్యాన్ని అత్యంతచమత్కారం అయిన అతిశయోక్త్యలంకారంతో అనుగ్రహిస్తున్నారు.

**శార్న్ద కడు తేయ్ప్ప త్తడావియ కోట్టుచ్చివాయ్,**
**ఊర్న్ది యఙ్గుమ్ వెణ్మదియి నొణ్ ముయలై, - శేర్న్దు**

శినవేఙ్గై పార్క్కుమ్ తిరుమలైయే, ఆయన్
పునవేఙ్గై నాఱుమ్ పొరుప్పు 75వ పా.

ఆకాశంలో సంచరించే చంద్రుడు మిక్కిలి విశాలాలైన తిరుమలశిఖరాగ్రాలు తన క్రింది భాగాన్ని రాసుకొనే రీతిలో వాటికి దగ్గరగా మెల్లగా సంచరిస్తాడు. అపుడు అతని మధ్యభాగంలో ఉండే కుండేలును వేంకటాచలంలో సంచరించే పులి చూచి, దాన్ని ఆహారంగా చేసికోవాలనే ఉద్దేశ్యంతో పట్టుకోవాలని చూచింది. కాని, అది సాధ్యం కాకపోవడంతో కోపంతో అది గాండ్రిస్తున్నది. ఇటువంటి అద్భుత సన్నివేశాలతో నిండిన వేంకటాచలమే- వేంగైపూల దివ్యసుగంధంచేత వ్యాప్తమైన, శ్రీకృష్ణునకు నివాసస్థానం అయిన పర్వతం.

**40.** **అవ** : శ్రీవేంకటేశ్వరునివలెనే, అక్కడ ఆదరంతో నివసించే బోయలుకూడా మనకు పరమోద్దేశ్యభూతులని ఆళ్వార్లు అంటున్నారు. లేక, తిరుమలలోని భూసారాన్ని, సమృద్ధిని చమత్కారంగా వర్ణిస్తున్నారని కూడా చెప్పవచ్చు.

ముడిన్ద పొళుదిల్ కుఱవాణర్, ఏనమ్
పడిన్దుళుశాల్ పైన్దినైగళ్ విత్త, - త్తడిన్దెళున్ద
వేయ్ఙ్గళై పోయ్ విణ్ తిఱక్కుమ్ వేఙ్గడమే, మేలొరునాళ్
తీఙ్గుళల్ వాయ్ వైత్తాన్ శిలమ్బు 89వ పా.

యౌవనదశ దాటి వార్ధక్యంలో ప్రవేశించిన తిరుమలలోని బోయలు తమవృత్తి అయిన తేనెను సేకరించడం, వేటాడడం మొదలైన పనులను చేయడానికి శక్తి లేనందువల్ల అక్కడ ఉండే వెదురు పొదలను నఱికి, ఆ స్థలాలను పందులతో దున్ని, ధాన్యాలను చల్లి, పైరు చేస్తున్నారు. ఈ విధంగా బోయలు నఱికిన వెదుళ్ళు తిరుమల లోని భూసారం చాలా గొప్పది కనుక, మళ్ళీ పెరిగి ఆకాశం అంత ఎత్తును ఎదుగుతున్నవి.అటువంటి వేంకటాచలమే పూర్వం అందమైన వేణువును అధరంలో పెట్టుకొని ఊదిన శ్రీకృష్ణుడు నివసించే పర్వతం.

## తిరుమళిశై ఆళ్వార్లు

మఖాయాం మకరే మాసే చక్రాంశం భార్గవోద్భవమ్ ।
మహీసారపురాధీశం భక్తిసార మహం భజే ॥

తిరుమళిశై ఆళ్వార్లు "తిరుమళిశై" అనే దివ్యక్షేత్రంలో ద్వాపరయుగాంతంలో అవతరించారు. విభవనామసంవత్సరంలో మకరమాసం కృష్ణదశమి శుక్రవారం నాడు-



మఘానక్షత్రంలో సుదర్శనాంశతో భార్గవమహర్షివల్ల కనకాంగి అనే అప్సరసకు కుమారునిగా పుట్టిన ఈ ఆళ్వార్లు చిరకాలం వేర్వేరు సిద్ధాంతాలను, సంప్రదాయాలను అధ్యయనం చేసి, అవి నిస్సారాలని గుర్తించి, చివరికి పేయాళ్వార్ల అనుగ్రహంతో శ్రీవైష్ణవసిద్ధాంతలో ప్రవేశించారు. వీరి ప్రభావం అపారం. శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అనే నిర్ణయాన్ని సుస్పష్టంగా, నిర్ద్వంద్వంగా చేసిన మహనీయులు వీరు. "ఉఱైయిల్ ఇడాదవర్" అనే పేరును పొందినవారు. వీరు 96 పాశురాలను కల నాన్ముకన్ తిరువన్దాదిని, 120 పాశురాలను కల, అత్యంతం శ్రవణసుభగం అయిన తిరుచ్చన్ద విరుత్తం అనే ప్రబంధాన్ని అనుగ్రహించారు.

## నాన్ముకన్ తిరువన్దాది

**41.** **అవ** : వేంకటాచలం మొదలైన దివ్యక్షేత్రాలలో సర్వసులభుడై వేంచేసి ఉండే పరమభోగ్యుడైన స్వామి శ్రీపాదాలను విస్మరించడానికి వీలు అవుతుందా! అని అత్యంతాభినివేశంతో ఆళ్వార్లు పల్కుతున్నారు.

కుఱిప్పు ఎనక్కు క్కోట్టియూర్ మేయానై యేత్త,
క్కుఱిప్పు ఎనక్కు నన్మై పయక్క,- వెఱుప్పనో?
వేఙ్గడత్తు మేయానై మెయ్ వినైనోయ్ ఎయ్దామల్,
తాన్కడత్తుమ్ తన్మైయాన్ తాళ్ 34వ పా.

తిరుక్కోట్టియూర్‌లో, తిరుమలలో మనలను కాపాడడంకోసం నిత్యవాసం చేసే స్వామిని స్తుతించి, మంగళాశాసనం చేయాలని, అతనిని ఒక్కక్షణం కూడా విశ్లేషించ కుండా దర్శించి, ఆనందించి ఆత్మోజ్జీవనాన్ని పొందాలని చాలా ఆశపడు తున్నాను. శరీరసంబంధానికి మూలం అయిన కర్మలు, దుఃఖాలు సమీపించకుండా ఉండేటట్లు చేసి నన్ను రక్షించే ఆ స్వామి శ్రీపాదాలను నేను ఏవిధంగా ఉపేక్షించ గలను? ఎల్లప్పుడూ వాటిని స్తుతించడమే నాకు పరమోద్దేశ్యం.

విశే : నాన్ముకన్ తిరువన్దాది పాశురాలు అఠాణారాగంలో, ఆటతాళంలో కూర్పబడ్డాయి.

**42.** **అవ** : వేంకటేశ్వరుణ్ణి నిత్యం సేవించాలని, వేంకటాచలంలో నిత్యవాసం చేయాలని ఆశపడుతూ నా కాలాన్ని మంచిగా గడుపుతున్నాను- అని ఇందులో అంటున్నారు.

అళైప్పన్ తిరువేఙ్గడత్తానై క్కాణ,
ఇళైప్పన్ తిరుక్కూడల్ కూడ, - మళైప్పేర్

అరువి మణివరణ్ణి వన్దిழிయ, యానై
వెరువి యర వొడుజ్గుమ్ వెఱ్పు 39వ పా.

వేంకటేశ్వరుణ్ణి కళ్ళార దర్శించి ఆనందించాలని ఆశపడి, నాకు ఆ సేవను అనుగ్రహించమని నోరు తెఱచి ప్రార్థిస్తున్నాను. తిరుమలలో సమృద్ధిగా కురిసిన వర్షాలవల్ల అక్కడ నీటితో నిండుగా ఉండే కొండవాగులు రత్నాలను చేర్చుకొని ప్రవహిస్తూ క్రిందకు పడేటపుడు వాటిని చూచి ఏనుగులు భయపడి పరుగెత్తిపోయి, చివరకు కొండచిలువ నోటిలో పడుతున్నాయి. ఇట్టి ఎన్నో ఆశ్చర్యకరసన్నివేశాలకు నెలవు అయిన వేంకటాద్రిని వేగంగా చేరాలనే ఆశతో ఇసుకలో చక్రాన్ని గీచి శకునం చూచినా అదృష్టాన్ని పరీక్షించుకుంటున్నాను.

**"తిరుక్కూడల్ కూడ"** - స్త్రీలు తమ అభిమతం సిద్ధిస్తుందా లేదా? అని శకునాన్ని చూచే ద్రావిడదేశీయప్రక్రియ ఇది. గోదాదేవి **"తెళ్ళియార్ పలర్"** అనే దశకంలో ఈ ప్రక్రియను అనుసరించారు. ఈ **"కూడల్"** స్త్రీలకే చెందినది కనుక ఆళ్వార్లు ఈ పాశురాన్ని నాయకీభావంతో అనుగ్రహించారని కొందఱు భావించారు.

**43. అవ :** వినోదంకోసం నేను పలు పర్వతాల పేర్లను చెప్పే సమయంలో యాదృచ్ఛికంగా వేంకటాచలం పేరును చెప్పాను అంతమాత్రంతోనే దానిని నేను మనఃపూర్వకంగా చెప్పానని తలచినస్వామి తన అంతరంగభక్తునిగా అభిమానిస్తున్నాడు. ఏమి స్వామి ఔదార్యం ! కారుణికత్వం! అని ఆழ்వార్లు విస్మయపడుతున్నారు. లేక, భగవానుడు ఒక వలలో చిక్కుకొన్నాడు. నేనొక వలలో చిక్కుకొన్నాను- అని చమత్కారంగా పల్కుతున్నారనికూడా చెప్పవచ్చు.

వెఱ్పెన్ఱు వేజ్గడమ్ పాడినేన్, వీడాక్కి
నిఱ్కిన్ఱేన్ నిన్ఱు నినైక్కిన్ఱేన్, - కఱ్కిన్ఱ
నూల్వలైయిల్ పట్టిరున్ద నూలాట్టి కేళ్వనార్,
కాల్వలైయిల్ పట్టిరున్దేన్ కాణ్ 40వ పా.

ఎపుడో ఒకసారి ఎక్కడైనా పర్వతాల పేర్ల ప్రసక్తి వచ్చినపుడు నేను ఎపుడో ఒకసారి వేంకటాచలం పేరును చెప్పాను. అంతమాత్రానికే భగవానుడు నన్ను తన అంతరంగ భక్తునిగా ఆదరించి- **"ఎన్ ఊరై చ్చొన్నాయ్, ఎన్ పేరై చ్చొన్నాయ్, ఎన్నై నోక్కినాయ్"** అని అంటూ మోక్షసామ్రాజ్యాన్ని నాకు, నాకు సంబంధించిన వారికి హస్తగతం చేశాడు. ఈ మహాగుణాన్ని భావించి భావించి, నా మనస్సు ద్రవిస్తున్నది.



వేదశాస్త్రాలలో ప్రతిపాదింపబడ్డ భక్తి అనే వలలో భగవానుడు చిక్కుకొన్నాడు. నేను ఆ శ్రియఃపతి పాదాలు అనే వలలో చిక్కుకొన్నాను. నేను అహృదయంగా చెప్పిన మాటను సహృదయోక్తిగా భావించి, నన్ను కటాక్షించిన పరమోదారుడైన స్వామి శ్రీపాదాలను నేను ఒక క్షణంకూడా విడువను -అని పరమార్థం.

**"నిన్ఱు నినైక్కిన్ఱేన్"** - అహృదయోక్తులను సైతం సహృదయోక్తులుగా గ్రహించి అనుగ్రహించే భగవానుని మహౌదార్యాన్ని సదా ధ్యానిస్తున్నాను - అని భావం. **"కఱ్కిన్ఱ నూల్ వలైయిల్ పట్టిరున్ద"** అనే విశేషణాన్ని **"నూలాట్టి"**కి గాని, **"నూలాట్టి కేళ్వనార్"**కు గాని అన్వయించవచ్చు.

**44. అవ :** "ఓ కరుణానిధీ ! నీవు వేంకటాచలాన్ని వదలి నా హృదయంలో నివాసం ఉంటున్నావు. అయినా, నేను ఆ వేంకటాచలాన్ని సేవించాలని ఆశపడుతున్నాను"- అని అంటూ ఆழ்వార్లు తమ కుతూహలాన్ని ఇందులో వ్యక్తీకరిస్తున్నారు.

కాణలుఱుగిన్ఱేన్ కల్లరువి ముత్తుదిర,
ఓణ విழாవిల్ ఒలి యదిర,- ప్పేణి
వరు వేజ్గడవా! ఎన్నుళ్ళమ్ పుగున్దాయ్,
తిరువేజ్గడమదనై చ్చెన్ఱు 41వ పా.

వేంకటాచలంలో పెద్దగా శబ్దిస్తూ ప్రవహించే సెలయేళ్ళలో ముత్యాలు కొట్టుకొని వస్తున్నవి. స్వామి అవతార నక్షత్రం శ్రవణంతో కూడిన ఉత్సవదినంలో శ్రీవైష్ణవులు చేసే మంగళాశాసనధ్వని అంతటా వ్యాపిస్తున్నది. పలు దిక్కుల నుండి పలువురు భక్తులు వేంకటాచలానికి వచ్చి సేవిస్తున్నారు. వీటిని అన్నిటినీ అనాదరించి ఓ వేంకటేశ్వరా! నీవు నా హృదయాన్ని నిత్యవాసం చేసికొన్నావు. నేనేమో ఆ తిరుమలను చేరి, సేవించాలని ఆశపడుతున్నాను.

"నేను తిరుమలకు వచ్చి నిన్ను సేవించాలని భావించగా, నీవు నా హృదయంలోనికి ఆశపడి వచ్చి నివసిస్తున్నావు. ఇపుడు నేనేమి చేయను?" అనే భావంకూడా ఈ పాశురంలో స్ఫురిస్తుంది.

**45. అవ :** దివ్యాలైన సిరిసంపదలతో నిండిన, భక్తుల పాపాలను హరించే వేంకటాచలాన్ని వెంటనే ఆశ్రయించండి - అని అంటూ లోకంలోని జనులను ఆழ்వార్లు ఉద్బోధిస్తున్నారు.

శెన్ఱు వణజ్గుమినో శేణుయర్ వేజ్గడత్తై,
నిన్ఱు వినై కెడుక్కుమ్ నీర్మైయాల్, - ఎన్ఱుమ్

కడిక్కమల నాన్మగనుమ్ కణ్మూన్డత్తానుమ్,

అడిక్కమల మిట్టు ఏత్తుమ్ అజ్గు 42వ పా.

మిత్రులారా! ఎల్లప్పుడు పరిమళించే భగవానుని నాభీకమలంనుండి ఉద్భవించిన చతుర్ముఖుడు, త్రినేత్రుడైన శివుడు ఏ స్వామి పాదాలలో పూలను సమర్పించి, స్తుతిస్తున్నారో, ఆ స్వామి వేంచేసి ఉండే తిరుమలను చేరి, అక్కడ నిలచి ఉండి, స్వభావంచేతనే పాపాలను పోగొట్టే, ఉన్నతమైన ఆ వేంకటాచలాన్ని ఆశ్రయించండి.

**"శేన్, ఉయర్"** - అనే ఔన్నత్యాన్ని తెలిపే ఈ పదాలు రెండూ కలిపి ప్రయోగించడానికి ద్రావిడసంప్రదాయంలో **"మీమిశై"** అని పేరు. మిక్కిలి ఎత్తైన - అని తాత్పర్యం. **"నిన్ఱు వినై కెడుక్కుమ్"** - అనే ప్రయోగం వేంకటశబ్దార్థం. **"వేజ్గడజ్గళ్"** ఇత్యాది తిరువాయ్మొళి సూక్తి దీనికి సంవాదంగా స్మరణీయం.

**46. అవ :** "మహామహిమాన్వితులైన బ్రహ్మరుద్రులుకూడా శ్రీస్వామికి ఆరాధన సామగ్రితో, నీరాజనాన్ని సమర్పించడంకోసం తిరుమలకు విచ్చేస్తారు. అటువంటి వేంకటాద్రిని మీరు ఆశ్రయించండి'' అని అంటున్నారు.

**మజ్గుల్ తోయ్ శెన్ని వడ వేజ్గడత్తానై,**

**క్కజ్గుల్ పుగున్దార్గళ్ కాప్పణివాన్, - తిజ్గళ్**

**శడై యేఱ వైత్తానుమ్ తామరైమేలానుమ్,**

**కుడై యేఱ త్తాజ్గువిత్తుక్కొణ్డు** **43వ పా.**

చంద్రుని జటాజూటాలంకారంగా కల శివుడు, స్వామి నాభీకమలంలో వాసం ఉండే చతుర్ముఖుడు ఛత్రచామరాది సాధనాలను తీసికొని, మేఘమండలపర్యంతం వ్యాపించిన శిఖరాలను కల, ఉత్తరదిక్కున ఉండే వేంకటాచలానికి స్వామి అయిన సర్వేశ్వరునకు నీరాజనాన్ని సమర్పించడంకోసం వస్తారు. అటువంటి వైభవాన్ని కల వేంకటాచలాన్ని మీరుకూడా ఆశ్రయించండి.

ఇచటి **"కుడై"** - చామరాదిసకలభోగోపకరణాలకు ఉపలక్షకం.

**47. అవ :** "యౌవనం చెడకముందే, ఎటువంటివారినైనా సంరక్షించే స్వామి వేంచేసి ఉండే వేంకటాచలాన్ని ఆశ్రయించండి'' అని అంటూ లోకులను ప్రబోధిస్తున్నారు.



**కొణ్డు కుడజ్గాల్మేల్ వైత్త కుழవియాయ్,**

**త్తణ్డవరక్కన్ తలై తాళాల్, - పణ్డెణ్ణి**

**పోమ్ కుమరన్ నిఱ్కుమ్ పొழిల్ వేజ్గడమలైక్కే,**

**పోమ్ కుమరరుళ్ళీర్ పురిన్దు** **44వ పా.**

యౌవనం చెడకుండా, ఇంద్రియాలను స్వాధీనంలో కల జనులారా! నేను చెప్పే ఈ మాటను సావధానంగా వినండి. పూర్వం ఒకానొక సమయంలో రావణుడు తన పది తలలను మఱుగుపఱుచుకొని చతుర్ముఖుని దగ్గరకు పోయి అతనిని వంచించి వరాలను గ్రహించే సమయంలో భగవానుడు ఒక చిన్న బాలుని రూపంలో బ్రహ్మ ఒడిలో ప్రత్యక్షమై - "ఇతడు పది తలలను కల రావణుడుసుమా! ఇతడు నిన్ను వంచించి వరాలను పొందడంకోసం వచ్చాడు. ఇతనికి వరాలను ఇస్తే లోకోపద్రవం కల్గుతుంది'' అని తెలుపడంకోసం తన పాదంతో అతని పది తలలను లెక్కించి చూపాడు. ఆ విధంగా ఆశ్రితరక్షణతత్పరుడైన, **"యువా కుమారః"** అని వేదం కీర్తించిన రీతిలో నిత్యయౌవనుడైన సర్వేశ్వరుడు సర్వసులభుడై వేంచేసి ఉండేది, రమణీయోద్యానా లతో నిండినది అయిన వేంకటాద్రిని మీరు చేరి, ఆశ్రయించండి.

ఈ పాశురంలోని కథ పురాణేతిహాసాదులలో కన్పించలేదు. కల్పాంతరంలో జరిగినట్లు సంభావ్యమని, భగవదనుగ్రహంవల్ల ఆழ్వార్లకు స్ఫురించిందని పూర్వాచార్య సూక్తి. ఈ వృత్తాంతమే ముదల్తిరువన్దాదిలో (40 పా), మూన్ఱామ్ తిరువన్దాదిలో (75వ పా) ప్రస్తావింపబడడంవల్ల దేశీయం కావచ్చునని సాహిత్యవిమర్శకుల అభిప్రాయం. **"కుమరరుళ్ళీర్"** అనే సంబోధనవల్ల వార్ధక్యం రాకముందే తిరుమలకు వెళ్ళాలని ఉద్బోధిస్తున్నారని అభిజ్ఞుల వివరణం.

**48. అవ :** "వేంకటాచలం ఈ లోకంలోని సంసారులకు మాత్రమేకాదు, పరమపదం లోని నిత్యసూరులకుకూడా సంసేవ్యంగా- ఉన్నది'' అని అంటూ ఆழ్వార్లు విద్దులవు తున్నారు.

**పురిన్దు మలరిట్టు పుణ్డరీకప్పాదమ్,**

**పరిన్దు పడుకాడు నిఱ్ప, - తెరిన్దెజ్గుమ్**

**తానోజ్గి నిఱ్కిన్ఱాన్ తణ్ణరువి వేజ్గడమే,**

**వానోర్క్కుమ్ మణ్ణోర్క్కుమ్ వైప్పు** **45వ పా.**

భక్తులు మిక్కిలి ఆదరంతో సేవించి, స్వామి పాదాలలో పవిత్రకుసుమాలను సమర్పించి, పరమప్రీతితో ఎల్లప్పుడూ సేవిస్తూ అక్కడే ఉండడానికి వీలయిన రీతిలో ప్రకాశించే సర్వాధికుడైన భగవానుడు వేంచేసి ఉన్నది, చల్లని కొండకాలువలు ప్రవహించే చోటు అయిన వేంకటాచలమే, పరమపదవాసులకు, నిత్యసూరులకు పెన్నిధి.

**"పరిన్దు"** - ఇచట **"పరివు"** - ఏమంటే అస్థానే భయశంక. **"పడుకాడు నిఱ్ప"** - నఱుకబడిన చెట్టువలె కాళ్ళు కదలకుండా నిలచి ఉండడం. **"వైప్పు"** నిధి - నిధివలె భోగ్యుడు.

**49. అవ :** జ్ఞానం కలవారికి, జ్ఞానం లేనివారికి ఇద్దరికీ వేంకటాచలమే శరణ్యం- అని అంటున్నారు. లేక, వేంకటాచలంలో కన్పించే ఒక అద్భుతసన్నివేశాన్ని ప్రస్తుతిస్తున్నారని కూడా చెప్పవచ్చు.

> **వైప్పన్ మణివిళక్కా మా మదియై, మాలుక్కెన్ఱు**
> **ఎప్పొఴుదుమ్ కై నీట్టుమ్ యానైయై, - ఎప్పొదుమ్**
> **వేడు వళైక్క క్కుఱవర్ విల్లెడుక్కుమ్ వేఙ్గడమే,**
> **నాడువళైత్తాడు మేల్ నన్ఱు** **46వ పా.**

ఆకాశంలో మంగళదీపంవలె ప్రకాశించే చంద్రుని తిరుమలపైన ఉండే ఒక ఏనుగు చూచి -"దీనిని భగవానునకు ఆరని దీపంగా సమర్పిస్తే బాగుండును", అని భావించి, ఆ చంద్రుణ్ణి పట్టుకోవడంకోసం తన తొండాన్ని చాచింది. కాని, చంద్రుణ్ణి పట్టుకోలేకపోవడంవల్ల చాచిన తొండాన్ని చాచినట్లుగానే ఉంచి ధ్యానిస్తూ నిలచింది. చాలాకాలంగా ఆ ఏనుగును బంధించాలని ప్రయత్నిస్తున్న వేటగాళ్ళు ఇదే తగిన సమయం అని ధ్యానపరవశమై ఉన్న ఆ ఏనుగు దగ్గరకు మెల్లగా వచ్చి, బంధించారు. అపుడు తిరుమలలో నివసించే బోయలు పరమభక్తశిఖామణి అయిన ఆ ఏనుగును బంధాలనుండి విడిపించాలని వేటగాళ్ళపై బాణాలను ఎక్కుపెట్టారు. ఇటువంటి అద్భుతసన్నివేశంతోకూడిన వేంకటాచలానికి లోకులు అందఱు ప్రదక్షిణం చేసి, ఆనందపారవశ్యంతో నాట్యం చేయడం తగినది.

చంద్రమండలపర్యంతం తిరుమల ఔన్నత్యం ఉన్నదని ఇందులో స్ఫురిస్తున్నది. **"కామీ స్వతాం పశ్యతి"** అని అన్నట్లు తిరుమలలోని వానరాలు, మృగాలు, సకల ప్రాణులు తమవలె భగవానుని కైంకర్యాన్ని ముఖ్యకార్యంగా భావించి చేస్తున్నవి - అని ఆఴ్వార్ల భావం.



**50. అవ :** శ్రీవేంకటేశ్వరునివలెనే తిరుమల, ఆ తిరుమలపై ఉండే సకలపదార్థాలు ఉద్దేశ్యాలు. కాబట్టి వాటిని ఆశ్రయించండి- అని ఇందులో ప్రబోధిస్తున్నారు.

> **నన్మణి వణ్ణనూర్ ఆళియుమ్ కోళరియుమ్,**
> **పొన్మణియుమ్ ముత్తముమ్ పూమరముమ్, - పన్మణినీర్**
> **ఓడు పొరుదురుళుమ్ కానముమ్ వానరముమ్,**
> **వేడుముడై వేఙ్గడమ్** **47వ పా.**

శరభమృగాలను, పరాక్రమాన్ని కల సింహాలను, బంగారాన్ని, మణులను, ముత్యాలను, నిండుగా పూచిన వృక్షాలను, పలు రత్నాలను, నీటిప్రవాహాలతో నిండిన అరణ్యాలను, వానరాలను, బోయవాళ్ళను కల వేంకటాచలమే ఇంద్రనీలంవంటి వర్ణాన్ని కల భగవానుడు నిత్యవాసం చేసే ఊరు.

**51. అవ :** పరమపదంలో భగవానుని నిరంతరం సేవించే నిత్యసూరులుకూడా ఆ పరమపదంలో ప్రకాశించే, పరత్వాన్ని తెలిపే గుణాలను అనుభవించగలరే తప్ప, సౌలభ్యసౌశీల్యాదిగుణాలను అనుభవించే వీలు లేదు. అందువల్ల ఆ శీలాది గుణాలను అనుభవించడంకోసంగా వారు తిరుమలకు వచ్చి, వేచి ఉంటారు. అంతేకాక, ఈ తిరుమలే ఆశ్రితుల సకలపాపాలను పోగొట్టి, రక్షించే స్వామి నివాసం ఉండే ఊరు. అని అంటున్నారు.

> **వేఙ్గడమే విణ్ణోర్ తొఴువదువుమ్, మెయ్మ్మైయాల్**
> **వేఙ్గడమే మెయ్ వినైనోయ్ తీర్ప్పదువుమ్, - వేఙ్గడమే**
> **దానవరై వీఴ త్తన్నాఴిప్పడై తొట్టు,**
> **వానవరై క్కాప్పాన్ మలై** **48వ పా.**

నిత్యసూరులు యథార్థమైన భక్తితో ఆశ్రయించేది వేంకటాచలం. పాపాలను, వాటివల్ల కలిగే శారీరకదుఃఖాలను తీర్చగల్గినది వేంకటాచలం. అసురులు నశించేటట్లు తన సుదర్శన చక్రాయుధాన్ని ధరించి, దేవతలను రక్షించిన స్వామి నివసించే కొండ వేంకటాచలం.

**"వేఙ్గడమే మెయ్నోయ్ తీర్ప్పదువుమ్"** - ఈ ప్రయోగం వేంకటశబ్ద నిర్వచనం.

**52. అవ :** శ్రీవేంకటేశ్వరుని శ్రీపాదాలలో సేవను చేసేవారే పరమపదాన్ని ఏలగలరు- అని అంటున్నారు.

**వీఱ్ఱిరున్దు విణ్ణాళ వేణ్డువార్, వేఙ్గడత్తాన్**
**పాఱ్ఱిరున్ద వైత్తారే పల్‌మలర్‌గళ్, - మేల్‌తిరున్ద**
**వాళ్వార్ వరుమది పార్‌త్తు అన్బినరాయ్, మఱ్ఱవర్‌క్కే**
**తాళ్వాయిరుప్పార్ తమర్ 90వ పా.**

వేంకటాద్రినాథుని శ్రీచరణాలలో పలు విధాలైన పుష్పాలను భక్తిశ్రద్ధలతో చక్కగా సమర్పించినవారే నిరతిశయమహిమతో పరమపదాన్ని పాలించగలరు. వారికంటె, ఆ భగవానునకు భక్తులై, తదీయగంభీరమనోనుసారులైన భాగవతులచేత "వీరు మనవారు'' అని అభిమానింపబడ్డవారు ఇంకా గొప్పతనాన్ని కలవారై ఉజ్జీవిస్తారు.

భాగవతాభిమానంలో ఒదిగి ఉండేవారు అందరికన్న మిన్న'' - అనేది ఈ పాశురసారం. **"వరుమ్ మది పార్‌త్తు"** - భగవానుని హృదయాన్ని తెలిసి వర్తించే వారని, వీరి అభిప్రాయానుసారం సర్వేశ్వరుడు నడుచుకొంటాడని - రెండు రీతుల్లో దీనికి అర్థాన్ని చెప్పవచ్చు. **"విధయ శ్చ వైదికాః త్వదీయ గంభీరమనోఽనుసారిణః"** అనే స్తోత్రరత్నసూక్తి స్మరణీయం.

## తిరుచ్చన్దవిరుత్తం

**53. అవ :** గత పాశురంలో ఆళ్వార్లు తాము ఆశ్రయించదగిన ఆశ్రయ ణీయస్థలాన్ని గూర్చి అనుగ్రహించవలసినదిగా భగవానుని ప్రార్థించారు. అపుడు భగవానుడు "ఆశ్రయణీయస్థలాలను గమనించినట్లయితే వాటిలో ఏదో ఒక క్షేత్రాన్ని ఆశ్రయించే భక్తులకు వారి ఆశ్రయణానికి అనుకూలంగా నేను ఫలప్రదుడనై ఉండడం తప్ప, "మీకు ఇదే ఆశ్రయణీయస్థలం'' - అని అంటూ విశేషించి చెప్పడం నాకు వీలవు తుందా!'' - అని భావించినట్లుగా తలచిన ఆళ్వార్లు అందుకు ఇందులో బదులు పల్కుతున్నారు.

కున్ఱిల్ నిన్ఱు వానిరున్ద నీళ్‌కడల్ క్కిడన్దు, మణ్
ఒన్ఱు శెన్ఱదొన్ఱైయుణ్డ తొన్ఱిడన్దు పన్ఱియాయ్,
**నన్ఱుశెన్ఱ నాళవఱ్ఱుళ్ నల్లుయిర్ పడైత్తు అవర్‌క్కు**
**అన్ఱు తేవమైత్తళిత్త వాతిదేవ నల్లైయే 48 వ.పా.**

వేంకటాద్రిలో నిలచి ఉండి, పరమపదంలో వేంచేసి ఉండి, విశాలమైన పాల కడలిలో పరుండి ఉండి, ఈ భూమిని ఒకసారి త్రివిక్రముడవై వ్యాపించి, వేఱొక



సమయంలో ఈ భూమిని గ్రహించి, ఇంకొక సమయంలో ఈ భూమిని వరాహ రూపివై ఉద్ధరించి, మంచి సమయంలో జీవులను సృష్టించి, అపుడు ఆ మానవులకు వారి గుణాలకు తగినట్లుగా వారు ఆశ్రయించదగిన దేవతలను సృష్టించి, హితాన్ని చేసినందువల్ల జగత్కారణభూతుడవైన నిరుపాధికదేవుడవు. కనుక నీవు సర్వసమాశ్రయణీయుడవు కదా.

**54. అవ :** తన భక్తుని విషయంలోగల ఆశ్రితవ్యామోహం అనే గుణంచేత భగవానుడు దివ్యదేశాలలో ప్రీతితో వేంచేసి ఉంటాడు- అని అంటున్నారు.

**శెళుఙ్కొళుమ్ పెరుమ్బని పొళిన్దిడ, ఉయర్‌న్ద వేయ్**
**విళున్దులర్ న్దెళున్దు విణ్ పుడైక్కుమ్ వేఙ్గడత్తుళ్ నిన్ఱు,**
**ఎళున్దిరున్దు తేన్ పొరున్దు పూమ్బొళిల్ తళై, క్కొళుమ్**
**శెళున్దడఙ్గుడన్దైయుళ్ కిడన్ద మాలు మల్లైయే 60వ పా.**

తిరుమలలో రాత్రిసమయాలలో ఘనీభవించిన మంచు నిరంతరం వర్షించగా ఆకాశం అంత ఎత్తుకు ఎదిగిన వెదుళ్ళు ఆ మంచుగడ్డల బరువువల్ల భూమిపైకి వంగిపోతాయి. సూర్యుడు ఉదయించగానే ఆ మంచుగడ్డలు కఱగిపోవడంవల్ల మళ్ళీ అవి ఉవ్వెత్తున పైకిలేచి ఆకాశంలోకి చొచ్చుకొని పోతాయి. ఇటువంటి వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడు. తుమ్మెదలు గుంపులు గుంపులుగా చేరి, తేనెను పానం చేసే పూలతో నిండిన లతలను కల దివ్యోద్యానాలతో విరాజిల్లు తున్నది. అందమైన తటాకాలను కల్గి ఉన్నది అయిన తిరుక్కుడన్దై అనే దివ్యక్షేత్రంలో పరుండి ఉండేవాడు- ఆశ్రితవ్యామోహాన్ని కల స్వామియే కదా !

ఈ పాశురం తోడిరాగం - ఆదితాళంలో రచింపబడింది.

తిరుమలలోని అన్నీ ఉపాదేయాలే కాబట్టి మంచును **"శెళుమ్ కొళుమ్ పెరుమ్ పని"** అని విశేషించారు. **"శెళుమ్ కొళుమ్"** అనే విశేషణాన్ని **"వేయ్"** (వెదుళ్ళ)కు అన్వయించి, **"శెళమ్ కొళుమ్ ఉయర్‌న్ద వేయ్", "పెరుమ్ పని పొళిన్దిడ విళున్దు"** అనికూడా అర్థాన్ని చెప్పవచ్చు. అపుడు శ్రీవేంకటేశ్వరుని కటాక్షామృతసేచనంవల్ల అభివృద్ధి చెందే వెదుళ్ళు - అనే భావం స్ఫురిస్తుంది.

**55. అవ :** తమ విషయంలో భగవానుడు చేసిన ఉపకారం తమ మనస్సులో స్థిరంగా నిలచి ఉండడంచేత ఆళ్వార్లు ఆ ఉపకారానికి విద్ధులై, తిరుమలలో నిలచి ఉండడం, పరమపదంలో కూర్చుని ఉండడం, క్షీరాబ్ధిలో యోగనిద్రలో ఉండడం

అంతా నాకు తన శ్రీపాదాలలో భక్తి కలగడానికి ముందు మాత్రమే; ఇపుడు అతడు ఉండేది నా మనస్సులోనే - అని అంటున్నారు.

నిఱ్పదుమ్ ఓర్ వెఱ్పకత్తు ఇరుప్పుమ్ విణ్ కిడప్పదుమ్,
నఱ్పెరుమ్ తిరైక్కడలుళ్ నానిలాద మున్నెలామ్,
అఱ్పుదన్ అనన్దశయన్ ఆతి పూతన్ మాతవన్,
నిఱ్పదుమ్ ఇరుప్పదుమ్ కిడప్పదుమ్ ఎన్నెఞ్జుళే 65వ పా

జ్ఞానశక్త్యాదులచే ఆశ్చర్యభూతుడు, ఆదిశేషునిపై శయనించి ఉన్నవాడు, జగత్కారణభూతుడు, శ్రియఃపతి అయిన స్వామి అద్వితీయం అయిన వేంకటాద్రిలో నిలచినది, పరమాకాశం అయిన పరమపదంలో వేంచేసి ఉన్నది. చక్కని పెద్ద అలలను కల క్షీరాబ్ధిలో పరుండి ఉన్నది - నేను సంబంధజ్ఞానం లేనివాడనై, అసత్కల్పుణ్ణిగా ఉన్నపుడు మాత్రమే. ఇపుడు స్వామి నిలచి ఉండడం, కూర్చుని ఉండడం, పరుండి ఉండడం అంతా నా హృదయంలోనే. అతినీచుణ్ణి అయిన నన్ను అనుగ్రహించగానే తిరుమలలో నిలచి ఉండడం మాని నా మనస్సులో ఉన్నాడు. తన శ్రీపాదాలలోని భోగ్యతను నాకు తెలిపిన తర్వాత పరమపదంలో స్థితిమారి నా మనస్సు స్వామికి భోగస్థానం అయింది. **“తాపార్తో జలశాయినమ్”** అన్నట్లు క్షీరాబ్ధిలో శయనించిన రీతిని దర్శింప జేసి నా సాంసారికతాపాన్ని తీర్చిన తర్వాత పాల సముద్రంలో స్థితి మారి నా మనస్సులో శయనించి తన తాపాన్ని తీర్చుకున్నాడు. ఈ విధంగా నాపట్ల చూపిన స్వామి వ్యామోహం నేను మఱువరానిది.

**56. అవ :** “ఆశ్రితవిరోధులను నిర్మూలించి, ఆశ్రితులను సంరక్షించడమే పరమ ధర్మంగా భావించి, విజయశీలియై తిరుమలలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వరుని దివ్యపాదారవిందాలనే ప్రతిదినం ఆశ్రయించి, ఉజ్జీవించండి- అని పరమకృపతో ఆఴ్వార్లు సంసారులను ఉద్దేశించి అనుగ్రహిస్తున్నారు.

కడైన్దు పాఱ్కడల్ కిడన్దు కాలనేమియై క్కడిన్దు,
ఉడైన్ద వాలితన్తనక్కు ఉదవ వన్దు ఇరామనాయ్,
మిడైన్ద ఏఴ్ మరఙ్గళుమ్ అడఙ్గ వెయ్దు, వేఙ్గడమ్
అడైన్ద మాలపాదమే అడైన్దు నాళుమ్ ఉయ్మ్మినో 81వ పా.

పూర్వం ఐశ్వర్యగర్వంతో ఇంద్రుడు దూర్వాసమహర్షిని అవమానించినపుడు, ఆ ఋషి ఇంద్రుని ఐశ్వర్యమంతా నశిస్తుందని, రాక్షసులవల్ల అవమానం



కల్గుతుందని శపించాడు. ఆ శాపప్రభావంవల్ల ఇంద్రుడు సమస్తైశ్వర్యాన్ని కోల్పోయి, శక్తిహీనుడై శ్రీమన్నారాయణుని రక్షించమని ఆశ్రయించాడు. అపుడు స్వామి క్షీరాబ్ధిని చిలికి, ఇంద్రుడు కోల్పోయిన సంపదను అంతటినీ తిరిగి పొందేటట్లు అనుగ్రహించాడు. అంతేకాకుండా, ఇకపై ఎవరికైనా ఆపదలు కల్గితే వానిని నివారించడంకోసం యోగనిద్రలో పాలసముద్రంలోనే పవళించి ఉన్నాడు. దేవతలను బాధించిన కాలనేమి అనే క్రూరరాక్షసుణ్ణి సంహరించాడు. వాలి తమ్ముడైన సుగ్రీవుడు వికలమైన మనస్సుతో తనను ఆశ్రయించగా, శ్రీరామచంద్రమూర్తియై, ఒకటిగా చేరి ఉన్న ఏడు మద్ది చెట్లను, గిరిరసాతలాలతోకూడ భేదించి, అతణ్ణి రక్షించాడు. ఈ విధంగా ఆశ్రితసులభుడైన స్వామి అన్ని దేశాలలో ఉన్నవారు అందఱూ అన్ని సమయాలలో వచ్చి తనను సేవించి, తరించాలనే ఉద్దేశ్యంతో వేంకటాచలంలో వేంచేసి ఉన్నాడు. ఇటువంటి ఆశ్రిత వ్యాముగ్ధుని శ్రీపాదాలనే అనన్యప్రయోజనంగా ఆశ్రయించి, సదా ఉజ్జీవించండి.

ఈ పాశురం సురటరాగం, - త్రిపుటతాళంలో రచింపబడింది.

# నమ్మాఴ్వార్లు

వృషభే తు విశాఖాయాం కురుకాపురి కారిజమ్ ।
పాండ్యదేశే కలే రాదౌ శఠారిం సైన్యపం భజే ॥

నమ్మాఴ్వార్లు అందరు ఆఴ్వార్లలో ముఖ్యులు కనుక అంగి అని, మిగిలిన ఆఴ్వార్లు వీరికి అంగభూతులని సంప్రదాయంలో ప్రసిద్ధి. శ్రీవైష్ణవసంప్రదాయంలో ప్రపన్నజన కూటస్థులుగా కీర్తింపబడే వీరు కలియుగం ప్రారంభం అయిన 43వ దినంలో ప్రమాది నామసంవత్సరం -వైశాఖ శుద్ధ చతుర్దశి- శుక్రవారం- విశాఖా నక్షత్రంలో విష్వక్సేనుల అంశతో ద్రావిడదేశానికి చెందిన తిరుక్కురుకూర్‌లో చతుర్థ వర్ణానికి చెందిన ఉడైయనఙ్గై, కారిమార్ దంపతులకు అవతరించారు. పుట్టిన మఱుక్షణంనుండి లోకరీతిలో స్తన్యపానాదులను చేయకుండా, భగవద్గుణానుభవాన్నే **“ఉణ్ణుమ్ శోఱు పరుకు నీర్ తిన్నుమ్ వెఱ్ఱిలైయుమ్ ఎల్లామ్ కణ్ణన్”** (తినే అన్నం, తాగే నీరు, అనుభవించే తాంబూలాది బోగ్యపదార్థాలు అన్నీ శ్రీకృష్ణుడు) అనే రీతిలో ధారక-పోషక-భోగ్యాలుగా కలవారై, యోగంలోనే 16 సంవత్సరాలపాటు

ఉండి పోయారు. ఆదిశేషుడు వీరు జన్మించిన ఊరిలో చింతచెట్టుగా అవతరించగా, ఆ చెట్టుకిందనే నమ్మాళ్వార్లు యోగంలో ఉన్నారు. ఆ సమయంలోనే మధురకవులు అనే మహనీయులు ఉత్తరదేశయాత్ర చేస్తూ అయోధ్యలో ఉన్నపుడు ఒకనాటి రాత్రి దక్షిణ దిక్కులో ఒక దివ్యతేజస్సును చూచారు. దానినిగూర్చి తెలిసికోవాలని వెదుకుతూ వారు చివరకు తిరుక్కురుకూర్‌ను చేరారు. తాము చూచిన తేజస్సు ఆ ఊరిలో చింతచెట్టుకింద ఉండే నమ్మాళ్వార్లే అని గుర్తించి, వారితో మాటలాడాలని చాలా కాలం వేచి చూచారు. ఎప్పటికీ ఆళ్వార్లు కళ్ళు తెరవనందు వల్ల మధురకవులు పెద్ద రాతిని ఎత్తి కింద పడవేయగా, ఆ శబ్దానికి నమ్మాళ్వార్లు కళ్ళు తెరిచి చూచారు. అపుడు మధుర కవులు"ప్రకృతిలో జన్మించిన జీవుడు దేనిని తిని, దేనిలో ఉంటాడు?'' అని ఆళ్వార్లను ప్రశ్నించగా, "దానినే తిని దానిలోనే ఉంటాడు'' అని ఆళ్వార్లు బదులిచ్చారు. అపుడు మధురకవులు ఆళ్వార్లప్రభావం అసాధారణం అని గుర్తించి, వారికి శిష్యులయ్యారు. నమ్మాళ్వార్లు అనుగ్రహించిన **"తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, పెరియతిరువన్దాది, తిరువాయ్‌మొழி"** అనే నాల్గు ప్రబంధాలు నాల్గు వేదాల సారాలుగా ప్రసిద్ధిచెందాయి. కొంతకాలానికి ద్రావిడవేదం అంతరించి పోయినపుడు, తమనుగూర్చిన కణ్ణినుణ్ శిఱుత్తాంబు ప్రబంధాన్ని నాథమునులు 12వేల సార్లు జపించినపుడు వారికి కలలో సాక్షాత్కరించి, నాలాయిర ప్రబంధాన్ని అనుగ్రహించినది నమ్మాళ్వార్లే. వీరి మహిమ వాచామగోచరం. నమ్మాళ్వార్లకు ఆచార్యులు విష్వక్సేనులు.

## తిరువాయ్‌మొழி

**57. అవ :** ప్రపన్నజనకూటస్థులైన నమ్మాళ్వార్లు ఉత్తరతిరుమల అయిన వేంకటా చలంలో వేంచేసి ఉండే వేంకటేశ్వరస్వామిని సేవించి, ఆ స్వామియొక్క అంతు లేని సౌందర్యంలో, సంపదలో అభినిష్టులై, ఆ స్వామిని ఇక్కడే ఈ లీలావిభూతిలోనే అనుభవించాలని ఆశపడి, తమకు సహాయంగా తమ మనస్సును, భగవద్భక్తులను ఇందులో ఆహ్వానిస్తున్నారు. తిరువాయ్‌మొழி ప్రబంధంలో మూడవ శతకంలోని మూడవ దశకం ఇది. ఈ దశకంలో ద్వయమంత్రం ఉత్తరఖండార్థం అయిన కైంకర్య ప్రార్థన అనుసంధింపబడిందని పూర్వాచార్యహృదయం.

---

**ఒழிవిల్ కాలమెల్లామ్ ఉడనాయ్ మన్ని,**
**వழுవిలా అడిమై శెయ్యవేణ్డుమ్ నామ్,**
**తెழிకురలరువి త్తిరువేఙ్గడత్తు,**
**ఎழிల్‌కొళ్ శోది ఎన్దైతన్దై తన్దైక్కే** 3-3-1

గలగలమని ప్రవహించే సెలయేళ్ళను కల వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడు, గొప్ప అందమైన దివ్యతిరుమేనిని కలవాడు, నా స్వామికి స్వామి అయినవాడు అయిన వేంకటేశ్వరునకు మనం సర్వదేశ - సర్వకాల - సర్వావస్థలలోను అన్నివిధాలైన కైంకర్యాలను చేయాలి. తిరుమలకు రండి.

ఈ దశకంలోని పాశురాలు సౌరాష్ట్రరాగంలో - ఆటతాళంలో ఉన్నాయి.

**58. అవ :** "పరమపదానికి పోయి, అక్కడ స్వామికి కైంకర్యాన్ని చేయడమేకదా అందటికీ ప్రాప్యం! మీరు ఇక్కడే ఆ కైంకర్యాన్ని చేయాలని మమ్ములను ఆహ్వా నిస్తున్నారే!'' అని కొందఱు అడుగగా, "నిత్యసూరులు సైతం తిరుమలకు వచ్చికదా అతని గుణాలను అనుభవించి, అతనికి కైంకర్యం చేస్తున్నారు. అందువల్ల మనకుకూడా ఇదే ప్రాప్యం - అని అంటున్నారు.

**ఎన్దై తన్దై తన్దై తన్దై తన్దైక్కుమ్**
**మున్దై, వానవర్ వానవర్ కోనొడుమ్,**
**శిన్దు పూ మగిழுమ్ తిరువేఙ్గడత్తు,**
**అన్దమిల్ పుగழ் క్కారెழிల్ అణ్ణలే** 3-3-2

అంతు లేని కీర్తిని కలవాడై, సౌందర్యాన్ని కలవాడై, నల్లని మేఘంలా వెలిగేవాడై, వేంకటాచలంలో వేంచేసి ఉండే నా తండ్రికి తండ్రికి తండ్రి అయిన నా స్వామి తన కల్యాణగుణాలతో నన్ను తన దాసులకు దాసునిగా చేశాడు. నిత్యసూరులు, వారికి నాయకుడైన విష్వక్సేనుడు నావలె ఆ స్వామి కల్యాణగుణాలలో అభినిష్టులై, తిరుమలకు వచ్చి, పూలతో అతనిని ఆరాధిస్తున్నారు. అందువల్ల అతనికి కైంకర్యం చేయడమే ప్రాప్యం. అందుకోసం మీరంతా తిరుమలకు రండి.

"ఎన్దై.... మున్దై" - "ఎన్దై తన్దై తన్దై .... తొడఙ్గి" అనే పల్లాణ్డుసూక్తి భావం, **"త్వద్భృత్య .... భృత్య", "య స్సప్తపర్వవ్యవధానతుఙ్గామ్"** ఇత్యాది పూర్వాచార్యుల సూక్తుల భావం స్మరణీయం.

**59. అవ :** మనం అనుభవించేటట్లుగా సర్వేశ్వరుడు సులభుడు అవుతాడా ? అని అంటే, అతడు చాలా గొప్ప ఉదారుడు. తనను నిత్యసూరులు సదా అనుభవించేటట్లు అనుగ్రహించలేదా! అని అంటున్నారు.

అణ్ణల్ మాయన్ అణికొళ్ శెన్దామరై
క్కణ్ణన్, శెఙ్గనివాయ్ క్కరుమాణిక్కమ్,
తెణ్ణిఱై చ్చునై నీర్ త్తిరువేఙ్గడత్తు,
ఎణ్ణిల్ తొల్ పుకழ் వానవరీశనే 3-3-3

సౌందర్యసౌకుమార్యలావణ్యాది దివ్యమంగళవిగ్రహగుణాలతో ఆశ్చర్య భూతుడు, స్వతస్సిద్ధమైన అలంకారాన్ని కల్గిన ఎఱ్ఱని తామరలవంటి కన్నులను, దొండపండువంటి ఎఱ్ఱని అధరాన్ని, ఇంద్రనీలమణివలె మెఱిసే దివ్యతిరుమేనిని కలవాడు, అసంఖ్యాకాలైన సహజకల్యాణగుణాలవల్ల కల్గిన కీర్తిని కలవాడు అయిన సర్వస్వామి, నిత్యసూరినాథుడే స్వచ్ఛమైన, నిండుగా ఉండే సెలయేళ్ళను కల్గిన వేంకటాచలంలో వేంచేసి ఉన్నాడు. ఆయన తనను అందఱు సేవించే రీతిలో సర్వస్వదానాన్ని చేస్తున్నాడు. అందువల్ల ఆయనను మనం అనుభవించవచ్చు; రండి.

**60. అవ :** స్వామి తనను నిత్యసూరులు అనుభవించే రీతిలో వేంచేసి ఉన్నాడని చెప్పాలా!, చాలా నీచుణ్ణి అయిన నాకు తనను అనుగ్రహించాడుకదా!- అనిఅంటూ ఆழ்వార్లు ఇందులో భగవానుని ఔదార్యాతిశయాన్ని కింపునర్న్యాయంలో పొగడు తున్నారు.

**ఈశన్? వానవర్క్కు ఎన్బన్ ఎన్ఱాల్, అదు**
**తేశమో తిరువేఙ్గడత్తానుక్కు,**
**నీశనేన్ నిఱై వొన్ఱు మిలేన్, ఎన్ కణ్**
**పాశమ్ వైత్త పరఞ్జుడర్ చ్చోదిక్కే 3-3-4**

(అన్ని దుర్గుణాలను కల్గినవాడను కనుక) నీచుడను, ఆత్మగుణాలు ఏమాత్రం లేనివాడను అయిన నా విషయంలోకూడా సర్వేశ్వరుడు వాత్సల్యాన్ని చూపిస్తూ గొప్పగా వెలిగే జ్యోతిగా ప్రకాశిస్తున్నాడు. ఇటువంటి ఔదార్యాన్ని కల్గిన స్వామిని - "నిత్యసూరు లకు తన అనుభవాన్ని అనుగ్రహిస్తున్నాడు" అని పొగడితే ఆ పొగడ్తవల్ల అతిశయం ఏ మాత్రం స్వామికి కలుగదుకదా!

**"ఎన్కణ్ పాశమ్ వైత్త పరమ్శుడర్ శోది"**- ఇచటి పాశశబ్దం వాత్సల్యగుణాన్ని తెలుపుతుంది. **"నీశనేన్"** -దేహాత్మభ్రాంతి, అన్యశేషత్వభ్రాంతి - ఇత్యాదిదోషాలను కలవాడను, **"నిఱై వొన్ఱుమిలేన్"** - ప్రేమ, అద్వేష అసూయారాహిత్యాది ఆత్మగుణా లను వేనినీ లేనివాడను- అని భావం.



**61. అవ :** "నీచుడనైన నాకు తనను అనుభవించే భాగ్యాన్ని కల్గించిన ఉదారుడు" అని కీర్తించడంకూడా అతనికొక గొప్పను కల్గిస్తుందా ? అతని ఔదార్యం ఇంతటిది అని వర్ణించి చెప్పలేము కదా!" అని ఇందులో అంటున్నారు.

**శోది యాగి ఎల్లా ఉలకుమ్ తొழுమ్**
**ఆదిమూర్తి యెన్ఱాల్ అళవాగుమో?,**
**వేదియర్ ముழுవేదత్తు అముదత్తై,**
**తీదిల్ శీర్ త్తిరువేఙ్గడత్తానైయే 3-3-5**

"వేంకటేశ్వరస్వామి చాలా అధముణ్ణి అయిన నాపట్ల స్నేహాన్ని కల్గి ఉన్నాడు"- అని అన్నాను. ఈ విధంగా అనడం స్వామికి ఒక అతిశయాన్ని కల్గిస్తుందా? "వేదాధ్యయనశీలురచేత సమస్తవేదప్రతిపాద్యుడుగా చెప్పబడేవాడు, అఖిహేయ ప్రత్య నీకుడు, సకలకల్యాణగుణైకతానుడు" అని, "ఆ స్వామి తిరుమేని సౌందర్యానికి అంతు లేదు అని, అతడు లోకాలను సృష్టించినవాడు"- అని ఈ రీతిలో అతని గొప్పతనాలను వేదంకదా కీర్తించాలి. నీచుడనైన నేను కీర్తించగలనా? పరమోదారుడైన అతడు తన శ్రీచరణాలలో కైంకర్యాన్ని చేయడం అనే సంపదను మీకిచ్చి అనుగ్ర హిస్తాడు.

**"తీదిల్"** - ఆశ్రితులలో దోషాలను, గుణరాహిత్యాన్ని, తారతమ్యాన్ని లెక్కించడం వంటివే ఇచటి దోషాలు (తీదు). అవి లేనివాడు స్వామి

**62. అవ :** "భగవానునకు కైంకర్యం చేయాలి అని అంటే ఏది ఉపాయం?" అనే ప్రశ్నకు సమాధానాన్ని ఇందులో చెబుతున్నారు.

**వేఙ్గడఙ్గళ్ మెయ్మ్మేల్ వినై ముఱ్ఱవుమ్,**
**తాఙ్గళ్ తఙ్గట్కు నల్లనవే శెయ్వార్,**
**వేఙ్గడత్తుఱైవార్క్కు నమవెన్నల్**
**ఆఙ్గడమై, అదు శుమన్దార్కట్కే 3-3-6**

భగవానునకు ఏ ఆటంకం లేకుండా కైంకర్యాన్ని చేసే ఉపాయం ఏది? అని అంటే, శ్రీవేంకటాచలంలో నెలకొని ఉండే శ్రీనివాసునకు **"నమః"** అని అనడమే. ఇది పరమసులభం అయిన ఉపాయం. దీనిని అందఱూ అనుష్ఠించవచ్చు. ఇది మన స్వరూపానుగుణంకూడా. ఈ నమోవాకాన్ని పల్కితే, ఏ తావన్మాత్రంతోనే సర్వేశ్వరుడు గొప్పగా భావించి, మన ప్రాక్తనకర్మలను, ఆగామి కర్మలను సమూలంగా నశింపజేస్తాడు. ఇది తథ్యం.

**63. అవ :** ఈ ఉత్తమలాభాన్ని పొందడంకోసం వేంకటేశ్వరుణ్ణి ఆశ్రయించాలా? వేంకటాచలమే ఈ ఫలాన్ని మనకు ఇవ్వగలదుకదా ! అని ఇందులో అంటున్నారు.

**శుమన్దు మామలర్ నీర్ శుడర్ తూపమ్ కొణ్డు,**
**అమరన్దు వానవర్ వానవర్కోనొడుమ్,**
**నమస్తెఴుమ్ తిరువేఙ్గడమ్ నఙ్గట్కు,**
**శమన్గొళ్ వీడు తరుమ్ తడమ్ కున్ఱమే** **3-3-7**

శ్రీవేంకటాచలం స్వామి శ్రీపాదాలను మోస్తూ, అతడు సలక్ష్మీకుడై యథేచ్ఛంగా లీలారసాన్ని అనుభవించేటట్లు చేస్తున్నది. ఆ పర్వతమే మన మనోరథాలను ఈడేరుస్తుంది. "ఈ విషయం ఏ విధంగా తెలుస్తున్నది?'' అని అంటే, నిత్య సూరులు, వారికి నాయకుడు అయిన శ్రీవిష్వక్సేనులు స్వామి ఆరాధనకు తగిన, పరిశుద్ధమైన సామగ్రిని - చక్కని పూలను, పరిశుద్ధమైన జలాన్ని, దివ్యదీప ధూపాదులను సమకూర్చు కొని, భగవత్కైంకర్యమే పరమప్రయోజనంగా భావించి, శ్రీవేంకటాచలానికి వచ్చి స్వామిని సేవించి, ఆ స్వామికి అశేషమైన శేషవృత్తిని చేసి మహానందభరితులు అవుతున్నారు కదా! కాబట్టి మనకుకూడా ఈ భాగ్యాన్ని వేంకటాచలమే అనుగ్రహిస్తుంది.

**64. అవ :** భగవానునకు శ్రీవేంకటాద్రి చాలా ప్రీతిపాత్రం అయినది, ప్రాప్యమైనది కదా! మనకు అది వేఱొక ప్రయోజనాన్ని ఇవ్వాలా? ఆ పర్వతమే మనకు పరమప్రాప్యం కదా! - అని ఇందులో అంటున్నారు.

**కున్ఱ మేన్ది కుళిర్మఴై కాత్తవన్,**
**అన్ఱు ఞాలమ్ అళన్ద పిరాన్, పరన్**
**శెన్ఱు శేర్ తిరువేఙ్గడమామలై,**
**ఒన్ఱుమే తొఴ నమ్ వినై ఓయుమే** **3-3-8**

శ్రియఃపతి తన దివ్యస్వరూపస్వభావాదులతో, కల్యాణగుణాలతో, శ్రీకృష్ణుడై గోకులసంరక్షణం చేయడం, త్రివిక్రమరూపుడై లోకాలను కొలిచి రక్షించడం మొదలైన అపదానాలతో ఇతరులకు ఆనందాన్ని కలుగజేస్తున్నాడు. ఆ స్వామి పరమపదాన్ని విడచి, ఎంతో ఆదరంతో తిరుమలలో నిత్యనివాసం చేస్తున్నాడు. ఇటువంటి తిరుమలే మనకు ప్రాప్యం. వేఱొక ఫలాన్ని దానివల్ల మనం ఆశించవలసిన అవసరం లేదు. ఆ తిరుమలకు నమస్కరిస్తే చాలు. మన బాధలన్నీ తమంతట తామే తీరిపోతాయి.



ఈ పాశురంలో, "కున్ఱ మేన్ది కుళిర్మఴై కాత్తవన్" అని, తరువాతి పాశురంలో "ఆయన్" ప్రయోగించినందువల్ల తిరుమలలో స్వామి గోవింద నామంతో ప్రసిద్ధుడు.

**65. అవ :** శ్రీవేంకటేశ్వరుడేకదా మనకు ప్రాప్యుడు! తిరుమల ఏ రీతిలో మనకు ప్రాప్యం? అని ప్రశ్నిస్తే, దానికి సమాధానాన్ని ఇందులో పల్కుతున్నారు.

**ఓయుమ్ మూప్పు ప్పిఱప్పు ఇఱప్పు, ప్పిణి**
**వీయు మాఱు శెయ్వాన్ తిరువేఙ్గడత్తు**
**ఆయన్, నాళ్ మలరామ్ అడిత్తామరై,**
**వాయుళ్ళుమ్ మనత్తుళ్ళుమ్ వైప్పార్కట్కే** **3-3-9**

తిరుమలలో వేంచేసి ఉండే గోపాలమూర్తి అయిన స్వామి తన పాదారవిందా లను సదా వాఙ్మనస్సులతో కీర్తించి, ధ్యానించేవారికి సంసారంలోని సకలబాధలను, వార్ధక్యాన్ని, పుట్టుకను, చావును, వ్యాధులను లేకుండా చేస్తాడు. ఇటువంటి మహిమ స్వామికి తిరుమల సంబంధంవల్లనే కల్గింది. అందువల్ల మనకు ఈ తిరుమల పరమప్రాప్యం అనడంలో అడ్డు లేదు.

**"తిరువేఙ్గడత్తు ఆయన్"** - అనే ప్రయోగంవల్ల తిరుమల సంబంధంవల్లనే స్వామికి వైభవం సిద్ధించిందనే విశేషార్థం స్ఫురిస్తుంది.

**66. అవ :** "ఇంతవరకు నిరూపించిన కారణాలనుబట్టి, పరమప్రాప్యం, భోగ్యం అయిన తిరుమలకు పోయి, దానిని సేవించండి''- అని ఇందులో ఆఴ్వార్లు అంటున్నారు.

**వైత్తనాళ్వరై ఎల్లై కుఱుగి చ్చెన్ఱు,**
**ఎయ్త్తిళైప్పదన్ మున్నమ్ అడైమినో,**
**పైత్తపామ్బణైయాన్ తిరువేఙ్గడమ్,**
**మొయ్త్త శోలై మొయ్పూమ్తడమ్ తాఴ్వరే** **3-3-10**

భగవానుని దివ్యదేహస్పర్శవల్ల పొందిన సుఖంచేత వికసించిన పడగలను కల్గిన ఆదిశేషుని పడుకగా కల భగవానుని వేంకటాచలంలో అంతటా దట్టమైన ఉద్యాన వనాలతో నిండినది, చక్కగా పూచిన పూలతో అందమైనది, విశాలమైనది అయిన చరియను, ఇంతకాలం జీవించాలని భగవంతునిచేత నిర్ణయింపబడ్డ మీ ఆయుఃకాలం సమాప్తి అయి, వార్ధక్యం కారణంగా మనోవ్యాధిని మీరు పొందడానికి ముందు గానే శీఘ్రంగా చేరి ఆశ్రయించండి.

**67. అవ :** చివరగా ఈ దశకాన్ని అభ్యసించినవారికి కలిగే ఫలాన్ని ఈ పాశురంలో తెలిపి, దశకాన్ని ముగిస్తున్నారు.

**తాళ్ పరప్పి మణ్ తావియ ఈశనై,**
**నీళ్పొழிల్ కురుకూర్ చ్చడకోపన్ శొల్,**
**కేழிలాయిరత్తు ఇప్పత్తుమ్ వల్లవర్,**
**వాழ்వర్ వాழ் వెయ్ది ఞాలమ్ పుగழவే 3-3-11**

జీవులందఱు సేవించి, అనుభవించేటట్లు తన శ్రీపాదాలను చాచి, భూమిని కొలిచిన సర్వేశ్వరుణ్ణిగూర్చి వ్యాపించి ఉండే తోటలను కల కురుకూర్‌లోని ఆழ்వార్లు అనుగ్రహించిన, ఏలోటు లేని వేయి పాశురాలలోని ఈ పది పాశురాలను (దశకాన్ని) చక్కగా తెలిసికొన్నవారు, వారిని అందఱు స్తుతించేటట్లుగా అన్నిటికంటె గొప్పదైన తిరుమల నివాసం అనే మహాసంపదను పొంది, సుఖంగా ఉజ్జీవిస్తారు.

ఈ దశక సారాన్ని వివరించే శ్రీదేశికుల
ద్రవిడోపనిషత్తాత్పర్య రత్నావళి లోని శ్లోకం

**స్థానోత్కర్షాత్సుదీప్తం శ్రమహరవపుషం స్వాంగపర్యాప్తభూషమ్**
**తేజిష్ఠం నీచయోగాత్ ప్రణమితభువనం పావనం సన్నతానామ్ ।**
**ప్రాప్త్యర్హస్థాన మంహః ప్రశమనవిషయం బంధవిచ్ఛేదిపాదమ్**
**భేజే శీఘ్రాభియానక్షమశుభవసతిం లమ్బితార్చాభిముఖ్యమ్ ॥**

భగవానుడు వేంకటాచలంలో వేంచేసి ఉండడంవల్ల నిరవధిక తేజస్సును కలవాడని, కాలమేఘంవలె ఆశ్రితుల తాపాన్ని తీర్చే దివ్యరూపాన్ని కలవాడని, **"ఆభరణస్యా భరణమ్"** అన్నట్లుగా అలంకారాలు అనదగిన దివ్యావయవాలను కలవాడని, అతి నీచులైన వారితోకూడా సంశ్లేషించడం అనే వాత్సల్యగుణంతో నిరవధిక తేజోవంతుడని, సకలలోకాలు కొలిచే పాదపద్మాలను కలవాడని, భక్తుల విరోధులను నిరసించి, వారిని పరిశుద్ధులను చేసేవాడని, సకలచేతనులు ఆశ్రయించ దగిన దేశంలో ఉన్నవాడని, తాను నివసించే దేశాన్ని ఆశ్రయించేవారి పాపాలను తీర్చేవాడని, తన శ్రీపాదపద్మాలతో ఆశ్రితుల జన్మమరణాదివ్యాధులను పోగొట్టే వాడని, వెంటనే ఆశ్రయించదగినట్లుండే వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడని- ఈవిధంగా పది పాశురాలలో వేంకటేశ్వరుని పది కల్యాణగుణాలను ఆழ்వార్లు అనుసంధించారు.



అழகియమణవాళచ్చీయర్ - ద్రవిడోపనిషత్‌సంగతిలోని
ఈ దశకార్థాన్ని తెలిపే శ్లోకం.

సర్వత్ర సర్వసమయే సకలాస్వవస్థా-
స్వభ్యర్థయ న్నిఖిలదాస్యరసాన్ మునీన్ద్రః ।
శ్రీవేంకటాద్రినిలయస్య పరస్య పుంసః
నిస్సీమశీలగుణమప్యవద త్తృతీయే ॥

సర్వదేశ సర్వకాల సర్వావస్థలలోను సకలవిధ కైంకర్యాలను యాచించిన ఆழ்వార్లు వేంకటాచలవాసియైన పరమపురుషుని నిరవధిక కల్యాణ గుణాలను మూడవ దశకంలో అనుసంధించారు.

శ్రీమణవాళమహామునుల - తిరువాయ్‌మొழிనూఱ్ఱన్దాదిలోని
ఈ దశకార్థాన్ని తెలిపే పాశురం

**ఒழிవిలా క్కాల ముడనాగి మన్ని,**
**వழுవిలా ఆట్చెయ్య మాలుక్కు, - ఎழு శికర**
**వేఙ్గడత్తు ప్పారిత్త మిక్క నలమ్ శేర్ మాఱన్,**
**పూఙ్కழలై నెఞ్జే! పుగழ் 23వ.పా**

తిరుమలలో సర్వదేశ - సర్వకాల - సర్వావస్థలలో భగవానునకు అన్ని విధాల కైంకర్యాలను చేయాలని ఆశపడినవారు, అత్యంతభక్తిని కలవారైన ఆழ்వార్ల పుష్పహాస సుకుమారమైన శ్రీపాదాలను ఓమనసా! నీవు సదా స్తుతించి తరించు.

**68. అవ:** "నిఖిలజగద్రక్షణార్థం తిరుమలలో నిత్యసన్నిహితుడవై వేంచేసి ఉండే నిన్ను సహజంగా శేషభూతుణ్ణి అయిన నేను చేరి ఆశ్రయించే ఉపాయాన్ని నీవే నాకు అనుగ్రహించు'' అని ఆழ்వార్లు ప్రార్థిస్తున్నారు. ఈ దశకంలో ద్వయంలోని పూర్వ ఖండార్థం అయిన శరణాగతి అనుసంధింపబడిందని పూర్వాచార్యుల అభిప్రాయం.

**ఉలగ ముణ్డ పెరువాయా! ఉలప్పిల్ కీర్తి అమ్మానే,**
**నిలవుమ్ శుడర్ శూழொళి మూర్త్తి! నెడియాయ్! అడియేన్ ఆరుయిరే!**
**తిలద ములగుక్కాయ్ నిన్ఱ తిరువేఙ్గడత్తు ఎమ్బెరుమానే!,**
**కులతొల్ అడియేన్ ఉనపాదమ్ కూడు మాఱు కూఱాయే 6-10-1**

స్వామీ! ప్రళయకాలంలో లోకాలు అన్నీ నశించకుండా వాటిని నీ ఉదరంలో ఉంచుకొని భద్రంగా రక్షించావు. అంతు లేని వాత్సల్యం, స్వామిత్వం, కారుణ్యం

మొదలైన దివ్యకల్యాణగుణాలను కలవాడవై ఉన్నావు. నీవు జగత్స్వామివి. అత్యంతం ప్రకాశించే కాంతితో లోకాలను అన్నిటినీ వ్యాపించి ఉండే తేజోమూర్తివి. దాసునకు ప్రాణభూతుడవు. వైకుంఠం అనే ఉన్నత లోకంలో ఉండేవాడవు. లోకాలకు అన్నిటికీ తిలకంవలె అలంకారంగా ఉండే వేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామివి. "అనాదిగా వంశపారంపర్యంగా నేను నీకు దాసుడను'' అనే శేష శేషి క్రమాన్ని నాకు తెలియజేసిన వాడవు. ఇటువంటి నిన్ను వీడి ఇక క్షణకాలంకూడా ఉండలేనయ్యా! నీ శ్రీపాదాలను నేను చేరే దారిని కృపతో నాకు అనుగ్రహించు.

ఈ దశకంలో ద్వయమంత్రంలోని పూర్వార్థం అనుసంధింపబడింది. **"కూడు మాఱు కూఱాయే"** - అర్జునుని శోకాన్ని చరమశ్లోకాన్ని ప్రసాదించి పోగొట్టినట్లే నా దుఃఖాన్నికూడా అటువంటి సూక్తితో పరిహరించు - అని ఈ సూక్తిలో ఆళ్వార్ల హృదయం.

**69. అవ :** "నన్ను మీరు చేరడానికి మీ ప్రబలపాపాలు ఆటంకాలుగా ఉన్నాయే! వాటిని లేకుండా చేసికొంటేకదా నేను నా దగ్గరకు రానివ్వగలను!'' అని భగవానుని అభిప్రాయంగా భావించి, దానికి సమాధానాన్ని ఆళ్వార్లు ఇందులో పల్కుతున్నారు.

**కూఱాయ్ నీఱాయ్ నిలనాగి క్కొడువల్లశురర్ కులమెల్లామ్,**
**శీఱా ఎఱియుమ్ తిరునేమివలవా! తెయ్వక్కోమానే!,**
**శేఱార్ శునైత్తామరై శెన్దీ మలరుమ్ తిరువేఙ్గడత్తానే!,**
**ఆఱా అన్బిల్ అడియేన్ ఉన్నడి శేర్ వణ్ణమ్ అరుళాయే 6-10-2**

క్రూరులు, మిక్కిలి బలవంతులు అయిన అసురవర్గాలను నీ సుదర్శన చక్రాయుధంతో ఖండించి, బూడిద చేసి, వారున్న చోటుకూడా తెలియకుండా ఉండేటట్లు నశింపజేశావుకదా! ఆ విధంగా చేసిన తర్వాతకూడా కోపం ఉపశమించకుండా సర్పంవలె కోపంతో ఉండే చక్రాయుధాన్ని నీ కుడిచేతిలో ధరించి ఉన్నావు. ఈ విధంగా నిన్ను ఆశ్రయించిన దేవతల విరోధులను నీవే నిర్మూలించావే! నీ విషయంలో అపరిమితం అయిన ఆశను కల నా ప్రతిబంధకాలను కూడా నీవే పోగొట్టాలి కదా స్వామీ! పంకంతో నిండిన వాగుల్లో ఎఱ్ఱని అగ్నివలె ప్రకాశించే తామరపూలు వికసించే పరమరమణీయం అయిన శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామీ ! ఇంకా ఇంకా దినదిన ప్రవర్ధమానం అయ్యే నీ విషయంలోని ప్రేమ అనే సముద్రంలో మునిగి ఉండే దాసుడనైన నేను నీ శ్రీచరణాలను చేరే రీతిని నీవే కృపజేయాలి.



విశే : ఈదశకపాశురాలు నాదనామక్రియరాగంలో, ఆదితాళంలో కూర్చ బడ్డాయి.

**"శునై"** - కొండపై ఉండే చిన్న మడుగు. **"శేరార్ శునై త్తామరై శెన్దీ మలరుమ్"- "గంభీరాంభఃసముద్భూతసుమృష్టనాళ"** ఇత్యాది శ్రీరామానుజసూక్తి స్మరణీయం.

**70. అవ :** మీకు మోక్షాన్ని అనుగ్రహించాలని అంటున్నారే! ఏ కారణం లేకుండా దానిని ఇవ్వడానికి వీలు అవుతుందా! అని భగవానుడు భావించినట్లుగా తలచి ఆళ్వార్లు దానికి సమాధానాన్ని ఇందులో తెలుపుతున్నారు.

**వణ్ణ మరుళ్కొళ్ అణిమేగవణ్ణా! మాయ వమ్మానే!,**
**ఎణ్ణమ్ పుగున్దు తిత్తిక్కుమ్ అముదే! ఇమైయోరదిపతియే!,**
**తెణ్ణలరువి మణిపొన్ ముత్తలైక్కుమ్ తిరువేఙ్గడత్తానే!,**
**అణ్ణలే! ఉన్నడి శేర అడియేఱ్కావా వెన్నాయే 6-10-3**

స్వామీ! నీవు నిత్యసూరినాథుడవు. వారు నిన్ను చేరాలని ప్రయత్నించినా, వారికి అందకుండా, నీవుమాత్రం నీలమేఘంవంటి అత్యాశ్చర్యకరం అయిన దివ్యమంగళ విగ్రహంతో ఎంతో కృపతో నా మనస్సులో ప్రవేశించి, నాకు అమృతం వలె పరమభోగ్యుడవై ఉన్నావు. నీవు నాకు స్వామివి అని, నేను నీకు దాసభూతుడనని నాకు తెలియజేశావు. స్వచ్ఛమైన, అందమైన కొండవాగులు కెఱటాలతో రత్నాలను బంగారాన్ని, ముత్యాలను తీసికొని వచ్చి, తీరాలకు చేర్చే వేంకటాద్రిలో నీవు వేంచేసి ఉన్నావు. ఈ పనులను అన్నిటినీ నీవు నా విషయంలో ఉండే కృపవల్లనే కదా చేశావు. అ నిర్హేతుకం అయిన కృపతోనే ఎల్లప్పుడూ "అయ్యో! వీడు బాధపడు తున్నాడే!'' అనే భావనతో నాపైన జాలిపడి, నేను నీ శ్రీపాదాలను చేరేటట్లు అనుగ్రహించాలి.

**71. అవ :** ముందు తెల్పిన రీతిలో ఆళ్వార్లు ప్రార్థించగానే, "నేను మీ హృదయంలో ప్రవేశించినది మీరు చేసిన పుణ్యాన్ని వ్యాజంగా చేసికొని మాత్రమేసుమా! ఇపుడు మీరు అభిలషించేదానికికూడా. ఏదైనా ఒక వ్యాజం కావాలి సుమండీ!'' అని భగవానుడు తలచినట్లుగా భావించిన ఆళ్వార్లు అందుకు ప్రతివచనాన్ని ఇందులో పలుకుతున్నారు.

**ఆవా! ఎన్నాదు ఉలగత్తై యలైక్కు మశురర్ వాణాళ్మేల్,**
**తీవాయ్ వాళి మழை పొழிన్ద శిలైయా! తిరుమామగళ్ కేళ్వా!,**

తేవా! శురర్‌గళ్ మునిక్కణఙ్గళ్ విరుమ్బుమ్ తిరువేఙ్గడత్తానే!,
పూవార్ కழల్‌గళ్ అరువినైయేన్ పొరున్దు మాఱు పుణరాయే 6-10-4

ఏమాత్రం కరుణ లేకుండా అసురులు లోకాలను పీడించడం చూచి, సహించ లేక, ఆ అసురుల ప్రాణాలపై అగ్నిముఖాలైన బాణాలను, మేఘం వర్షాన్ని కురిసినట్లుగా, వర్షించి లోకాలను ఉపద్రవంనుండి రక్షించినవాడవు. ఆ విధంగా నీవు ఆ అసురులను జయించడాన్ని చూచినపుడు కల్గిన సంతోషాతిశయంచే సీతాదేవి **"బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే"** అన్నట్లు గాఢాలింగనం చేసికోగా దానివల్ల మిక్కిలిగా ప్రకాశించిన తిరుమేనిని కలవాడవు. నిత్యసూరులు, ఋషులు ఎంతో ఆశతో వచ్చి ఆశ్రయించే వేంకటాచలంలో వేంచేసి ఉన్నావు. ఇంతవరకు నీవు విధించిన ఉపాయాలు ఏవీ నాకు ఉపయోగపడవు. నన్ను రక్షించడానికి నీకొక వ్యాజం కావాలని అంటే, ఒక నూతనమైన ఉపాయాన్ని నీవే సృష్టించి, నిన్ను సేవించేవారు సమర్పించిన పుష్పాలతో నిండి ఉండే నీ శ్రీచరణాలలో నన్ను చేర్చి, లోకుల ఆర్తిని, అసురులను నాశనం చేసినట్లే, నా ఆర్తిని కూడా నశింపజేయవయ్యా!

**72. అవ :** "నేనేదో కొత్తగా ఉపాయాన్ని సృష్టిచేయాలని అంటున్నారే ! అది నావల్ల సాధ్యం అవుతుందా! ఏమి !" అని భగవానుని భావంగా తలచి, ఆழ్వార్లు అందుకు సమాధానాన్ని ఇందులో పల్కుతున్నారు.

పుణరా నిన్ఱ మరమేழ் అన్ఱెయ్‌ద ఒరువిల్ వలవా! ఓ!
పుణరేయ్ నిన్ఱ మర మిరణ్డిన్ నడువే పోన ముదల్‌వా! ఓ!
తిణరార్ మేగమెన క్కళిఱు శేరుమ్ తిరువేఙ్గడత్తానే!,
తిణరార్ శార్‌ఙ్గత్తు ఉనపాదమ్ శేర్వదడియేన్ ఎన్నాళే 6-10-5

స్వామీ! నీకు సాధ్యం కానిది అంటూ ఒకటి ఉంటుందా ! సుగ్రీవునకు నీ సామర్థ్యంలో అతిశంక కలుగగానే, అతనికి నమ్మకం కల్గడంకోసం, ఒక దానితో ఇంకొకటి ఒకటిగా చేరి, లక్ష్యంగా చేయడానికి వీలు కానట్లు, పర్వతాలవలె ఉన్నతంగా ఉండే ఏడు మద్దిచెట్లను, పర్వతాన్ని ఒకే బాణంతో తొలిచిన సాటి లేని మేటి వింటిని కల వీరుడవుకదా నీవు. శ్రీకృష్ణుడవై అవతరించి, ఒకటిగా దగ్గరగా చేరి ఉండే మద్దిచెట్ల నడుమ నీవు ఏ కష్టం లేకుండా దోగాడి యమళార్జునభంగాన్ని చేసినవాడవుకదా! పరమకృపతో లోకాలను అన్నిటినీ సృష్టించినవాడవుకదా! "ఇవి మేఘాలా! ఏమి!" అని సందేహపడే రీతిలో ఉండే పెద్ద పెద్ద ఏనుగులు, ఇంకా



అటువంటి వన్యప్రాణులు సంచరించే శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండేవాడా! నీ శ్రీపాదాలను నేను చేరే కాలం ఎపుడు వస్తుందోకదా! అయ్యో !

**73. అవ :** ఇంతవరకు భగవానుని శ్రీచరణాలను చేరాలని ఆழ్వార్లు వేడారు. అది ఎక్కడో ఈ పాశురంలో తెలియజేస్తున్నారు.

ఎన్నాళే నామ్ మణ్ణళన్ద ఇణై త్తామరైగళ్ కాణ్బదఱ్కెన్ఱు,
ఎన్నాళుమ్ నిన్ఱు ఇమైయోర్‌గళేత్తి ఇఱైఞ్జి ఇనమినమాయ్,
మెయ్‌న్నామనత్తాల్ వழిపాడు శెయ్యుమ్ తిరువేఙ్గడత్తానే!,
మెయ్‌న్నా నెయ్‌ది ఎన్నాళ్ ఉన్ అడిక్కళ్ అడియేన్ మేవువదే 6-10-6

నీ పరత్వాన్ని, (అందరికంటే అధికుడవుగా ఉండే నీ పరత్వాన్ని) ఎల్లప్పుడూ దర్శించే నిత్యసూరులు లోకాలను! కొలిన పాదద్వయిని కల నీ సౌశీల్యాన్ని (చాలా తక్కువ వారితో ఏతేడా లేకుండా కలిసి మెలసి ఉండే స్వభావాన్ని) ఎపుడు దర్శించగలమా! అనే ఆశతో తిరుమలకు గుంపులు గుంపులుగా వచ్చి నిత్యం నిన్ను స్తుతించి, నమస్కరించి, పూజా క్రియలతో లోకాలను కొలిచిన నీ శ్రీపాదాలకు వాఙ్మనఃకైంకర్యం చేస్తున్నారు. అందువల్ల ఇటువంటి ప్రదేశానికి నేను వచ్చి నిన్ను ఆశ్రయించి, నిరంతరం నీ శ్రీపాదాల్లో కైంకర్యం చేసేటట్లు అనుగ్రహించాలి. ఇపుడు మానసికంగా మాత్రమే అక్కడకు పోయిన భావన కల్గుతున్నది. ఇది యథార్థం అయేటట్లుగా చేయాలి. ఆ సమయం నాకు ఎపుడు వస్తుందోకదా!

**"ఎన్నాళే నామ్ మణ్ణళన్ద... వழిపాడు శెయ్యుమ్"** - వశిష్ఠ - ఛండాల తారతమ్యం లేకుండా అందరి శిరస్సులపై శ్రీపాదాలను ఉంచిన సౌశీల్యగుణం తిరుమలలో వేంకటేశ్వరునిలో ప్రకాశిస్తున్నందున, ఆ గుణానుభవంకోసం నిత్యసూరులు తిరుమలకు ఆశతో వస్తారు.

**74. అవ :** "మీకోసం ఒక కొత్త ఉపాయాన్ని సృష్టించాలని, ఆవిధంగా చేయడం నాకు సాధ్యమని అన్నారుకదా! అది సాధ్యమైనా, మీరు చెప్పినట్లు చేస్తే పక్షపాతం కలవాడననే దోషం నాకు కల్గుతుంది. అందువల్ల ఇంతవరకు నేను విధించిన వాటిలో ఏదో ఒక ఉపాయాన్ని అనుష్ఠించండి!" అని భగవానుడు చెప్పినట్లుగా భావించి ఆழ్వార్లు బదులు పలుకుతున్నారు.

అడియేన్ మేవి యమర్‌గిన్ఱ అముదే! ఇమైయోరదిపతియే!,
కొడియా వడు పుళ్ళుడైయానే! కోల క్కనివాయ్ ప్పెరుమానే!,

శెడియార్ వినైగళ్ తీర్ మరున్దే తిరువేజ్గడత్తు ఎమ్బెరుమానే!,
నొడియార్ పొళ్ళుదుమ్ ఉన పాదమ్ కాణనోలాదాన్ఱ్రేనే 6-10-7

పరమపదంలో నిత్యసూరులచేత పరివేష్ఠింపబడినవాడవైనా, ఆశ్రితవిరోధి నిరసనక్షముడైన గరుత్మంతునిపై ఎక్కి, నాకోసం వేంకటాచలానికి విచ్చేశావు. చెట్లు పెరిగే రీతిలో పైపైకి వృద్ధిచెందుతూ, నిన్ను పొందడానికి అడ్డుగా ఉండే నా పాపాలను, వ్యాధులను తీర్చే మందువలె, పోగొట్టావు. అందమైన, దొండపండువంటి నీ అధరాన్ని నాకు సాక్షాత్కరింపజేసి, ఇతరవిషయాల్లో నాకున్న ఆశను పోగొట్టి, నన్ను నీకు దాసునిగా చేసికొన్నావు. ఒక్కక్షణం నిన్ను విశ్లేషించినా సహించలేకుండా ఉండేటట్లు, నిన్ను అమృతంగా ఎల్లప్పుడూ మనసారా అనుభవించేటట్లు అనుగ్రహించావు. ఇన్ని ఉపకారాలను చేసిన నీవు ఈ ఉపకారాన్నికూడా చేయకూడదా! నిన్ను కన్నులారా సేవించే పుణ్యాన్ని నేను చేయకపోయినా, దీన్ని నీవు దయతో అనుగ్రహించకూడదా! ఇక ఒక్కక్షణం అయినా నిన్ను విడచి నేను ఉండలేను స్వామీ!

**75. అవ :** "మీరు చెప్పినట్లుగా నేను ఎవరికైనా చేశానా ! ఏమి ! చెప్పండి" అని భగవానుని భావనగా భావించి, అందుకు ఆళ్వార్లు ఇందులో బదులిస్తున్నారు.

నోలాదాన్ఱ్రేన్ ఉనపాదమ్ కాణ ఎన్ఱు నుణ్ణుణర్విన్,
నీలార్ కణ్డత్తమ్మానుమ్ నిఱైనాన్ముగను మిన్దిరనుమ్,
శేలేయ్ కణ్ణార్ పలర్ శూళ్ విరుమ్బుమ్ తిరువేజ్గడత్తానే,
మాలాయ్ మయక్కి అడియేన్పాల్ వన్దాయ్ పోలే వారాయే 6-10-8

సూక్ష్మమైన బుద్ధిని కలవాడు, హాలాహలం అనే విషాన్ని పానం చేసినందువల్ల నల్లనైన కంఠాన్ని కలవాడు, ఇటువంటి సాహసకృత్యాలను చేయడంలో శక్తి సామర్థ్యాలను కలవాడు కావడంవల్ల లోకంలోనివారికి సేవ్యుడైన రుద్రుడు, అతనికంటే అధికమైన జ్ఞానాన్ని, శక్తిని కల సత్యలోకాధిపతి అయిన చతుర్ముఖ బ్రహ్మ, దేవలోకాధిపతి అయిన ఇంద్రుడు- అనే వీరు. నిన్ను సేవించే రీతిలో ఏ పుణ్యాన్ని చేసినవారు కాకపోయినా "ఈ అనుభవంలేకుండా జీవించి ఉండలేము" అని ఒక్కొక్కరూ పల్కుతూ, చేపలవంటి కన్నులను కల తమ భార్యలతో కలిసి తిరుమలకు ఎంతో ఆశతో వస్తున్నారు. వచ్చి నిన్ను కళ్ళార సేవించి, ఆనందాన్ని పొందుతున్నారు. ఆ రీతిలో నేనుకూడా నిన్ను సదా దర్శిస్తూ అనుభవించేటట్లుగా పరమకృపతో దాసునిదగ్గరకు వేంచేయాలి. (ఈవిధంగా ఆళ్వార్లు ప్రార్థించినా భగవానుడు రాలేదు. అపుడు ఆళ్వార్లు మళ్ళీ ఈవిధంగా స్వామితో అంటున్నారు)



నేను సదా దర్శించేటట్లుగా వేంచేయకున్నా, శ్రీగజేంద్రాళ్వాన్‌ను సంరక్షించడంకోసం గరుడునిపై ఒకమారు వేంచేసినట్లే, నిన్ను సేవించలేక పిచ్చిపట్టినట్లున్న నాదగ్గఱకు కనీసం ఒక మారైనా రావాలి.

రక్షకులకు దయ కల్గడంకోసం సపరివారంగా శరణాగతి చేయడం లోకపరిపాటి. ఈ విషయం **"శేలేయ్ ....... విరుమ్బుమ్"** - ఇత్యాది ప్రయోగంవల్ల సిద్ధం.

**76. అవ :** తాము అపేక్షించిన వెంటనే భగవానుడు రాకపోవడంవల్ల ఆళ్వార్లు "స్వామీ ఇపుడు నిన్ను దర్శించలేకపోతే నా ప్రాణాలు నిలువవుసుమా!"- అని ఇందులో అంటున్నారు.

వన్దాయ్ పోలే వారాదాయ్! వారాదాయ్ పోల్ వరువానే!
శెన్దామరైక్కణ్ శెజ్గనివాయ్! నాల్తోళముదే! ఎనదుయిరే!,
శిన్దా మణిగళ్ పగరల్లై ప్పగల్శెయ్ తిరువేజ్గడత్తానే!,
అన్దో! అడియేన్ ఉనపాదమ్ అగలగిల్లేన్ ఇఱైయుమే 6-10-9

నిన్ను ఆశ్రయించనివారికి దగ్గరకు వచ్చినట్లే తోస్తావు. కాని, వారికి సులభుడవు కావు. నిన్ను ఆశ్రయించినవారికి తమకు తగిన ఉపాయం ఏదీ లేకపోవడంవల్ల "ఇతడు మనకు దుర్లభుడు" అని వారు భావించినా, వారికి పరమ సులభుడవై ఉన్నావు. ఎఱ్ఱని తామరలవంటి తిరునేత్రాలను, ఎఱ్ఱని దొండపండువంటి అధరాన్ని, జానుపర్యంతం పొడుగైన నాల్గు భుజాలను కలవాడవై, అమృతంవలె భోగ్యంగా ఉన్న స్వామీ! ఈ నీ అతిలోకసౌందర్యాన్ని దర్శింప చేసి, నిన్నే నాకు ధారకంగా, పోషకంగా, భోగ్యంగా చేశావు. అడిగినవారికి వారి కోరికలను అన్నిటినీ ఇచ్చే చింతామణివంటి రత్నాలు తమ కిరణాల ప్రకాశంతో రాత్రిని పగలుగా చేసే అత్యంతవైభవాన్ని కల తిరుమలలో నా కోసం వేంచేసి ఉన్నావు. దాసుడు నీ శ్రీపాదాలను ఒక క్షణంకూడా విడచి ఉండలేడు. అందువల్ల కృపతో నన్ను నీ శ్రీచరణాలలో చేర్చుకొని అనుగ్రహించు.

**77. అవ :** "ఏమైనా సరే, మీరు ఒక ఉపాయన్ని అనుష్ఠించితీరాలి"అని భగవానుడు నియమించినట్లుగా భావించిన ఆళ్వార్లు ఇందులో ఉపాయాలలో గొప్పదైన ప్రపత్తిని సాంగోపాంగంగా, లక్ష్మీపురుషకారపూర్వకంగా అనుష్ఠిస్తున్నారు.

అగలగిల్లేన్ ఇఱైయు మెన్ఱు అలర్మేల్మజ్గై యుఱైమార్బా!,
నిగరిల్ పుగళాయ్! ఉలగమ్ మూన్ఱుడైయాయ్! ఎన్నై యాళ్వానే!,

నిగరిల్ అమరర్ మునిక్కణజ్గళ్ విరుమ్బుమ్ తిరువేజ్గడత్తానే!,
పుగలొన్ఱిల్లా అడియేన్ ఉన్నడిక్కీ*ழ்* అమర్న్దు పుగున్దేనే **6-10-10**

తామరపూవుపై, దాని సౌందర్యసౌంగధ్యాలు మూర్తీభవించినట్లుగా వేంచేసి ఉన్నట్లున్న, నిత్యయౌవనవతి అయిన లక్ష్మీదేవికూడ నీతో నిత్యం సంశ్లేషించి ఉన్నా (నీ వక్షఃస్థలం) ప్రతిక్షణం ఆమెకు నిత్యనూతనంగా స్ఫురించి, మనోహరంగా ఉన్నందున దానిని "ఒక్కక్షణకాలం కూడా విడచి ఉండలేను'' అని విన్నపిస్తూ సదా సర్వకాలం అనన్యంగా నివసించే అతివిశాలం అయిన వక్షఃస్థలాన్ని కలవాడా ! అంతు లేని కరుణ, వాత్సల్యం మొదలైన కల్యాణగుణాలను కలవాడా ! మూడు లోకాలకు స్వామివై వాటిని రక్షించే బాధ్యతను కలవాడా! చాలా నీచుడనైన నన్ను కూడా నీకు అంతరంగ సేవకునిగా చేసికొని, నీ సౌశీల్యం అనే కల్యాణగుణాన్ని ప్రదర్శించినవాడా! నిరంతరం నీ కైంకర్యరసాన్ని అనుభవిస్తూ, గుణానుభవనిష్ఠులు-కైంకర్యనిష్ఠులనే రెండు విధాలైన నిత్యసూరి సంఘాలు ఆశ పడి వచ్చి సేవించే రీతిలో తిరుమలలో అందఱికీ సులభుడవై వేంచేసి ఉన్నావు. నాకు నీవు తప్ప వేఱు గతి లేదు సుమా! అందువల్ల లక్ష్మితో నిత్యసంశ్లేషరసాన్ని అనుభవిస్తూ వేంచేసి ఉండే నీ శ్రీచరణాలను ఉపాయంగా తలచి, నన్ను రక్షించే భారాన్ని వేఱు ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా నీకు సమర్పించాను. ఇపుడే నా ప్రతిబంధకాలు అన్నీ పోయి, నీకు సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలో సర్వవిధ కైంకర్యాలను నేను చేసేటట్లుగా నన్ను అనుగ్రహించు.

ఈ పాశురంలో ద్వయంలోని పూర్వఖండార్థం అనుసంధింపబడిందనే విషయం వ్యాఖ్యానగమ్యం. **"నికరిల్ పుక*ழ்*ాయ్"** - అని వాత్సల్యం, **"ఉలకమ్ మూన్ఱుడై యాయ్"** - అని స్వామిత్వం, **"ఎన్నై యాళ్వానే"** అని సౌలభ్యం, **"తిరువేజ్గడత్తానే"**- అని సౌశీల్యం - అనే ఆశ్రయణ సౌకర్యాపాదకగుణాలు నాల్గు ప్రకాశింపచేయ బడ్డాయి. ఈ గుణాలు వైకుంఠంలో ప్రకాశించవు, తిరుమలలో స్వామిలోనే ప్రకాశిస్తాయి కనుక **"నికరిల్ ..... విరుమ్బుమ్"** అని అనబడింది. **"అకలకిల్లేన్ ..... మార్బా"** అని శ్రీమత్పదార్థం, స్వామిత్వాదిగుణచతుష్టయాన్ని తెలిపే పదాలతో నారాయణశబ్దార్థం, **"ఉన్నడిక్కీ*ழ்*"** అని చరణ శబ్దార్థం, **"పుకున్దేనే"** అని **"ప్రపద్యే"** అనే శబ్దం యొక్క అర్థం ఇందులో తెలుపబడ్డాయి.

**78. అవ :** చివరగా ఈ దశకాన్ని అభ్యసించినవారికి కలిగే ఫలాన్నిగూర్చి ఆ*ழ்*్వార్లు పలుకుతున్నారు.



అడిక్కీ*ழ்*అమర్న్దు పుగున్దు అడియార్ వా*ழ்*మినెన్ఱున్దరుళ్ కొడుక్కుమ్,
పడిక్కే*ழ్*ిల్లా ప్పెరుమానై ప్ప*ழ்*న క్కురుగూర్ చ్చడకోపన్,
ముడిప్పాన్ శొన్న ఆయిరత్తు తిరువేజ్గడత్తుక్కివై పత్తుమ్,
పిడిత్తార్ పిడిత్తార్ వీ*ற్ఱ*ిరున్దు పెరియవానుళ్ నిలావువరే, **6-10-11**

తనకు కైంకర్యాలను చేయాలని ఆశపడేవారిని ఉద్దేశించి భగవానుడు - "నా శ్రీచరణాల మోల వేఱొక ఏ ప్రయోజనాన్ని ఆశించకుండా చేరి, వానిని ఆశ్రయించి ఉజ్జీవించండి'' అని ఉపదేశిస్తున్నాడు. అతడు అంతు లేని కల్యాణగుణాలను కలవాడు. ఆశ్రితసంరక్షణలో సాటి లేనివాడు, సర్వాధికుడు అయిన ఇటువంటి స్వామిని ఆశ్రయించి తాము కృతార్థతను పొందాలని నమ్మా*ழ்*్వార్లు తిరుమల వైభవాన్ని వర్ణించి చెప్పిన ఈ పది పాశురాలను నిత్యం అభ్యసించే పరమభాగవతోత్తములను ఎవరు ఆశ్రయిస్తారో, వారిని ఆశ్రయించినవారుకూడా అంతు లేని ఆనందాన్ని, వైభవాన్ని కల వైకుంఠమహానగరాన్ని చేరి, సర్వేశ్వరుని నిత్యకైంకర్య సామ్రాజ్యాన్ని ఏలుతూ, పునరావృత్తిలేకుండా, అక్కడే నిలచి ఉంటారు.

ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళిలోని ఈ పాశురభావాన్ని తెలిపే శ్లోకం

ఆపత్సంరక్షణా దర్యుపకరణతయా మేఘసామ్యాదిభూమ్నా
స్వానాం విశ్వాసదానాత్ సురగణభజనాత్ దివ్యదేశోపసత్త్యా ।
ప్రాప్యాప్రాప్యత్వయోగాత్ స్వజనవిజనయోః సత్ప్రపత్త్యభావాత్
ఊచే నాథం శరణ్యం శ్రుతిశతవిదితం వేంకటేశం శఠారిః ॥

నమ్మా*ழ்*్వార్లు **"ఉలక ముణ్డ పెరువాయా"** అనే దశకంలో- సర్వేశ్వరుడు జగద్రక్షకుడు, శత్రువులను సంహరించే సుదర్శనాన్ని కలవాడు, నీలమేఘంవంటి దివ్యమంగళరూపాన్ని కలవాడు, సాటిలేని మేటి కీర్తిని కలవాడు, సుగ్రీవాది భక్తులకు తనలో విశ్వాసం కలిగేటట్లు చేసేవాడు, నిత్యసూరులచేత ఎల్లప్పుడూ సేవింపబడేవాడు, మనకు సన్నిహితం అయిన శ్రీవేంకటాచలాది దివ్యదేశాలను నివాసంగా కలవాడు, ఆశ్రితులకు అత్యంత సన్నిహితంగా ఉండేవాడు, ఆశ్రయించనివారికి దూరంలో ఉండేవాడు, సత్పురుషులకు ప్రపత్తిని చేయదగినవాడు, కాబట్టి సర్వవేదప్రతిపాద్యుడైన శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామిని శరణ్యునిగా చెప్పారు.

ద్రవిడోపనిషత్ సంగతిలోని ఈ దశకార్థాన్ని తెలిపే శ్లోకం

ఆర్తేః తథా గతితయా ముని రబ్జవాసా-
మాశ్రిత్య సంఘటనకర్మణి జాగరూకామ్ ।
ఆవేద్య చాధిదశమం స్వ మకించనత్వమ్
శ్రీవేంకటేశచరణౌ శరణం ప్రపేదే ॥

"ఉలకముణ్డ పెరువాయా" అనే తిరువాయ్‌మొ*ళ్ళి*లో నమ్మా*ళ్ళ్వా*ర్లు భగవద్విశ్లేషం వల్ల తమకు ఏర్పడిన అంతు లేని దుఃఖాన్ని సహించలేక, లక్ష్మీపురుష కారపురస్సరంగా తమ దుఃఖాలను, సాధనాంతర రాహిత్యాన్ని విన్నపించి, తమ అభీష్టసిద్ధి కోసం శ్రియఃపతి అయిన శ్రీవేంకటేశ్వరుని శ్రీపాదాలను ఉపాయంగా నమ్మి, శరణాగతి చేశారు.

**తిరువాయ్‌మొ*ళ్ళి*నూ*ఱ్ఱ*న్దాదిలోని ఈ దశకసారాన్ని తెలిపే పాశురం**

**ఉలగుయ్య మాల్‌నిన్ఱ ఉయర్ వేఙ్గడత్తే,**
**అలర్మగళై మున్నిట్టు అవన్దన్- మలరడియే,**
**వణ్‌శరణాయ్ చ్చేర్‌న్ద మగి*ళ్* మాఱన్‌తాళిణైయే,**
**ఉన్ శరణాయ్ నెఞ్జమే! యుళ్** **60 వ.పా.**

ఓ మనసా! సకలలోకోజ్జీవనార్థం తిరుమలలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశుని చరణారవిందాలను పిరాట్టిని పురుషకారంగా చేసికొని, శరణు వేడిన శఠకోపుల శ్రీచరణాలనే నీవు శరణంగా మనసులో అనుసంధించు.

ఇకపై తిరువిరుత్తం, పెరియ తిరువన్దాది, తిరువాయ్ మొ*ళ్ళి* ప్రబంధాలలోని శ్రీవేంకటేశ్వరుని స్తుతించే ప్రత్యేక పాశురాలు విన్నపింపబడుతున్నాయి.

## తిరువిరుత్తమ్

తిరువిరుత్తమ్ ప్రబంధంలో ఆ*ళ్ళ్వా*ర్లు తమ జ్ఞాననేత్రానికి గోచరుడైన భగవానుని ఉద్దేశించి, "నిన్ను అనుభవించడానికి అడ్డుగా ఉండే దేహసంబంధాన్ని పోగొట్టి అనుగ్రహించాలి'' అని అంటూ సంసారసంబంధనివృత్తిని ప్రార్థిస్తూ, అజ్ఞానాన్ని కల్గించే ఈ సంసారంలో ఉండడం తమకు చాలా అసహ్యంగా ఉండడాన్ని, భగవానుని నిత్యానుభవంలో తమకున్న అభినివేశాతిశయాన్ని విన్నపించారు. ఈ ప్రబంధంలో మొదటి పాశురం, చివరి పాశురం తప్ప మిగిలిన



98 పాశురాలను స్త్రీ భావనతో ఆ*ళ్ళ్వా*ర్లు పల్కడం విశేషంగా గమనించదగిన విషయం. ఇందులోని స్వాపదేశార్థాలను మహనీయులైన పూర్వాచార్యులు విశేషంగా వివరించారు. ఆ*ళ్ళ్వా*ర్లు తమ వృత్తాంతాన్ని భగవానుని సమక్షంలో విన్నపించి నందువల్ల ఈ ప్రబంధానికి **"తిరువిరుత్తమ్"** అనే పేరు కల్గింది. ఈ ప్రబంధంలో మొత్తం శ్రీవేంకటేశ్వరుని స్తుతించే పాశురాలు **8** ఉన్నాయి.

**79. అవ :** ప్రస్తుత పాశురంలో భగవదలాభదశలో ఆ*ళ్ళ్వా*ర్లకు ఊఱటను కల్గించే, వారి పట్ల ప్రేమను కల్గిన భాగవతులు, భగవానుని సేవించాలనే ఆశతో దివ్యదేశాలకు యాత్రగా పోవాలని తలచి ఆ*ళ్ళ్వా*ర్ల ఆజ్ఞను పొందాలని మెల్లగా ప్రయత్నించారు. అపుడు తమకు "భగవద్విశ్లేషమే కాకుండా భాగవతవిశ్లేషంకూడా కల్గుతుందో! ఏమో!'' అనే భయంతో ఆ*ళ్ళ్వా*ర్లు వారితో నిష్ఠూరంగా పలికే పాశురం ఇది. ద్రావిడాలంకారిక ప్రక్రియలో నాయకుడు ధనసంపాదనార్థం నాయకిని విడచి వేరే చోటికి పోవాలని ప్రయత్నించి, కొన్ని అపూర్వమైన చేష్టలను ఆమె ముందు చేసినపుడు నాయకి అతని భావాన్ని గుర్తించి సఖితో తన ఆర్తిని వెల్లడించే పాశురం. లేక, నాయకుని ఉద్దేశించి చెప్పిన పాశురంగా గాని, సఖి నాయకుని సంబోధిస్తూ పల్కిన పాశురంగా గాని చెప్పవచ్చు. దీనికి ద్రావిడాలంకార శాస్త్రంలో **"పొరుళ్ వయిఱ్పిరివు"** అనిపేరు.

**కాణ్‌గిన్ఱనగళుమ్ కేట్కిన్ఱనగళుమ్ కాణిల్, ఇన్నాళ్**
**పాణ్ శున్ఱనాడర్ పయిల్‌గిన్ఱన,- ఇదెల్లామ్ అఱిన్దోమ్**
**మాణ్ కుఱ్ఱ మేన్ది త్తణ్‌మామలై వేఙ్గడత్తు ఉమ్బర్ నమ్బుమ్**
**శేణ్ కున్ఱమ్ శెన్ఱు, పొరుళ్ పడైప్పాన్ క*ఱ్ఱ* తిణ్ణనవే** **8వ.పా**

నా విషయంలో అత్యంతస్నేహాన్ని కల సఖీ! పర్వతప్రాంతాలకు ప్రభువైన నాయకుడు ఈనాడు పలు రీతులలో అపూర్వంగా ప్రవర్తించే తీరును, పలికే మాటలను పరిశీలించి చూస్తే అవి నాకు సహృదయంగా కన్పించడం లేదు. చాలా కృత్రిమంగా కన్పిస్తున్నది. ఈ విధంగా అవధి దాటిన విధంగా ఇతడు చేయడానికి, చెప్పడానికి ఏదో ఒక ఉద్దేశ్యం ఉండి ఉండాలి. అది ఏమయి ఉంటుంది? అని అంటే, గొప్ప గోవర్ధన పర్వతాన్ని ఎత్తి గోగోపగోపీజన సంఘాన్ని కాచిన శ్రీకృష్ణుడు అత్యంతాదరంతో వేంచేసి ఉండే ఉన్నతమైన వేంకటాద్రిని చేరి, ధనాన్ని సంపాదించడంకోసం మనలను విడచిపోవాలని ఇతడు తలచి ఉండాలి. ఈ విధంగా ఇతడు నన్ను విశ్లేషించాలని అనుకోకపోతే ఈ విధమైన వినూత్నమైన రీతిలో చేష్టలు

కాని, మాటలు కాని సంభవించవు. నాయకుడు పోయే వేంకటాచలం ఎంత కఠినంగా ఉన్నదో అతని మనస్సుకూడా అంత కఠినంగా ఉన్నదే! అయ్యో!

ఆళ్వార్లను విశ్లేషించి పోదలిన భాగవతులు అందులకు ఆళ్వార్ల అనుమతిని పొందాలని భావించి, వారి విషయంలో పలు సేవలను చేసి, నమస్కరించి, కొన్ని మాటలను పలికినపుడు, “దీనిని అంతటినీ వీరు నన్ను విడిచి వెళ్ళడంకోసం చేసే ప్రయత్నం” అని ఆళ్వార్లు గ్రహించి, “వీరు చేసే ఈ ఉపచారాలు అన్నీ వేటే ఉద్దేశ్యాన్ని దృష్టిలో పెట్టుకొని చేసినవిగా కన్పిస్తున్నది. వీటి ఉద్దేశ్యాన్ని గ్రహించాము. గోవర్ధనగిరిని ఎత్తి శిలావర్షం నుండి కాపాడిన స్వామి వచ్చి చేరిన శ్రీవేంకటాచలంలో సాటిలేని గొప్ప ఋషిగణాలు సేవించే ఉన్నత శిఖరాలను చేరి, అక్కడ గుప్తనిధిగా వేంచేసి ఉండే పద్మావతీజానిని ఆశ్రయించి, సేవించడంకోసం చేసే ప్రయత్నమే ఇది” అని వారి విశ్లేషభీతిచేత ఆళ్వార్లు పల్కుతున్నారని ఈ పాశురంలోని స్వాపదేశార్థం. తిరువిరుత్తంలోని ఈ పాశురాలు భైరవిరాగం, జంపతాలంలో కూర్చ బడ్డాయి.

**80. అవ :** తమను విశ్లేషించలేని గాఢమైన స్నేహాన్ని కల భాగవతులు ఆళ్వార్ల అవయవ శోభలో, సూక్తిమాధుర్యంలో అభినివేశాన్ని పొంది పలికే మాటలను, సఖి-నాయకి ఒకటిగా చేరి పొలాన్ని కాపు కాసే సమయంలో, వారికి ఎదురైన నాయకుడు సఖి అభిప్రాయాన్ని తన అభిప్రాయంలో కలిపి నాయకితో పలికే ద్రావిడాలంకారిక ప్రక్రియలో చెప్పిన పాశురం ఇది. లేక, సఖి, నాయకుని మనస్సును తన అభిప్రాయంలో కలిపి నాయికకు తెల్పిన రీతిగాకూడా చెప్పవచ్చు.

**మాయోన్ వడతిరువేఙ్గడనాడ, వల్లిక్కొడిగాళ్**
**నోయో ఉఱైక్కిలుమ్ కేట్కిన్ఱిలీర్ ఉఱైయీర్,- నుమదు,**
**వాయో అదువన్ఱి వల్వినై యేనుమ్ కిళియు మెళ్గుమ్**
**ఆయో అడుమ్ తొణ్డైయో, అఱైయో ఇదఱివరిదే 10వ.పా**

ఆశ్చర్యగుణచేష్టితుడైన భగవానుడు అధివసించి ఉన్న, ఉత్తరదిక్కుకు ఎల్లగా చెప్పబడే శ్రీవేంకటాచలంలో నివసించే పూలతీగలవంటి బాలికలారా! నేను పడే బాధను నేనే చెప్పినా మీరు ఏమాత్రం వినడంలేదే! ఎందుకో చెప్పండి. నేను పడే బాధమాత్రమే నాకు తెలుస్తున్నది తప్ప, దానికి కారణం ఏమో తెలియడం లేదు. మీరే దయచేసి చెప్పండి. మీ ముఖసౌందర్యమా! లేక, నేను నాపెంపుడు చిలుక తల్లడిల్లే రీతిలోని మీ స్వరమాధుర్యమా! లేక, దొండపండువంటి మీ అధరమా?



నన్ను ఈ విధంగా ఏది బాధిస్తున్నది! వీటిలో ఏది నన్ను బాధిస్తున్నదో తెలిసి కోవడం శక్యం కాకుండా ఉన్నది. దానిని దయచేసి మీరే చెప్పండి.

ఆశ్చర్యగుణచేష్టితాలను కలవాడై, లోకసంరక్షణార్థంగా పరమపదాన్ని విడచి, తిరుమలకు వచ్చి వేంచేసి ఉండే సర్వేశ్వరుని సౌలభ్యాన్ని అన్వేషించేవారు, లతవలె పారతంత్ర్య స్వరూపాన్ని కలవారైన ఓ ఆళ్వార్లూ! మీ విషయంలో ఉన్న ప్రీతి విశేషంచేత మేము పడే బాధను చెబుతున్నా మీరు వినడంలేదు. మీ తిరుముఖ మండల వికాసమా! లేక, మిమ్ములను విడిచి పోలేనట్లుగా కట్టిపడవేసే పాశబంధాన్ని కల మేము, పచ్చని వర్ణాన్ని కల స్వామి అభినివేశాన్ని పొందేటట్లున్న మీ సూక్తి మాధుర్యమా! మీ అధరశోభా! వీటిలో ఏది మమ్ములను బాధిస్తున్నదో తెలియడానికి సాధ్యం కాకుండా ఉన్నది. దయచేసి మీరే దీనిని నిశ్చయించి చెప్పండి- అని భాగవతులు ఆళ్వార్లను ఉద్దేశించి ప్రశ్నిస్తున్నారని ఈ పాశురానికి స్వాపదేశార్థంగా చెప్పవచ్చు. అపుడు ఈ పాశురం నాయకుడు పల్కిన మాటగా కాకుండా చెలికత్తె నాయకుని అభిప్రాయాన్ని తన అభిప్రాయంతో కలిపి నాయకికి తెలిపిన పాశురంగా అన్వయించాలి. దీనికి ద్రావిడాలంకారశాస్త్రంలో **“మదియుడన్పాడు”** అని పేరు.

**81. అవ :** ఆళ్వార్ల జ్ఞానవైశద్యాన్ని చూచి అభినివిష్టులైన కొందరు, వారి జ్ఞాన వైలక్షణ్యాన్ని కీర్తిస్తుండగా, ఉదాసీనులుగా ఉండే మఱి కొందఱి హృదయాన్ని పరీక్షించడంకోసం వారిని ఉద్దేశించి పక్కనే ఉన్న భక్తులు పల్కిన సూక్తిని, పొలంలో ఏనుగును వెదకడం కోసం వచ్చి, నాయిక నేత్రసౌందర్యాన్ని ప్రశంసించే రీతిలో పలికే నాయకుని ఉద్దేశించి అతని మనస్సును గుర్తించిన సఖి భావగర్భితంగా అతనితో అంటున్నది.

**కయలో నుమకణ్గళ్ ఎన్ఱు కళిఱు వినవినిఱ్ఱీర్,**
**అయలోర్ అఱియిలుమ్ ఈదెన్న వార్త్తై? కడల్ కవర్న్ద,**
**పుయలోడులాఙ్గొణ్డల్ వణ్ణన్ పునవేఙ్గడత్తెమ్మొడుమ్**
**పయలోవిలీర్, కొలై కాక్కిన్ఱ నాళుమ్ పలపలవే 15వ.పా**

“అయ్యా! మీరు ఏనుగును వెదకడంకోసం వచ్చినవారైతే ఆ పనిని చూచుకొని వెళ్ళకుండా, మా శఠకోపనాయిక నేత్రసౌందర్యాన్ని ఎందుకోసం వర్ణిస్తున్నారు? అసంగతం అయిన ఈ మాటను ఇరుగు పొరుగువారు ఎవరైనా వింటే ఏమని అనుకుంటారు? మీరు ఈ విధంగా పల్కడం ఏమీ సబబు కాదు. సముద్రంలోని నీటిని గ్రసించి, వర్షిస్తూ యథేచ్ఛగా సంచరించే కాలమేఘంవంటి మనోజ్ఞమైన

దేహకాంతిని కల శ్రీవేంకటేశ్వరుడు విహరించే ఉద్యానవనాలతో శోభిల్లే తిరుమలలో మేము పొలాన్ని కాపు కాచినది నిన్న ఈనాడు కాదు. పలు సంవత్సరాలుగా ప్రతిదినం కాపలా కాస్తున్నాము. మాతో మీకే సంబంధం లేదు. మీరు దయ చేయవచ్చు''- అని అంటూ నాయకి నేత్రాలను "ఇవి కన్నులా? లేక, చేపలా?'' అనే నాయకుని ఆ ప్రశ్నలోని తాత్పర్యాన్ని గ్రహించిన సఖి, అతని ఆశను నిషేధించేటట్లు, లోపల అతనిని అభినందించేటట్లు పలుకుతున్నది.

ఈవిధంగా కాకుండా, నాయకుడు ప్రేమాతిశయాన్ని వ్యక్తం చేసే రీతిని సఖి అంగీకరించి పలుకుతున్నట్లుగాకూడా ఈ పాశురానికి స్వాపదేశార్థాన్ని చెప్పవచ్చు.

"మీ కన్నులు చేపలా!'' అని మా నేత్రాల అందంలో అభినివేశాన్ని పొంది మీరు పల్కుతున్నారే! మీ ప్రేమకు చాలా సంతోషం. కాని, ఏనుగునుగూర్చి ప్రశ్నించారే! అది ఎందుకు? ఈ విధంగా ఏనుగును గూర్చి ప్రశ్నిస్తూ నిలవడం తగునా? మీ ప్రేమను ఇరుగుపొరుగువారు గ్రహిస్తే గ్రహించనివ్వండి. దానివల్ల మనకేమి? వచ్చిన కార్యాన్ని మఱచి, ఏనుగునుగూర్చి అడగడంకూడా ఒకమాటా? మేము మీకు పరాయివాళ్ళం కాము. మీ రాకకోసం ఎదురు చూస్తూ మేము చాలాకాలంగా సజ్జచేనును కాపలా కాస్తుండగా, మీరు ఇంతవరకు రాలేదుకదా!'' అని అంటూ నాయకి ప్రేమను నాయకునితో సఖి తెల్పుతున్నదనికూడా చెప్పవచ్చు.

**82. అవ :** "భగవద్విషయంలో అవగాహించిన ఆళ్వార్ల మనస్సును మరలించడం సర్వశక్తి అయిన స్వామికే సాధ్యం కాకుండా ఉండగా తిర్యక్కులం అయిన మనకు సాధ్యం అవుతుందా?'' అని హంసలు వెనుదిరిగిపోయినవి.అపుడు ఆళ్వార్లు తిరుమల దిశలో పయనించే మేఘాలను భగవానుని వద్దకు దూతలుగా పంపుతున్నారు,

**ఇశైమిన్‌గళ్ తూదెన్ఱు ఇశైత్తాల్ ఇశైయిలమ్, ఎన్‌తలైమేల్**
**అశైమిన్‌గళెన్ఱాల్ అశైయుజ్గొలామ్, - అమ్బొన్ మామణిగళ్**
**తిశైమిన్ మిళిరుమ్ తిరువేఙ్గత్తువన్ తాళ్ శమయ**
**మిశై, మిన్ మిళిరియ పోవాన్ వళ్గిక్కొణ్డ మేగఙ్గళే** 31వ.పా

మేఘాలలారా! అంతటా అందమైన సువర్ణంయొక్క, గొప్ప రత్నాల యొక్క, మెఱపుల వలె ప్రకాశించే తిరుమలకు (స్వర్ణరత్నఖచితాలైన శిఖరాలను కల తిరుమలకు) చేరాలని బయలుదేరిన నా నాయకునితో నా స్థితినిగూర్చి తెలిజేయడం కోసం మీరు నా దూతలుగా వెళ్ళండి'' అని నాయకి ప్రార్థించింది. అయినా మేఘాలు



అందుకు అంగీకరించినట్లు కన్పించకపోవడంతో మళ్ళీ వాటిని ఉద్దేశించి - "నా తలమీద మీ పాదాలను పెట్టి అయినా, మీరు వెళ్ళండి'' (మీ పాదాలపై పడతాను. మీరు నా దూతలుగా వెళ్ళండి) అని నాయిక ప్రార్థిస్తున్నది.

ఆళ్వార్ల విషయంలో ప్రీతిని కల భాగవతులు ఆళ్వార్ల భగవత్ప్రావణ్యాన్ని గుర్తించి మౌనంగా ఉండగా, తిరుమలకు వచ్చే మఱికొందఱు భాగవతులను చూచి ఆళ్వార్లు వారు తమకు పురుషకారం చేస్తారని భావించి, వారి శ్రీపాదాలను తాము శిరసా వహించడమే పరమపురుషార్థం అనే నిశ్చయంతో వారిని ప్రార్థించడమే పాశురంలోని స్వాపదేశం.

**83. అవ :** భగవదలాభంచేత ఆళ్వార్లకు కల్గిన ఆర్తిని విని దేశాంతరంలో ఉండే, వారి విషయంలో ప్రేమను కల భాగవతులు, వెంటనే వారిని కళ్ళార దర్శించాలని, వారిని సాంత్వనపరచాలని వేగంగా వచ్చిన రీతిని, ధనసంపాదనార్థం దేశాంతరానికి పోయి, కార్యం ముగించుకొని వచ్చే నాయకుడు, నాయకి తన రాకకోసం ఎంతో ఆతురతతో ఎదురుచూస్తూ ఉంటుందని భావించి, తన రథసారథిని వేగంగా రథాన్ని నడపమని చెప్పే ప్రకారంలో తెలుపుతున్నారు. దీనికి ద్రావిడాలంకార ప్రక్రియలో **"తేర్‌పాకనోడు కూఱల్"** అని పేరు.

**ఒణ్ణుదల్ మామై యొళిపయ వామై, విరైన్దు నన్దేర్**
**నణ్ణుదల్ వేణ్డుమ్ వలవ! కడాగిన్ఱు, - తేన్ నవిన్ఱ,**
**విణ్‌ముదల్ నాయగన్ నీళ్‌ముడి వెణ్ ముత్త వాశిగైత్తాయ్**
**మణ్‌ముదల్ శేర్ వుఱ్ఱు, అరు విశెయ్యా నిఱ్కుమ్ మామలైక్కే** 50వ.పా

ఓ రథసారథీ ! అందమైన పాలభాగాన్ని కల నాప్రేయసి అయిన నాయకి యొక్క మేనికాంతి నా విరహంవల్ల పాలిపోవడానికి ముందే తేనెవలె భోగ్యుడు అయిన పరమపదనాథుని దీర్ఘమైన కిరీటంలో అలంకరింపబడ్డ తెల్లని ముత్యాల మాలెలవలె స్వచ్ఛంగా మెఱిసే కొండవాగులతో కూడిన, సుభగశీతలం అయిన తిరుమలకు పోయి చేరాలి. అందువల్ల త్వరగా రథాన్ని నడుపు.

**84. అవ :** పక్కన ఉన్నవారుకూడా అభినివేశాన్ని పొందే రీతిలో ఉన్న ఆళ్వార్ల ఆర్తిని చూచిన వారి భక్తులు, "ఈశ్వరుని అనన్యసాధ్యతను తెలియకుండా, అతనిని పొందడానికి ఉపాయాలైన భక్త్యాదులు చాలనివిగా ఉండగా, వీరి ఈత్వరవల్ల ఏమవుతుందో ఏమో!'' అని పలికే సూక్తిని, నాయిక, నాయకుని విశ్లేషించిన స్థితిలో విరహాన్ని సహించలేక బాధపడి, పలవరించి, కన్నీరు విడచి, శరీరం కృశించి, రూపు

మాటిపోగా, దానిని గమనించిన ధాత్రి, అందులకు గల కారణాన్ని తెలియలేక కళవళపడి, ఆమె ప్రాణసఖిని అడిగింది. అపుడు, ఆమెకూడా నిజాన్ని దాచకుండా వ్యక్తం చేయగా, దానిని విని ధాత్రి (దాది) నాయిక చిన్నతనాన్ని భావించి జాలిపడుతూ పల్కిన రీతిలో ఈ పాశురాన్ని ఆళ్వార్లు అనుగ్రహిస్తున్నారు.

**ములైయో ముழு ముఱ్ఱుమ్ పోన్దిల, మొయ్‌పూజ్గుழల్ కుఱియ**
**కలైయో అఱై యిల్లై నావో కుழఱుమ్, - కడల్ మణ్ణెల్లామ్**
**విలైయో వెన మిళిరుమ్ కణ్ ఇవళ్ పరమే? పెరుమాన్**
**మలైయో, తిరువేజ్గడమెన్ఱు కఱ్కిన్ఱ వాశగమే 60వ.పా**

నాయకుడు చూడగానే మోహాన్ని పొందదగినవి, యౌవనారంభానికి సూచకాలైనవి అయిన స్తనాలు ఇంకా ఈ నాయికకు ఉదయించనే లేదు. నాయకుడు తన చేతులతో పూలను ముడిచి, కొప్పు వేయడానికి తగిన కేశపాశం ఏర్పడనేలేదు. నడుముపై వస్త్రాన్ని ధరించే రీతి తెలియనే లేదు. తల్లిదండ్రులు చెప్పే మాటలనుకూడ స్పష్టంగా ఉచ్చరించడం రానేలేదు. ఇటువంటి బాల్యావస్థలోనే లోకాలన్నీ ఈమె నేత్రాలకు చాలవు అనే రీతిలో హావభావాలను కల చూపులను ప్రసరింపజేస్తూ, భగవానుడు నిత్యవాసం చేసే వేంకటాచలమనే పదాన్ని సిగ్గుతో అనుసంధిస్తున్నది. ఈ విధమైన స్థితి బాల్యావస్థలోనే ఉన్నపుడు యౌవనదశలో ఎల్లప్పుడూ ఈమె భగవానుని తిరునామానుసంధానం చేయడంలో ఆశ్చర్యం ఏమున్నది?

తమిళ అలంకార శాస్త్రంలో ఈ ప్రక్రియకు **"శెవిలి ఇరజ్గల్"** అనిపేరు.

భగవానుని చేరి అనుభవించడానికి సాధనం అయిన భక్తి పరిణమించి ఇంకా పరమభక్తిగా మారనేలేదు. శిరస్సుతో ప్రణామాన్ని పూర్ణంగా చేయనే లేదు. నడుములో వస్త్రాన్ని బిగుతుగా కట్టుకొని, ముందుకు బయలుదేరే ప్రయత్నం చేయనే లేదు. నిరంతరం భగవన్నామసంకీర్తనం చేయనేలేదు. ధ్యానరూపమైన జ్ఞానం ఇంకా కలుగనే లేదు. అయినా, పారతంత్ర్యవేషంతో ఉండే వీరు తమ త్వరను ఒకే సాధనంగా ఆరోపించుకోవడం తగునా?- అన్నది ఈ పాశురంలోని స్వాపదేశార్థం.

**85. అవ :** ఆళ్వార్ల జ్ఞానవైలక్షణ్యాన్ని చూచి భోక్తలు (భాగవతులు) చాలా సంతోషించి, పలికే సూక్తిని- నాయకి నేత్రసౌందర్యాన్ని చూచి నాయకుడు ఆనందంతో పలికే పాశురంద్వారా, ఆళ్వార్లు తెలుపుతున్నారు.



**కావియుమ్ నీలముమ్ వేలుమ్  కయలుమ్ పలపల వెన్ఱు,**
**ఆవియిన్ తన్మై ఆళవల్ల పారిప్పు, - అశురర్గై చ్చెఱ్ఱ**
**మావియమ్ పుళ్‌వల్ల మాదవన్ గోవిన్దన్ వేజ్గడమ్ శేర్**
**తూవియమ్ పేడైయన్నాళ్, కణ్‌గళాయ తుణైమలరే 67వ.పా**

అసురులను సంహరించినవాడు, గొప్ప ఆశ్చర్యాన్ని కల్గించే మహిమను కల్గిన గరుత్మంతుని వాహనంగా చేసికొనగల్గినవాడు, శ్రియఃపతి అయిన శ్రీకృష్ణుడు నివసించే వేంకటాచలంలో ఉండే అందమైన రెక్కలను కల ఆడుహంసవలె గమనసౌందర్యాన్ని కల్గిన నాయకియొక్క పరస్పరతుల్యాలైన రెండు తామరపూలవంటి నేత్రాలు - వాటి కనుకొనలలో గల ఎఱ్ఱదనంచేత ఎఱ్ఱ కలువలను, కనుపాపల నల్లదనంచేత నల్ల కలువలను, తీక్ష్ణమైన తనచూపులతో పదునైన ఈటెను, ఆకారసౌందర్యంతో, చల్లదనంతో చేపలను, ఇంకా అన్యగుణాలతో లేడికన్నులవంటి పెక్కింటిని జయించినవి. అవి నన్ను బాధించడం అనేది ఒక పెద్ద విషయమా? వాటి శక్తి నా ప్రాణాలను మించి ఉన్నది. అల్పమైన నా ప్రాణాలను తీయడంకోసం అవి ఇంత పెద్ద ప్రయత్నాన్ని చేయవలసిన ఆవశ్యకత లేదుకదా!

దుష్టనిగ్రహశీలుడు, శ్రీగరుడవాహనుడు, వేదవేదాంతాలనే ఉత్తమప్రమాణాల చేత ప్రతిపాదింపబడేవాడు, పురుషకారభూత, పరమకరుణారూపిణి, అత్యంత మనోహరదివ్యమంగళవిగ్రహాన్ని, ఆకారత్రయాన్ని కల్గినది అయిన అలర్‌మేల్‌మజ్గై నిత్యనివాసం చేసే వక్షస్సును కలవాడైన శ్రియఃపతి వసించే వేంకటాచలంలో గొప్ప అభినివేశాన్ని కల ఆళ్వార్ల జ్ఞానవైభవానికి మమ్ములను వశీకరించుకొనడం ఒక పెద్ద కార్యమా! - అన్నది ఇందులోని స్వాపదేశార్థం.

**86. అవ :** భగవద్విషయంలో మిక్కిలి ఆర్తిని పొందిన ఆళ్వార్ల బాధను ఉపశమింప జేయాలని వారి  విషయంలో ప్రీతిని కలవారు తమ ప్రీత్యతిశయంచేత సోది చెప్పించడం వంటి వేఱే ఏవో కొన్ని స్వరూపవిరుద్ధాలైన ప్రయత్నాలను చేయాలని చూచినపుడు, ఆళ్వార్ల స్వభావాన్ని బాగా గ్రహించిన భక్తులు కొందఱు వీరి ఆర్తిని ఉపశమింప జేయగల దారిలో ప్రయత్నించకుండా, తద్విరుద్ధం అయిన వేఱే మార్గంలో ప్రయత్నిస్తే ఏం లాభం?" - అని గర్హిస్తూ పలికే సూక్తిని, నాయకి విరహార్తిని చూచి తల్లి మొదలైన వారు ఎఱుకల సానిచేత సోది చెప్పించాలని ప్రయత్నించి నపుడు, నాయకి మనస్సును తెలిపిన చెలికత్తె కోపగించుకొని, వారు వినేటట్లుగా తనలో తాను మాటలాడుకొనే రీతిలో, (స్వగతంగా) అనుగ్రహించిన పాశురం ఇది.

ఉఱుగిన్ఱ కన్మజ్గళ్ మేలన ఓర్ ప్పిలరాయ్, ఇవళై
ప్పెఱుగిన్ఱ తాయార్ మెయ్న్నొన్దుపెఱార్కొల్, - తుழాయ్ కుழల్వాయ్
త్తుఱుగిన్ఱిలర్ తొల్లై వేజ్గడ మాట్టవుమ్ శూழ్గిన్ఱిలర్
ఇఱుగిన్ఱదాల్, ఇవళాగమ్ మెల్లావి యెరి కొళ్ళవే 81వ.పా

శఠకోపనాయకికి, శ్రియఃపతి అనే నాయకుని విషయంలో కల అనురాగంవల్ల ఆర్తిని పొంది శరీరం కృశించి, రూపు మాఱిపోగా, దానిని చూచిన తల్లి, అందులకు పరిహారంగా ఎఱుకలసానిచేత జోస్యాన్ని చెప్పించడం, గ్రహశాంతిని చేయించడం మొదలైన ప్రయత్నాలను చేయబోయింది, మందు ఒకటి, రోగం వేఱొకటి - అనే రీతిలో అయినందువల్ల, వాటిని సహించలేక నాయకి ఇంకా ఇంకా బాధను పొందింది. అపుడు నాయకి మనస్సును గుర్తించిన సఖి ఆ తల్లి మొదలైనవారి చెవికి సోకేటట్లుగా స్వగతంగా ఈ విధంగా అంటున్నది.

ఈ శఠకోపనాయకి మృదువైన ప్రాణాలను విరహాగ్ని చుట్టుముట్టి దహించడంచేత, ఆ ప్రాణాలకు ఆశ్రయం అయిన శరీరం శిథిలమై పతనం చెందుతున్నది. ఇపుడు ఈమెకు కల్గిన వ్యాధిస్వరూపాన్ని, దాని నిదానాన్ని, దాన్ని తీర్చే ఉపాయాన్ని విచారించి తెలిసికోలేని వీరు ఎఱుకలసాని జోస్యం మొదలైన అననురూపాలైన పరిహారాలను వ్యర్థంగా చేస్తున్నారే !చివరికి ఈమె కొన ఊపిరినికూడా తీయాలని చూస్తున్నారు. ఈమెను కన్నతల్లి నవమాసాలు మోసి శ్రమించి కన్నది అయితే, పెంచి పెద్ద చేసిన దాది ఎంతో కష్టపడి పెంచినది అయితే, ఈమె నశించే ఇటువంటి ఈ ప్రయత్నాలను వీరు తలపెడతారా! ఈమె ఆశపడే భగవానుని తులసీమాలను తీసికొని వచ్చి ఈమె కొప్పులో పెట్టడం, అతని వాసస్థానం అయిన తిరుమలకు తీసికొనిపోవడమే ఈమె ఆర్తిని నివారించే తగిన పరిహారాలుగా ఉండగా, వాటిని ఏమీ వీరు చేయడంలేదే! ఇదేమి అన్యాయం!

ఆழ్వార్లకు, భగవానుని తులసీమాల మొదలైన ప్రసాదాలను అనుభవించడం, అతడు అభిమానించి, వేంచేసి ఉండే దివ్యదేశాలలో నివసించడం, ఆ స్వామి తిరునామాలను కీర్తించడం -మొదలైనవే వీరి ఆర్తిని తీర్చే పరిహారాలు. వాటిని చేయకుండా, వేఱే స్వరూపవిరుద్ధాలైన ప్రయత్నాలను చేయడంవల్ల వీరి ఆర్తి అధికమే అవుతున్నది. అయ్యో!- అన్నది ఇందులోని స్వాపదేశార్థం.



## పెరియతిరువన్దాది

**87. అవ :** పెరియతిరువన్దాది ప్రబంధంలోని గత మూడు పాశురాలలో ఆழ్వార్లు తమ మనస్సును ఉద్దేశించి, హితాన్ని ఉపదేశించారు. దానికి ఫలం వెంటనే చేజిక్కిన వైనాన్ని ఈ పాశురంనుండి మూడు పాశురాలలో ఆழ్వార్లు అనుగ్రహిస్తున్నారు. ఈ పాశురంలో భగవానుడు తన దివ్యమంగళవిగ్రహంతో తమ మనస్సులో ప్రవేశించి, వేంచేసి ఉండే రీతిని తెలుపుతున్నారు.

కల్లుమ్ కనైకడలుమ్ వైగున్ద వానాడుమ్,
పుల్లెన్ఱొழిన్దనకొల్? ఏ పావమ్, - వెల్ల
నెడియాన్ నిఱమ్ కరియాన్ ఉళ్ పుగున్దు నీజ్గాన్,
అడియేనదు ఉళ్ళత్తగమ్ 68వ.పా

మిక్కిలి ఉన్నతుడు, నీలమేఘవర్ణుడు అయిన స్వామి తన నిర్హేతుకకృపతో చాలా హీనుడనైన నా మనస్సులో ప్రవేశించి “ఇక ఈ చోటును విడిచి ఉండలేను” అని అక్కడ స్థిరనివాసాన్ని ఏర్పరచుకున్నాడు. అందువల్ల పూర్వం ఇతనికి ప్రియమైన వాసస్థానాలైన వేజ్గడమలై, క్షీరాబ్ధి, శ్రీవైకుంఠనగరం మొదలైనవి అన్నీ తృణ ప్రాయాలైనవి. అయ్యో! పాపం.

ఈ పాశురాన్ని రాత్రి పరుండేటపుడు పలు మార్లు అనుసంధించాలని పెద్దలంటారు. ఈ పాశురం శెఞ్జురుట్టిరాగంలో - రూపకతాళంలో రచింపబడింది.

**“అఙ్గుత్తై వాసమ్ ఇఙ్గుత్తై సాధ్యమ్”** ఇత్యాది శ్రీవచనభూషణచూర్ణిక దీనినిబట్టే రచింపబడింది. **“కల్లుమ్”** అని శిలను బోధించే శబ్దం ఇక్కడ లక్షణయా పర్వతవాచియై, పర్వతవిశేషం అయిన వేంకటాచలాన్ని తెలుపుతున్నది. తృణవాచి అయిన “పుల్” అనే పదం అల్పం అనే అర్థాన్నిస్తుంది. **“పని క్కడలిల్”, “తడ వరైవాయ్”** ఇత్యాది పెరియాழ్వార్ల పాశురభావాలు ప్రకృతంలో అనుసంధేయాలు.

ఇక, తిరువాయ్మొழిలోని ప్రత్యేకపాశురాలు విన్నపించబడుతున్నాయి.

**88. అవ :** పరమపదవాసులు భూలోకవాసులు సేవించే రీతిలో భగవానుడు అందఱికీ అనుభావ్యుడై శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉన్నాడు. ఏమి అతని సౌశీల్యం! ఏమి సౌలభ్యం! ఏమి వాత్సల్యం! ఏమి ఐశ్వర్యం!- అని అంటూ ఆழ్వార్లు ఇందులో విస్మితులవు తున్నారు.

**కణ్ణావాన్ ఎన్షుమ్, మణ్ణోర్ విణ్ణోర్క్కు,**
**తణ్ణార్ వేఙ్గడ, విణ్ణోర్ వెఱ్పనే** **1-9-3**

అజ్ఞానప్రదం అయిన ఈ భూలోకంలోని సంసారులకు, పరమపదంలో ఉండే నిత్యముక్తులకు నేత్రస్థానీయుడై, సదసత్పదార్థాను తెలియజేసి, సత్కార్యాలలో ప్రవృత్తిని కల్గజేసి, కాపాడే స్వామి- సుభగశీతలమైనది, పరమభోగ్యమైనది. వేంకటాచలం అనే ప్రసిద్ధిని పొందినది, నిత్యసూరిసంసేవ్యమై ఉండేది అయిన పర్వతంపైన వేంచేసి ఉండే పరముపురుషుడే.

ఈ పాశురం దేశీయరాగంలో - ఆదితాళంలో రచింపబడింది.

వేంకటేశ్వరుని ముల్లోకాలకు నేత్రస్థానీయునిగా పలికే **"కణ్ణా యేழுలక్కుమ్"** అనే తిరుమఙ్గైమన్నన్‌సూక్తికూడా వేంకటేశ్వరుని విషయంగానే రచింపబడడం విశేషం. సంస్కృతంలో కంటిని తెలిపే నయనశబ్దానికి నిర్వాహకుడనే అర్థం ఉన్నట్లే, అరవంలో కంటిని తెలిపి **"కణ్"** శబ్దానికికూడా ఆ అర్థం ఉండడం గమనార్హం. రక్ష్యాపేక్షను కల భగవానుని తాపాన్ని, రక్షకాపేక్షను కల జీవుని తాపాన్ని వేంకటాచలం తీరుస్తుంది కనుక – **"తణ్ణార్ వేఙ్గడమ్"** అని అనబడింది.

**89. అవ :** పూర్వపాశురంలో తమను విడచి వెళ్ళవద్దని స్వామిని ప్రార్థించిన ఆழ்్వార్లు ఇందులో "నన్ను విడచి వెళ్ళాలని అనుకున్నా నీకు వేఱే చోటు ఏదీ లేదు, సాధ్యమూ కాదు స్వామీ!"- అని అంటున్నారు.

**ఎన్దాయ్! తణ్ తిరువేఙ్గడత్తుళ్ నిన్ఱాయ్! ఇలఙ్గై శెఱ్ఱాయ్!, మరామరమ్**
**పైన్దాళ్ ఏళ్ ఉరువ ఒరు వాళి కోత్త విల్లా!,**
**కొన్దార్ తణ్ణన్దుழாయినాయ్ అముదే ఉన్నై ఎన్నుళ్ళే కుழைత్త ఎమ్**
**మైన్దా!, వానేఱే! ఇని ఎఙ్గు ప్పోగిన్ఱదే** **2-6-9**

ఆశ్రితుల తాపాలను అన్నిటినీ తీర్చే సుభగశీతలం అయిన వేంకటాచలంలో పరమభోగ్యుడవై వేంచేసి ఉండే స్వామీ ! పూర్వం శ్రీరాముడవై అవతరించి, సుగ్రీవునకు నమ్మిక కల్గడం కోసం విషమంగా ఉండే ఏడు మద్దిచెట్లలో చొచ్చుకొని పోయేటట్లు అపూర్వమైన బాణాన్ని నీ గొప్ప వింటిలో సంధించి ప్రయోగించి, ఆ చెట్లను, సప్తకులపర్వతాలను బేధించి, నీవు సాటి లేని మేటి విలుకాడవు - అనే నిజాన్ని అందఱికీ చాటి చెప్పినట్లే నాకును తెలియజెప్పావు. ఆకులతో నిండినవి, చల్లనివి, అందమైనవి, దివ్యపరిమళం నిండినవి అయిన తులసీమాలలు



అలంకరించుకొని నీ లోకాతిశయ సౌందర్యాన్ని దర్శింపజేశావు. శుద్ధసత్త్వమయం అయిన పరమపదంలో ఆనందైకార్ణవమైన తిరుమామణిమంటపంలో దివ్యదేవేరులచే, నిత్యముక్తులచే ఎంతో కుతూహలంతో అమృతంవలె అనుభవింపడే నీ భోగ్యతాతిశయాన్ని దర్శింపజేశావు. నిన్ను అమృతంవలె అనుభవించేటట్లు అనుగ్రహించావు. నిన్ను విడచి ఉండలేనట్లు నీతో ఒకే తత్త్వంగా అయేటట్లు నన్ను చేశావు. అందువల్ల నీకు ఒక నూతనమైన యౌవనశోభ కల్గింది. ఈ విధంగా ఉండే నీవు నన్ను విడచిపోతాను అని అన్నా పోయే వీలున్నదా! పోగల్గిన చోటు ఏదయినా ఒకటి ఉన్నదా!

ఈ పాశురంలో ఆరందభైరవి రాగం - ఆదితాళంలో కూర్పబడింది.

**90. అవ :** "నీవు నన్ను విడువవద్దు - నేను నిన్ను వీడిపోను" అని ఇందులో ఆழ்్వార్లు ప్రార్థిస్తున్నారు.

**పోగిన్ఱ కాలఙ్గళ్ పోయ కాలఙ్గళ్ పోగు కాలఙ్గళ్, తాయ్ తన్దై యుయి**
**రాగిన్ఱాయ్ ఉన్నై నాన్ అడైన్దేన్ విడువేనో?,**
**పోగిన్ఱ తొల్‌పుగழ் మూవులగుక్కుమ్ నాదనే! పరమా!, తణ్‌వేఙ్గడమ్**
**మేగిన్ఱాయ్! తణ్‌తుழாయ్ విరైనాఱు కణ్ణియనే!** **2-6-10**

ప్రసిద్ధిని కల్గినది, సహజసిద్ధాలైన అనంతకల్యాణగుణాలవల్ల కల్గినది అయిన కీర్తిని కలవాడా! మూడు లోకాలకు, మూడు విధాలుగా ఉండే చేతనాచేతనాలకు నిరుపాధికస్వామి అయినవాడా! నీతో సమానులు, నీకంటే అధికులు ఎవరూ లేనివాడవై, అద్వితీయమైన అధికారాన్ని చెలాయించే స్వామీ! సుభగమై, శీతలమైన శ్రీవేంకటాద్రిలో వేంచేసి ఉండేవాడా! చల్లనిదై, పరిశుద్ధమైనదై, అందమైనదై, దివ్యసౌగంధ్య భరితమైనదై ఉండే తులసీమాలను అలంకరించుకొని, పరమభోగ్యంగా సేవను అనుగ్రహించేవాడా! భూత-భవిష్యత్- వర్తమానాలనే అన్ని కాలాలోను తల్లివలె వాత్సల్యాన్ని చూపించే ప్రియపరుడవై, తండ్రివలె హితపరుడవై. ప్రాణంవలె సత్తను ధరించేవాడవై, సకల విధబంధుభూతుడవై ఉండే స్వామీ! నిన్ను దాసుడనైన నేను ఒక క్షణం కూడా విశ్లేషించి ఉండలేను. స్వామివైన నీకు, దాసుడనైన నాకు మధ్య ఉండే సంబంధాన్ని, నీవు చేసే మహోపకారాలను తెలిసిన తర్వాతకూడా నాపట్ల స్నేహంతో ఒకటిగా కలసిన ఉన్న నిన్ను విడువగలనా? ఏ నాటికీ విడువను.

విశే : ఈ పాశురం ఆనందభైరవి రాగం - ఆదితాళంలో రచింపబడింది.

**91. అవ:** "భగవానుడు మనలను ఏనాడు వీడిపోడు" అని ఇందులో అంటున్నారు.

**పఱ్పనాబన్ ఉయర్వఱ వుయరుమ్ పెరున్దిఱలోన్,**
**ఏఱ్పరన్ ఎన్నై యాక్కిక్కొణ్డు ఎనక్కే తన్నై తన్ద**
**కఱ్పగమ్, ఎన్ అముదమ్ కార్ముగిల్ పోలుమ్ వేఙ్గడనల్**
**వెఱ్పన్, విశుమ్బోర్ పిరాన్ ఎన్దై తామోదరనే** **2-7-11**

చతుర్ముఖబ్రహ్మకు ఉత్పత్తి స్థానం అయిన తామరపూవును తన నాభిలో కల్గి ఉండి, దానివల్ల అంతు లేని అందాన్ని కలవాడై, అందువల్ల అపరిమితం అయిన సాటి లేని మేటి తేజస్సును, శక్తిని కలవాడై, అసత్కల్పుణ్ణి అయిన నాకు సత్తను కల్గించి, తనకు రక్ష్యవస్తువుగా గ్రహించి తనను తప్ప వేఱు దేనినీ ఆశపడకుండా ఉండేటట్లుగా, అమృతంవలె పరమభోగ్యుడై తనను సేవించి అనుభవించేటట్లుగా నన్ను చేశాడు. కల్పవృక్షం అయితే- అర్థులు అడిగిన సకలమనోరథాలను ప్రసాదించడం మాత్రమే చేయగలదు. కాని, స్వామి అంతమాత్రమే కాకుండా తననుకూడా నాకు అనుగ్రహించిన అద్వితీయమైన, మహోదారమైన కల్పవృక్షం అయినాడు. కాలమేఘంవలె అంతు లేని ఔదార్యాన్ని కలవాడై, పరమరమణీయం అయిన వేంకటాద్రిలో వేంచేసి ఉన్నాడు. గొప్పవారైన నిత్యసూరులకు, నీచాతినీచుణ్ణి అయిన నాకూ మధ్య తేడా ఏమీ లేకుండా స్వామి అయ్యాడు. తల్లి అయిన యశోదాదేవికి చిన్న, ముడులు కల దారంతో కట్టుబడే రీతిలో పరమసులభుడై ఉండే నా స్వామి నా విషయంలో మితిలేని ప్రీతితో ఉన్నాడు. అతడు ఏనాడు మనలను విడవలేడు.

ఈ పాశురం కల్యాణిరాగం - రూపకతాళంలో కూర్పబడింది.

**92. అవ :** అర్జునునివంటివారు ఎవరో ఒకరు చేసే అనువర్తనాన్నిబట్టి శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అని నిశ్చయించాలా! అతని ఇష్టప్రకారంగాకదా ఈ జగత్తుయొక్క చేష్టలు అన్నీ ఉన్నాయి! అతని పరత్వాన్ని నిరూపించే హేతువుగా ఇదే చాలు కదా! – అని ఇందులో ఆఴ్వార్లు అంటున్నారు.

**కిడన్దిరున్దు నిన్ఱళన్దు కేఴలాయ్ కీఴ్పు**
**క్కిడన్దిడుమ్, తన్నుళ్, కరక్కు ముమిఴుమ్**
**తడ మ్పెరున్దోళార త్తఴువుమ్ పారెన్నుమ్**
**మడన్దైయై, మాల్ శెయ్‌కిన్ఱ మాల్ ఆర్ కాణ్బారే?** **2–8–7**



క్షీరాబ్ధిలో శయనించి, పరమపదంలో కూర్చుని, వేంకటాద్రిపై నిలచి, త్రివిక్రముడై భూమిని కొలిచి, వరాహమై ప్రళయప్రవాహం అట్టఅడుగుకు చేరిన భూమిని అండకటాహం నుండి ఉద్ధరించి – ఈ విధమైన కార్యాలను చేసేవాడై, తనలోనే ముల్లోకాలను మఱుగు పఱచేవాడై, మిక్కిలి గొప్ప బాహువులతో భూమిని ఆలింగనం చేసికొనేవాడై – ఈ రీతులలో భూమిప్పిరాట్టి విషయంలో భగవానుడు పడే వ్యామోహాన్ని ఎవరు తెలియగలరు? (భూమిని కొలవడం, ఉద్ధరించడం, గ్రహించడం – ఇవన్నీ స్వామి పరత్వసూచకాలని భావం).

**93. అవ :** భగవానుని అనుభవించి, ఆ అనుభవంచేత వృద్ధి అయ్యే ఆనందరసం లోపల ఇముడక పోవడంచేత ఆనందనృత్యం చేసే పరమభాగవతులను ఇందులో ఆఴ్వార్లు కీర్తిస్తున్నారు.

**వార్ పునలన్దణరువి వడ తిరువేఙ్గడత్తెన్దై,**
**పేర్ పల శొల్లి ప్పిదఱ్ఱి ప్పిత్తరెన్ఱే పిఱర్ కూఱ,**
**ఊర్‌పల పుక్కుమ్ పుగాదుమ్ ఉలోగర్ శిరిక్క నిన్ఱాడి,**
**ఆర్‌వమ్ పెరుగి క్కునిప్పార్ అమరర్ తొఴ ప్పడువారే** **3-5-8**

ఎల్లప్పుడూ ధారలు ధారలుగా ప్రవహించే నీటితో కూడినది, అందంగా, చల్లగా, పావనమై ఉండే కొండవాగులతో ఎంతో రమణీయంగా భాసించేది, ద్రావిడదేశానికి, ఉత్తరదేశానికి ఎల్లగా ఉండేది అయిన శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే వేంకటేశ్వరుని పలు తిరునామాలను నోరార సంకీర్తిస్తూ, "వీరు వట్టి పిచ్చివారు" అని ఇతరులు చెప్పేటట్లుగా, లోకంలోనివారు వీరిని గేలి చేసేటట్లుగా పలు ఊళ్ళలోకి పోయి, పోకుండా పరిభ్రమిస్తూ, భగవానునిపై గల భక్తి అతిశయించగా ఆడి పాడి, మనస్సు ద్రవించి, ఆనందబాష్పాలను విడిచి, నర్తించే పరమభాగవతోత్తములు నిత్యసూరులచే సేవింపబడతారు.

ఈ పాశురం నాదనామక్రియరాగం - ఆటతాళంలో రచింపబడింది.

**94. అవ :** ఆఴ్వార్లు భగవదనుభవంలో తమకు తోడుగా ఈలోకంలోని సంసారి చేతనులను ఆహ్వానించాలని అనుకున్నారు. కాని, వారు విషయాంతరాలలో ప్రావణ్యాన్ని కలవారై, భగవానుని కీర్తించకుండా ఇతరులను కీర్తిస్తూ ఉండడాన్ని చూచి, "అయ్యో! వీరు ఈ విధంగా అనర్థాన్ని పొందుతున్నారే" అనే బాధతో తమ ఆర్తిని మఱచి, "మీ కరణత్రయాన్ని భగవానునివిషయంలో వినియోగించండి"

అని ఈ దశకంలో ఉపదేశిస్తున్నారు. "శొన్నాల్ విరోదమ్" అనే తిరువాయ్‌మొ*ழ்*ి దశకంలో (3-9-1) మొదటి పాశురం ఇది. ఇందులో "నాచే కీర్తింపబడడంకోసం తిరుమలలో నిత్యవాసం చేసే మహోపకారకుని తప్ప వేఱెవ్వరినీ నేను స్తుతించను'' అనే తమ నిశ్చయాన్ని ఈ పాశురలంలో తెలుపుతున్నారు.

శొన్నాల్ విరోద మిదు ఆగిలుమ్ శొల్లువన్ కేణ్మినో,
ఎన్నావిలిన్ కవి యానొరువర్క్కుమ్ కొడుక్కిలేన్,
తెన్నా తెనా వెన్రు వణ్డు మురల్ తిరువేజ్గడత్తు,
ఎన్నానై ఎన్నప్పన్ ఎమ్బెరుమాన్ ఉళనాగవే 3-9-1

ప్రియమైన సంసారులారా! మీరు సామాన్య మానవులను స్వల్పప్రయోజనాలకోసం వారిపై కవిత్వం చెప్పి స్తుతిస్తున్నారు. మీ ఆ అలవాటును మీరు పోగొట్టుకోవడంకోసం నేనొక హితాన్ని చెబుతాను వినండి. అది మీ అభిమతానికి విరుద్ధం అయినా, హితబుద్ధితో దానిని ఆలకించండి. పూలలోని తేనెను బాగా తాగిన తుమ్మెదలు "తెన్నా తెన్నా" అని అంటూ గాయకులవలె పాడే పరమభోగ్యం అయిన తిరుమలలో నిత్యవాసం చేసేవాడు, నాకు ఉపకారకుడు, నాకు స్వామి అయిన భగవానుడు నా పాశురాలకు విషయభూతుడై ఉండగా, అతనికి అనన్యార్హశేషభూతుణ్ణి అయిన నేను నా నాలుకతో ఆ స్వామికి మధురం అయిన కవితను ఎవరికీ ఇచ్చే శక్తిని కలవాడను కాను. భగవానుని తప్ప ఇంకెవ్వరినీ స్తుతించను.

ఈ పాశురం శహనరాగం - ఆదితాళంలో రచింపబడింది.

**95. అవ :** శ్రీవేంకటేశ్వరుని ఉద్దేశించి పాడిన తిరువాయ్‌మొ*ழ்*ి ప్రబంధంలోని ఈ దశకాన్ని అభ్యసించేవారికి భగవదనుభవంలో ఎదురయే అవరోధాలైన పాపాలను పిరాట్టి పోగొట్టేటట్లు చేస్తుంది- అని అంటున్నారు.

మారి మాఱాద తణ్ణమ్మలై వేజ్గడత్తణ్ణలై,
వారి మాఱాద పూమ్బొ*ழ்*ిల్ శూ*ழ்* కురుగూర్ నగర్,
కారిమాఱన్ శడకోపన్ శొల్లాయిరత్తు ఇప్పత్తాల్,
వేరి మాఱాద పూమేలిరుప్పాళ్ వినై తీర్క్కుమే 4-5-11

వర్షం నిరంతరం కురుస్తున్నందున సకలతాపహరమై, అందంగా ఉండే వేంకటాచలంలో వేంచేసి ఉండే వాత్సల్యమూర్తి అయిన వేంకటేశ్వరస్వామిని



ఆశ్రయించి, జలసమృద్ధి ఏనాడు తగ్గని, పచ్చని పూలతోటలతో ఆవరింపబడి ఉన్న తిరుక్కురుకూర్ అనే గొప్ప నగరంలో వేంచేసి ఉన్న కారిసూనులు, మాఱన్ అనే తిరునామాన్ని కలవారు అయిన శఠకోపులు అనుగ్రహించిన ఈ దశకాన్ని అభ్యసించగల్గినవారి సకలపాపాలను, పరిమళం తగ్గని పద్మంపై వేంచేసి ఉండే కృపాస్వరూపిణి, పరమసుకుమారరూపిణి అయిన లక్ష్మీదేవి తీరుస్తుంది.

ఈ పాశురం తోడిరాగం - రూపకతాళంలో రచింపబడింది.

లోకంలో దానం ఇప్పించేవారి విషయంలో ఉండే ఆదరాతిశయంచేత వారిని దాతలుగా చెప్పే రీతిలోనే, ప్రకృతంలో భగవానునిద్వారా జీవుని కర్మబంధాన్ని తీరేటట్లుచేసే పిరాట్టిని **"వేఱి మాఱాద . . . . . వినై తీర్క్కుమ్"** అని అన్నారు - అని అభిజ్ఞ వివరణం.

**96. అవ :** నీ సకలలీలలను దర్శించాలని ఆర్తిని పొందిన నేను వాటిని స్మరించే శక్తిని అయినా కల్గినవాడను కాను. ప్రళయంలో జగత్తును రక్షించినట్లే నేను వాటిని అనుసంధించగలిగేటట్లు చేసి నన్ను రక్షించాలి - అని ఇందులో అంటున్నారు.

నిన్ఱ వాఱు మిరున్ద వాఱుమ్ కిడన్ద వాఱుమ్ నినైప్పరియన,
నిన్ఱలా పురువాయ్ అరువాయ నిన్ మాయజ్గళ్,
నిన్ఱు నిన్ఱు నైకిన్ఱేన్ ఉన్నై ఎజ్గనమ్ నినైకిఱ్పన్,
పావియేఱ్కొన్ఱు నన్గురైయాయ్ ఉలకముణ్డ ఒణ్శుడరే! 5-10-6

నీవు తిరుమలలో నిలచిన రీతిని, పరమపదంలో కూర్చున్న రీతిని, క్షీరాబ్ధిలో పరుండిన రీతిని భావించడం నాకు సాధ్యం కాకుండా ఉన్నది. పలు ప్రకారాలను కల్గినవి, నేత్రాలకు గోచరం కానివి అయిన నీ ఆశ్చర్యకరలీలలను అతికష్టంపైన ధ్యానిస్తున్నాను. స్వామీ! ఇక నిన్ను ఏవిధంగా ధ్యానించగలను! లోకాలను ఆరగించిన ఓ పరంజ్యోతిస్వరూపా! పాపిష్ఠివాడను. నేను నీ లీలలను భావించలేకున్నాను. వాటిని భావించి ఆనందించే ఉపాయాన్ని దేనినైనా నాకు చెప్పవయ్యా!

**97. అవ :** శ్రీవేంటేశ్వరునిగూర్చి అనుగ్రహించిన తిరువాయ్‌మొ*ழ்*ి ప్రబంధంలోని ఈ దశకంలో గల పాశురాలను అభ్యసించేవారు నిత్యసూరిభోగాన్ని అనుభవిస్తారు- అని అంటున్నారు.

**కట్టె*ழ்*ిల్ శోలై నల్‌వేజ్గడవాణనై,**
**కట్టె*ழ்*ిల్ తెన్ కురుగూర్ చ్చడకోపన్ శొల్,**

కట్టెృళిలాయిరత్తు ఇప్పత్తుమ్ వల్లవర్,
కట్టెృళిల్ వానవర్ పోగ ముణ్బారే 6-6-11

సుగంధభరితాలై ప్రకాశించే తోటలతో నిండినది, తనకు, తన భక్తులకు పరమభోగ్యమైనది అయిన శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామిని ఉద్దేశించి, (భగవత్కైంకర్య లక్ష్మితో ప్రకాశించే) భగవత్సంబంధం అనే కోటల అందాన్ని కల తిరునగరిలో అధివసించి ఉన్న నమ్మాళ్వార్లు అనుగ్రహించినది, ఆదినుండి అంతంవరకు అందంగా కూర్చబడి ఉన్నది అయిన వేయి పాశురాల తిరువాయ్మొళి ప్రబంధంలోని పరమరమణీయాలైన ఈ పది పాశురాలను అభ్యసించగలవారు పరమపదానికి విచ్చేసి, అత్యంతవిలక్షణం అయిన నిత్యసూరి భోగాన్ని పొందుతారు.

కాఫీరాగం, రూపకతాళంలో ఈ పాశురం రచింపబడింది.

**98. అవ :** ముక్తులు నావద్దకు వచ్చేటట్లుగా నేను వైకుంఠంలో ఉండవద్దా! దానిని వదలి వేటే చోట్లకు రావడం వీలు అవుతుందా! అని భగవానుని అభిప్రాయంగా భావించి దానికి సమాధానాన్ని ఇందులో ఆళ్వార్లు తెలుపుతున్నారు.

విణ్మీదిరుప్పాయ్! మలైమేల్ నిఱ్ఱాయ్! కడల్ శేర్ప్పాయ్!
మణ్మీదుళల్వాయ్! ఇవత్ఱుళెజ్గుమ్ మఱైన్దుఱైవాయ్!
ఎణ్మీదియన్ఱ పుఱవణ్ణత్తాయ్ ఎనదావి,
ఉణ్మీదాడి ఉరుక్కాట్టాదే ఒళిప్పాయో! 6-9-5

స్వామీ ! పరమపదంలో వేంచేసి ఉన్నవాడా ! పరమకృపతో పరమపదదాసులు, భూలోకవాసులు అందరూ సేవించేటట్లు రమణీయమైన వేంకటాద్రిలో వేంచేసి ఉన్నావు. ఆర్తుల ప్రార్థనలను ఆలకించడంకోసం పాలసముద్రంలో పవళించి ఉన్నావు.అందఱు నీ సౌందర్యసౌశీల్య సౌలభ్యాదిగుణాలను సేవించి తరించేటట్లు సకలమనుజనయన విషయతాంగతుడవై రామకృష్ణాదిరూపాలతో భూమిపై సంచరించావు. సకలచేతనుల లోపల ప్రవేశించి, అంతటా వ్యాపించి, వాటికి తెలియకుండా అంతర్యామిగా ఉన్నావు. ఇంతమాత్రమేనా! నాప్రాణానికికూడా ప్రాణభూతుడవై ఉన్నావు. ఈ విధంగా నాకు అత్యంతసామీప్యంలో నీవు వేంచేసి ఉన్నా నిన్ను నేను సేవించలేకుండా ఉన్నాను. ఇది స్వామివైన నీకు తగునా?

సావేరీరాగం - ఆదితాళంలో ఈ పాశురం కూర్పబడింది.



**99. అవ :** భగవానుని కర్మచక్షువులతో దర్శించాలని ఆశపడి, అది వీలు కాకపోవడం వల్ల, ఆర్తి అతిశయించిన ఆళ్వార్లు, ఈ దశకంలో భగవానుని దర్శించాలనే తమ ఆశను నాయకుని విశ్లేషించిన నాయకిపాశురంగా వ్యక్తీకరిస్తున్నారు.

నజ్గళ్ వరివళై యాయఙ్గాళో
నమ్ముడై యేదలర్ మున్బు నాణి,
నుజ్గట్కు యానొన్ఱురైక్కు మాత్ఱమ్
నోక్కుగిన్ఱేన్ ఎఙ్గుమ్ కాణమాట్టేన్,
శజ్గమ్ శరిన్దన శాయిళన్దేన్
తడములై పొన్నిఱమాయ్ త్తళర్న్దేన్,
వెజ్గణ్ పఱవైయిన్ పాగన్ ఎజ్గోన్
వేఙ్గడవాణనై వేణ్డిచ్చెన్ఱే 8-2-1

"నీ బాధకు కారణ మేమి? నీవు దేనిని ఆశపడుతున్నావు? నీవు ఆశపడే విషయాన్నిగూర్చి సంకోచించకుండా మాతో చెప్పు"అని అడినగిన సఖితో శఠకోపనాయకి ఈ పాశురంలో బదులిస్తున్నది.

నా ప్రాణసఖులారా! నేను ఈవిధంగా విరహంతో శరీరం కృశించి చేతులకు ధరించిన గాజులు జారిపోయే రీతిలో బాధపడుతూ ఉండగా, మీరు మాత్రం అందమైన గాజులను ధరించి సంతోషంగా ఉన్నారా! ఇది మీకు న్యాయమా ! నాయకునివద్దకు పోవాలని బయలుదేరిన నన్ను అడ్డుకొనే తల్లుల ముందు సిగ్గువల్ల బదులు చెప్పలేకుండా ఉన్నాను. అయినా, మీకు ఏమాటలతో సమాధానం చెప్పాలా- అని ఆలోచిస్తున్నాను. నాబాధను యథాతథంగా తెలుపడానికి తగిన పలుకులు నాకు కనపడడంలేదు. ఈ విషయాన్ని నేను నానోటితోనే చెప్పాలా ! కృశించిన నా శరీరాన్ని చూస్తే తెలియదా ! శత్రువులను క్రూరదృష్టితో చూచే గరుత్మంతుని అధిరోహించి వచ్చేవాడై, అందఱు తనను ఆశ్రయించేటట్లు పరమభోగ్యమైన శ్రీవేంకటాచలంలో సర్వసులభుడై వేంచేసి ఉండే భగవానుని ఒక క్షణకాలంకూడా విడువలేక, అతనిని సేవించలేనందువల్ల కల్గిన విరహవ్యథతో నాచేతులనుండి గాజులు జారిపోతున్నవి. నా దేహకాంతి తగ్గినది. నా స్తనాల శోభ తగ్గింది. నా శరీరం శిథిలమయినది.

ఈపాశురం శెఞ్జురుట్టిరాగం - ఆటతాళంలో రచింపబడింది.

**100. అవ :** పెంపుడు చిలుకలు మొదలైన లీలోపకరణాలవిషయంలో తనకు కల్గిన అనాదరాన్ని పరాంకుశనాయకి వాటితో చెబుతున్నది.

ఇడై యిల్లై యాన్ వళర్త్త కిళికాళ్
పూవైకళ్కాళ్ కుయిల్కాళ్ మయిల్కాళ్,
ఉడైయ నమ్మామైయుమ్ శఙ్గుమ్ నెఞ్జుమ్
ఒన్జు మొழியయ వొట్టాదు కొణ్డాన్,
అడైయుమ్ వైకున్దముమ్ పాఱ్కడలుమ్
అఞ్జన వెఱ్పు మవై నణియ,
కడైయఱ ప్పాశఙ్గళ్ విట్టపిన్నై యన్టి
అవనవై కాణ్ కొడానే 8-2-8

నేను పెంచిన పెంపుడు చిలుకలారా! చిన్న చిలుకలారా! కోయిలలారా! నెమలులారా! ఇక మీతో నాకే సంబంధం లేదు. నా సౌందర్యం, గాజులు, మనస్సు - వేటినీ కొంచెంకూడా మిగల్చకుండా స్వామి అపహరించాడు. సంసారం తీరిన తర్వాత చేరే వైకుంఠం, క్షీరాబ్ధి, వేంకటాద్రి నాకు అనుభవించడానికి సమీపంలో ఉన్నాయి. సంసారబంధాలు సవాసనగా విడిచిన తరువాత ఆ భగవానుడు వాటిని నాకు అనుగ్రహింప నిశ్చయించాడు. ఇక మీతో నాకే అక్కఱ లేదు. వెళ్ళిపొండి.

**101. అవ :** భగవానుని సేవించడంకోసం మీ మనస్సు వైకుంఠానికి పోవాలా ! అతడు పరమసులభుడుగా తిరుమలలో దగ్గరగానే ఉన్నాడు కదా! అనే ప్రశ్నకు ఆழ்వార్లు ఇందులో బదులు పల్కుతున్నారు.

**ఇన్టిప్పోగ ఇరు వినైయుమ్ కెడుత్తు,**
**ఒన్టి యాక్కై పుగామై ఉయ్యక్కొళ్వాన్,**
**నిన్ఱ వేఙ్గడమ్ నీణిలత్తుళ్ళదు,**
**శెన్టు తేవర్గళ్ కైతొழுవార్గళే** **9-3-8**

తన భక్తుల పుణ్యపాపాలు అనే ద్వివిధకర్మలను నిశ్శేషంగా, తిరిగి చేరకుండా ఉండేటట్లుగా నాశనం చేసి, వారికి శరీరసంబంధాన్ని సవాసనగా పోగొట్టి, వారు శరీరంలో తిరిగి ప్రవేశించకుండా ఉండేటట్లు ఉజ్జీవింపజేసి, అందఱిని కలుపుకొని పోయి తన లోకానికి చేర్చి, వారితో కలసి ఆనందం అనుభవించాలనే ఆశతో, అందఱు వచ్చి తనను ఆశ్రయించడానికి వీలుగా సర్వస్వదానాన్ని చేస్తూ భగవానుడు



వేంచేసి ఉండే చోటు అయిన శ్రీవేంకటాచలం -మహోన్నతమై, పరమశ్లాఘ్యం అయిన ఈ భూమిలో ఉన్నది. ఇది నిజం. అయితే దీనివల్ల నాకు ఏమి ప్రయోజనం? అక్కడికి పోయి అతనికి కైంకర్యం చేసేవారు నిత్యసూరులేకదా! అక్కడికి నేను పోగల్గినవాడనా?

ఈ పాశురం కేదారరాగం - రూపకతాళంలో ఉన్నది.

**102. అవ :** నా మనస్సులో ఉండే భగవానుని అక్కడనుండి ఎవరివల్ల దూరం చేయడానికి సాధ్యం కాదని నిశ్చయించుకొని, అందువల్ల కృతకృత్యుణ్ణి అయ్యాను- అని అంటున్నారు.

తలైమేల్ పునైన్దేన్ శరణఙ్గళ్, ఆలిన్
ఇలైమేల్ తుయిన్ఱాన్ ఇమైయోర్ వణఙ్గ,
మలైమేల్ తాన్ నిన్టు ఎన్ మనత్తుళిరున్దానై,
నిలైపేర్క్కలాకామై నిచ్చిత్తిరున్దేనే **10-4-4**

స్వామి శ్రీచరణాలను నా తలపై ధరించాను. వటపత్రంపై నిద్రించేవాడు, నిత్యసూరులు ఆశ్రయించేటట్లు వేంకటాద్రిపై నిలచి ఉండి, నా మనస్సులో నిత్యవాసం చేసేవాడు అయిన భగవానుడు నా మనస్సునుండి ఏవిధంగాను వీడిపోని స్థైర్యాన్ని కలవాడని నిశ్చయించుకొని, కృతార్థుణ్ణి అయ్యాను.

"నిచ్చిత్తిరున్దేన్" - "న బిభేతి" - అని ఉన్నాను - అని నమ్పిళ్ళై వ్యాఖ్య. "పనిక్కడలిల్" - ఇత్యాది సూక్తుల భావాలు స్మరణీయాలు.

**103. అవ :** భగవానుని కన్నులార దర్శించగల్గినపుడేకదా అతని పాదారవిందాలకు సేవ చేయవచ్చును? - అని అంటే దానికి ఇందులో బదులు పల్కుతున్నారు.

**మేయాన్ వేఙ్గడమ్, కాయామలర్ వణ్ణన్,**
**పేయార్ ములై యుణ్డ, వాయాన్ మాదవనే** **10-5-6**

అగిసెపూవు రంగువంటి నల్లని వర్ణాన్ని కలవాడు, "క్షణకాలం కూడా విడిచి ఉండలేను". అని పలికే అలర్మేల్మఙ్గై నితత్యనివాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడు, పూతన అనే పిశాచిస్తన్యాన్ని గ్రోలినవాడు అయిన శ్రీకృష్ణుడు అందఱు తన శ్రీపాదాలను సేవించి, ఉజ్జీవించాలనే భావనతో సర్వసులభుడై తిరుమలలో వేంచేసి ఉన్నాడు. అందువల్ల ఆస్వామి శ్రీచరణాలలో సుఖంగా కైంకర్యాన్ని చేసి, ఉజ్జీవించవచ్చు.

వసంతరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం కూర్చబడింది.

**104. అవ :** భగవానుడు అత్యంతాదరంతో వేంచేసి ఉండే స్థానాలను తెలుపుతూ ఆఴ్వార్లు తమకు కల్గిన మహాభాగ్యాన్ని అభివర్ణిస్తున్నారు.

**తిరుమాలిఞ్జోలైమలైయే తిరుప్పాఱ్కడలే ఎన్ తలైయే,**
**తిరుమాల్ వైగున్దమే తణ్ తిరువేఙ్గడమే ఎనదుడలే,**
**అరుమామాయత్తు ఎనదుయిరే మనమే వాక్కే కరుమమే,**
**ఒరుమానొడియుమ్ పిరియాన్ ఎన్ ఊఴిముదల్వనొరువనే** **10-7-8**

సృష్టిని నిర్వహించే బ్రహ్మ మొదలైన దేవతలను అందఱిని సృష్టించిన భగవానుడైన శ్రీమన్నారాయణుడు తిరుమాలిరుమ్‌శోలైమలైను, క్షీరాబ్ధిని విడచి ఉండనట్లే నా శిరస్సునుకూడా ఒకక్షణంకూడా విడువడం లేదు. తాను లక్ష్మీదేవి మొదలైనవారితో కలసి వేంచేసి ఉండే వైకుంఠాన్ని, సంసారతాపాన్ని పోగొట్టే చల్లని వేంకటాచలాన్ని వీడకుండా ఉండేటట్లే నా శరీరాన్ని క్షణంకూడా విడువడం లేదు. తిలతైలవత్, దారువహ్నివత్ విడదీసి చూడడానికి వీలు కాని ప్రకృతిమండలంలో పడి పరిభ్రమిస్తున్న నా ప్రాణాలను, మనస్సును, వాక్కును, నేను చేసే పనులను ఒక క్షణం కూడ విడిచి ఉండడంలేదు. ఆహా! నా విషయంలో భగవానునకు ఎంత ప్రీతి! ఎంత అనురాగం! నేనెంత ధన్యుణ్ణి! ఇక నాకు సరి లేరు.

ధన్యాసిరాగం - ఆదితాళంలో ఈ పాశురం రచింపబడింది.

# కులశేఖరాఴ్వార్లు

కుంభే పునర్వసౌ జాతం కేరళే చోళపత్తనే ।
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే ॥

చేరదేశానికి చెందిన (కేరళరాష్ట్రంలోని) **"తిరువఞ్జిక్కళమ్"** అనే దివ్యదేశంలో క్షత్రియకులంలో కలియుగం ప్రారంభమైన 27 సం॥ల తరువాత పరాభవనామ సం॥లో కుంభమాసం - శుద్ధఏకాదశి - గురువారం - పునర్వసు నక్షత్రంలో కౌస్తుభమణి అంశతో కులశేఖరులు అవతరించారు. వీరు గొప్ప పరాక్రమశాలి, పరిపాలనాదక్షులే కాక, పరమభాగవతోత్తములుకూడా. భగవానుని నిర్హేతుక కటాక్షంవల్ల దివ్యజ్ఞానాన్ని పొందిన వీరు లౌకికసంపదను, రాజ్యాధికారాన్ని తృణ ప్రాయంగా తలచి, భగవత్సేవకు అనుకూలం అయిన వేంకటాద్రిపై స్థావరాది



జన్మలైనా తమకు పరమోపాదేయం అని భావించారు. శ్రీరంగనాథుని భక్తులైన వీరు ప్రతిదినం శ్రీరంగయాత్రకు పోవాలని ప్రయత్నించేవారనే విషయం **"ఘుష్యతే యస్య నగరే రంగయాత్రా దినే దినే, త మహం శిరసా వందే రాజానం కులశేఖరమ్"** అనే వీరి తమ ముకుందమాలా స్తోత్రం లోని ప్రార్థనాశ్లోకంవల్ల తెలుస్తుంది. శ్రీరామచంద్రుని విషయంలో, శ్రీరంగనాథుని విషయంలో వీరికి కల వ్యామోహం అధికం. అందువలననే వీరు తమ ప్రబంధ ప్రారంభంలో శ్రీరంగనాథుని, చివరగా రామాయణగాథను కీర్తించారు. శ్రీవైష్ణవ సంప్రదాయంలో వీరికి **"పెరుమాళ్"** అని వ్యవహారం. కాబట్టి 105 పాశురాలను కల వీరి ప్రబంధంకూడా **"పెరుమాళ్ తిరుమొఴి"** అని వ్యవహరింపబడుతున్నది **"తిరుమొఴి"** అంటే సూక్తి.

## పెరుమాళ్ తిరుమొఴి

శ్రీకులశేఖరాఴ్వార్లు లౌకికవిషయాలలో విరక్తులు. భగవద్భాగవత విషయంలో అత్యంతప్రావణ్యాన్ని కలవారు. వారికి భగవానుని కల్యాణగుణాలలో గల ప్రావణ్య ప్రకర్షంచేత పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులు తల ఎత్తి భగవానుని శీఘ్రంగా సేవించాలనే ఆశ మితిమీరింది. పరమపదంలోనికి పోయి అనుభవించాలంటే, ఈ శరీరం పతనం చెందేవరకు వేచి ఉండాలి. అంత కాలం సహించి ఉండడం ఆఴ్వార్లకు సాధ్యం కాలేదు. భగవానుడు దీనిని చూచి, "నేను శ్రీవేంకటాచలంలో అందఱికీ సులభుడనై, సేవను అనుగ్రహిస్తూ వేంచేసి ఉన్నాను. మీరుకూడా అక్కడికి వచ్చి చేతులారా నమస్కరించి, ఆనందించవచ్చు''- అని నియమించాడు. ఆ సౌలభ్యాన్ని చూచి ఆశ్చర్యపడినవారై వేంకటేశ్వరుని శ్రీపాదాలలో వాలి, తాము ఆశపడే పలు కైంకర్యాల ప్రకారాలను కులశేఖరులు విన్నపిస్తున్నారు.

**105. అవ :** మొదటి ఈపాశురంలో అరుదైన మానవజన్మ, అందులోను భోగ భాగ్యా లను కల, అనుభవానికి యోగ్యం అయిన క్షత్రియజన్మ సైతం నాకు వద్దు. నీ కైంకర్యానికి తగిన పక్షిజన్మను పొందినా చాలు- అని అంటున్నారు.

**ఊనేఱు శెల్వత్తు ఉడల్ పిఱవి యాన్ వేణ్డేన్,**
**ఆనేఱేఴ్ వెన్ఱాన్ అడిమైత్తిఱమల్లాల్,**
**కూనేఱు శఙ్గ మిడత్తాన్ఱన్ వేఙ్గడత్తు,**
**కోనేరి వాఴుమ్ కురుగాయ్ ప్పిఱప్పేనే** **4-1**

భగవానుడు శేషి అని, నేను ఆ స్వామి దాసుడననే వివేకం భగవద్భాగవతానుగ్రహం చేత నాకు కల్గింది. అందువల్ల దినదినానికీ వృద్ధి చెంది, భౌతికభోగాలను కల్గించే

మానవజన్మను, స్థిరం కాని రాజభోగాలను నేను కోరను. నప్పిన్నైప్పిరాట్టికోసం బలిసిన ఏడు ఎద్దులను జయించిన శ్రీవేంకటేశ్వరుని శ్రీపాదాలలో నిత్యకైంకర్యానికి తగినది అయినట్లయితే, అతడు వేంచేసి ఉండే తిరుమలలోని స్వామిపుష్కరిణిలో ఒక నీటికొంగగా అయినా జన్మించి నేను ఉజ్జీవిస్తే చాలు.

**"కూనేఱు శఙ్గమ్"** - ప్రణవాకారాన్ని కల పాంచజన్యంద్వారా స్వామి శేషత్వజ్ఞానాదులను అనుగ్రహిస్తాడనే భావం ఇక్కడ తోస్తుంది. భగవత్సంబంధం లేని మానవ జన్మకంటే ఆ సంబంధాన్ని కల పక్షిజన్మ మేలు - అని పాశురసారం. ఇదే భావాన్ని భాగవతవిషయంగా ఆళవన్దార్- **"తవ దాస్య"** ఇత్యాది శ్లోకంలో అనుసంధించారు.

ఈ దశకంలోని పాశురాలన్నీ ధన్యాసిరాగం, త్రిపుటతాళంలో రచింపబడ్డాయి.

**106. అవ :** స్వర్గాదిభోగాలు లభిస్తే మీరు ఏం చేస్తారు? అని అంటే, వాటినికూడా నేను అభిలషించను- అని ఇందులో ఆళ్వార్లు అంటున్నారు.

**ఆనాద శెల్వత్తు అరమ్బైయర్గళ్తమ్ శూழ,**
**వానాళుమ్ శెల్వముమ్ మణ్ణరశుమ్ యాన్ వేణ్డేన్,**
**తేనార్ పూఞ్జోలై త్తిరువేఙ్గడ చ్చునైయిల్,**
**మీనాయ్ ప్పిఱక్కుమ్ విదియుడైయే నావేనే** **4-2**

నిత్యయౌవనవతులైన రంభాద్యప్సరసలను అనుభవించే స్వర్గాది భోగాలను, భూమిని పరిపాలించే ఐశ్వర్యాన్ని సైతం నేను కొంచెం కూడా ఆశపడను. తేనె నిండిన పూలను కల నందనవనాలతో పరివేష్టితం అయిన తిరుమలలో ఉండే కొండవాగులలో ఒక చేపగా అయినా పుడితే చాలు.

**107. అవ :** పూర్వం వద్దన్న మానవజన్మ భగవచ్చేషత్వానుకూలం అయితే అపుడు దానిని కూడా నేను కావాలని ఆశపడతాను- అని ఆழ்వార్లు అంటున్నారు.

**పిన్నిట్టశడై యానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,**
**తున్నిట్టు పుగలరియ వైగున్ద నీళ్ వాశల్,**
**మిన్ వట్టచ్చుడరాழி వేఙ్గడక్కోన్ తానుమిழுమ్,**
**పొన్వట్టిల్ పిడిత్తు ఉడనే పుగప్పెఱువే నావేనే** **4-3**

చాలా గొప్పతనాన్ని కల బ్రహ్మరుద్రమహేంద్రాదులుసైతం లోపలకు ప్రవేశించలేక గుంపులుగా కిక్కిరిసి ఉండగా, భూలోకవైకుంఠం అయిన శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో అతడు ఉమిసే బంగారు పడిగాన్ని ఎత్తి పట్టుకొని, ఆస్వామి



వెంటనే పోయే భాగ్యాన్ని కలవాడను నేను కావాలి. ఆ అదృష్టం కలిగే పక్షంలో మానవజన్మనుకూడా నేను ఆశపడతాను.

**"...... వరవేత్రహతోత్తమాంగాః", "బ్రహ్మాదయ స్సురవరాః .... ధామాంతికే తవ హి మంగళవస్తుహస్తాః, తిష్ఠంతి"** ఇత్యాది శ్రీ వేంకటేశసుప్రభాతస్తోత్ర సూక్తుల భావాలు భావ్యాలు.

**108. అవ :** మానవజన్మ అనేది అహంకారాన్ని కల్గించే రాచపుట్టుక మొదలైన వానికి కూడా కారణం. అందువల్ల అది వద్దు. శ్రీవేంకటేశ్వరుని కటాక్షానికి పాత్రం అయేటట్లు తిరుమలలో ఒక చెట్టుగా జన్మించినా నాకు చాలు- అని ఆழ்వార్లు ఇందులో అంటున్నారు.

**ఒణ్ పవళవేలై ఉలవుతన్ పాఱ్కడలుళ్,**
**కణ్ తుయిలుమ్ మాయోన్ కழలిణైగళ్ కాణ్బదఱ్కు,**
**పణ్ పగరుమ్ వణ్డినఙ్గళ్ పణ్ పాడుమ్ వేఙ్గడత్తు,**
**శెణ్బగమాయ్ నిఱ్కుమ్ తిరువుడైయే నావేనే** **4-4**

పగడాలను, ముత్యాలను తీరాలకు కొనివచ్చే గొప్ప అలలతో కూడి ఉండే పాలసముద్రంలో శయనించి ఉన్న, ఆశ్చర్యగుణ చేష్టితుడైన శ్రీవేంకటేశ్వరుని శ్రీపాదాలను సేవించడంకోసం మానవులతో తేడా లేకుండా తుమ్మెదల గుంపులుకూడా సంగీతాన్ని పాడే తిరుమలలో ఒక సంపెంగ చెట్టుగా అయినా నిలువదగిన భాగ్యాన్ని పొందినవాడను కావాలి.

విభవాలకు అన్నిటికీ పాలకడలిలోని వ్యూహరూపం మూలం అయినట్లే, అర్చారూపాలకు కూడా అదే మూలం అని, క్షీరాబ్ధిలోని స్వామి, వేంకటేశ్వరుడు ఒక్కడే అని ఇక్కడి భావం. ఇది వ్యూహ రూప - అర్చారూపాల ధర్మైక్యం.

**109. అవ :** సంపెంగ చెట్టు అయితే పరిమళంకోసం దానిని కొంతమంది తమ ఇళ్ళ లోనికి తీసికొనిపోయి నాటుకోవచ్చు. తమ స్వతం చేసికోవచ్చు. అపుడు అది ప్రయో జనాంతరానికి అనుకూలం అవుతుంది- అని భావించి, అటువంటి అవకాశం ఏదీ లేని ఒక ముళ్ళపొదగా అయినా వేంకటాద్రిపై ఉంటాను - అని కులశేఖరులు అంటున్నారు.

**కమ్బమదయానై క్కழுత్తగత్తిన్ మేలిరున్దు,**
**ఇన్బమరుమ్ శెల్వముమ్ ఇవ్వరశుమ్ యాన్ వేణ్డేన్,**
**ఎమ్బెరుమాన్ ఈశన్ ఎழிల్ వేఙ్గడమలైమేల్,**
**తమ్బగమాయ్ నిఱ్కుమ్ తవముడైయే నావేనే** **4-5**

చూచినవారు అందఱు భయపడేటట్లుగా భయంకరమై, మదాన్ని కల గజాలపై రాజాధిరాజు అనే అతిశయం తోచేటట్లు వేంచేసి ఉండి, సకలభోగాలను అనుభవించ దగిన గొప్ప సంపదను, రాజ్యపరిపాలనా భాగ్యాన్ని సైతం నేను కోఱను. పరమోప కారకుడైన భగవానుని అందమైన తిరుమలపై ఒక పొదగా నిలచి ఉండే భాగ్యాన్ని కలవాడనైతే ధన్యుణ్ణి అవుతాను. ఈ భాగ్యాన్ని పొందడం అనేక జన్మలలో ఆర్జించిన తపస్సువల్ల కదా ఫలిస్తుంది.

భగవత్సంబంధానికి అడ్డుగా ఉన్నవి అన్నీ త్యాజ్యాలే. భగవత్సంబంధం ఒక్కటే ఉపాదేయం – అని దీని సారం.

**110. అవ :** తాము కొండపై స్థావరం అయితే ఏదో ఒకనాడు లేకుండా పోవచ్చును కదా! అపుడు తమకు భగవత్సంబంధం లేకుండా పోతుంది. ఆ విధంగా కాకుండా, స్థిరంగా తిరుమలలోని ఒక దేశంగా తాము కావాలి - అని ఇందులో కులశేఖరులు ఆశపడు తున్నారు.

మిన్ననైయ నుణ్ణిడైయార్ ఉరుప్పశియుమ్ మేనగైయుమ్,
అన్నవర్దమ్ పాడలొడుమ్ ఆడలవై ఆదరియేన్,
తెన్న వెన వణ్డినజ్గళ్ పణ్ పాడుమ్ వేజ్గడత్తుళ్,
అన్ననైయ పొఱ్కువడామ్ అరున్దవత్త నావేనే **4-6**

మెఱపు తీగలవలె సన్నని నడుమును కలవారై, సౌందర్యరాశులైన ఊర్వశి, మేనక మొదలైన దివ్యస్త్రీలవంటి తరుణీమణుల దివ్యనర్తనాదులను ఏనాడు నేను అభిలషించను. తుమ్మెద గుంపులు పూవులలోని తేనెను పానం చేసి, సంతోషాతిరేకంతో **"తెన్నా"** అని స్వరయుక్తంగా పాడే వేంకటాద్రిపై ఉండే స్వామి బంగారు కొండమీద ఒక ప్రదేశంగా నిలచే అరుదైన తపస్సును కలవాడను కావాలి.

**111. అవ :** తిరుమలలో ఒక ప్రదేశం అయితే అక్కడికి ఎక్క గల్గినవారు దానిని అనుభవించగలరు. లేనివారు దానిని కోల్పోతారుకదా! ఆవిధంగా కాకుండా అందఱికీ అనుభవయోగ్యంగా ఉండే అడవి వాగుగా కావాలి- అని ఇందులో కులశేఖరులు ఆశపడుతున్నారు.

వానాళుమ్ మా మదిపోల్ వెణ్ కుడైక్కీ*ౝ్* మన్నవర్దమ్,
కోనాగి వీ*ఱ్ఱి*రున్దు కొణ్డాడుమ్ శెల్వఱియేన్,
తేనార్ పూఞ్జోలై త్తిరువేజ్గడమలైమేల్,
కానాఱాయ్ ప్పాయుమ్ కరుత్తుడైయ నావేనే **4-7**



విశాలమైన ఆకాశాన్ని అంతటినీ తన విహారస్థానంగా చేసికొని సంచరిస్తూ ప్రకాశించే చంద్రునివలె లోకం అంతా వ్యాపించి తన శ్వేతచ్ఛత్రం నీడలో వేంచేసి ఉండే రాజాధిరాజుగా వెలిగే గొప్ప ఐశ్వర్యాన్నికూడా నేను ఏనాడూ ఒక వస్తువుగా తలచను. తేనె నిండిన పూలతో అందంగా ఉండే ఉద్యానవనాలను కల వేంకటాచలంలో ఒక అడవి ఏరుగా ప్రవహించే భాగ్యాన్ని నేను పొందాలి.

**112. అవ :** అడవిలో ఏదో ఒక మూల ఏరుగా ప్రవహిస్తే ప్రయోజనం లేదు. ఎల్లప్పుడూ శ్రీవైష్ణవుల పాదరేణువులు పడే దారిగా ఉండే స్థితిని నేను పొందాలి- అని ఇందులో ఆ*ౝ్వా*ర్లు ఆశపడుతున్నారు.

పిఱై యేఱు శడైయానుమ్ పిరమనుమ్ ఇన్దిరనుమ్,
ముఱైయాయ పెరువేళ్వి క్కుఱై ముడిప్పాన్ మఱైయానాన్,
వెఱియార్ తణ్ శోలై త్తిరువేజ్గడమలైమేల్,
నెఱియాయ్ క్కిడక్కుమ్ నిలైయుడైయే నావేనే, **4-8**

బాలచంద్రుణ్ణి జటలలో ధరించిన హరునకు, బ్రహ్మకు, దేవలోకాధిపతి అయిన ఇంద్రునకు, వారి వారి అధికారానుగుణంగా చేసే యజ్ఞాలకు ఫలంగా వారి అధికారా లను ఇచ్చేవాడై, బ్రహ్మాదులకు ఆశ్రయణీయుడని వేదాలచేత స్తుతింపబడే వాడైన సర్వేశ్వరుడు వేంచేసి ఉండే, పరిమళం నిండిన, చల్లగా ఉండే దివ్యారామాలచేత పరివేష్టితమైన తిరుమలలో ఎల్లప్పుడూ శ్రీవైష్ణవుల శ్రీపాదరేణువు పడేటట్లుగా దారిగా ఉండే స్థితిని కలవాడను కావాలి.

**113. అవ :** ఒక మార్గంగా ఉన్నట్లయితే భగవానుని దివ్యమంగళవిగ్రహాన్ని సదా సేవించే భాగ్యం లేకుండా పోతుంది. అందువల్ల భాగవతులు, దేవతలు సంచరించేటట్లు సన్నిధిలో ఒక మెట్టుగా పడిఉండే భాగ్యాన్ని కలవాడను కావాలి- అని ఇందులో ఆ*ౝ్వా*ర్లు ఆశపడుతున్నారు.

శెడియాయ వల్వినైగళ్ తీర్క్కుమ్ తిరుమాలే!,
నెడియానే! వేజ్గడవా! నిన్కోయిలిన్ వాశల్,
అడియారుమ్ వానవరుమ్ అరమ్బైయరుమ్ కిడన్దియజ్గుమ్,
పడియాయ్ క్కిడన్దు ఉన్ పవళవాయ్ కాణ్బేనే, **4-9**

అనాదికాలంగా ఆర్జించిన పాపాలను, తత్సంబంధాలను ఛేదించి తీర్చేవాడవై, తిరుమలలో వేంచేసి ఉండే శ్రియఃపతీ! నీ భక్తులు, దేవతలు, దేవకన్యకలు కలిసి సంచరించేటట్లు నీ దివ్యసన్నిధి వాకిటిలో అందఱూ కాలితో తొక్కే గడపగా పడి

ఉండి, పగడంవంటి పరమభోగ్యం అయిన నీ అధరోష్ఠాన్ని ఎల్లప్పుడూ సేవించే భాగ్యాన్ని కలవాడనుకావాలి.

ఈ పాశురంవల్లనే తిరుమలలోని స్వామిగర్భాలయంలోని గడపకు సంప్రదాయంలో **"కులశేఖరప్పడి"** – అనే పేరు వచ్చింది.

**114. అవ** : ముందు పాశురంలో గడపగా ఉండాలని అపేక్షించడానికి కారణం భగవానుని దివ్యాధరదర్శనం కోసమేకదా! అది లభించనట్లయితే ఆ జన్మకూడా వద్దు. నీ దివ్యావయవసౌందర్యాన్ని సేవించే భాగ్యాన్ని కల ఏ వస్తువుగా అయినా చాలు. ఆ విధంగా అనుగ్రహించు - అని ఇందులో కులశేఖరులు ప్రార్థిస్తున్నారు.

**ఉమ్బరులకు ఆణ్డు ఒరు కుడైక్కీ*ఝ్* ఉరుప్పశిదన్,**
**అమ్బొఱ్కలైయల్కుల్ పెఱ్ఱాలుమ్ ఆదరియేన్,**
**శెమ్బవళవాయాన్ తిరువేఙ్గడ మెన్నుమ్,**
**ఎమ్బెరుమాన్ పొన్ మలైమేల్ ఏదేను మావేనే** **4-10**

సకలలోకాలను ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలిస్తూ, ఊర్వశి మొదలైన సుందరీ మణులతో దివ్యభోగాలను అనుభవించాలని నేను ఎంతమాత్రం ఆశపడను. ఎఱ్ఱని పగడంవంటి అందమైన మోవిని కల నా స్వామి వేంచేసి ఉండే తిరుమల అనే పేరుతో ప్రసిద్ధం అయిన బంగారు కొండపై ఏదైనా ఒక వస్తువుగా ఉండే భాగ్యం నాకు కలగాలి.

**"ఏదేను మావేనే"** – అంటే చివరికి వేంకటేశ్వరుడుగాకూడా అవుతాను అని భావం – అని అనన్దాఴ్వాన్ నిర్వాహం. అంటే, "రక్ష్యరక్షకభావం తారుమారు అయినా సరే–" అని తాత్పర్యం.

**115. అవ** : ఈ దశకాన్ని అనుసంధించినవారికి కలిగే ఫలాన్ని ఇందులో ఆఴ్వార్లు తెలుపుతున్నారు.

**మన్నియ తణ్ శారల్ వడవేఙ్గడత్తాన్దన్,**
**పొన్నియలుమ్ శేవడిగళ్ కాణ్బాన్ పురిన్దిఱైఞ్జి,**
**కొన్నవిలుమ్ కూర్వేల్ కులశేకరన్ శొన్న,**
**పన్నియ నూల్ తమి*ఝ్*వల్లార్ పాఙ్గాయ పత్తర్కళే** **4-11**

బాహ్యశత్రువులను, అంతఃశత్రువులను నిర్మూలించే నిశితమైన వేలాయుధాన్ని భూషణంగా కల ప్రపన్నశిఖామణి అయిన శ్రీకులశేఖరప్పెరుమాళ్ చల్లని సానువులను (కొండచరియలను) కల, ఉత్తర తిరుమలగా పేరు పొందిన వేంకటాద్రిలో వేంచేసి ఉండే స్వామి యొక్క బంగారువంటి శ్రీచరణారవిందాలను సేవించాలని ఆశపడి, శిరసా నమస్కరించి, అనుగ్రహించిన మధురమైన ఈ పాశురాలను అనుసంధానం చేయగల వారు స్వామి మనస్సుకు ఇష్టులైన భక్తశిఖామణులు కాగలరు.



## పెరియాఴ్వార్లు

మిథునే స్వాతిజం విష్ణో రథాంశం ధన్వినః పురే ।
ప్రపద్యే శ్వశురం విష్ణోః విష్ణుచిత్తం పురశ్శిఖమ్ ॥

పెరియాఴ్వార్లు పాండ్యదేశంలోని **"శ్రీవిల్లిపుత్తూర్"** అనే దివ్యదేశంలో క్రోధన నామ సంవత్సరం మిథునమాసం శుక్ల ఏకాదశీతిథిలో ఆదివారం స్వాతీనక్షత్రంలో గరుడుని అంశతో బ్రాహ్మణకులంలో అవతరించారు. భట్టనాథులు, విష్ణుచిత్తులు, పట్టర్పిరాన్ అనేవి వీరి ఇతర నామాలు. **"పీతకవాడై పిరానార్ పిరమకురువాకి వన్దు"** అనే వీరి సూక్తివల్ల వీరు గురుముఖంగా శాస్త్రాధ్యయనం చేయలేదని, భగవానుని దివ్యానుగ్రహంవల్లనే వీరు సకలశాస్త్రపారంగతులైనారని తెలుస్తున్నది. ఆపస్తంబధర్మ సూత్రాలకు ధూర్తస్వామి రచించిన వృత్తిపై వీరు వ్యాఖ్యను అనుగ్రహించారనికూడా పెద్దలు చెబుతారు. వీరు తిరుప్పల్లాణ్డు అనే నిత్యానుసంధేయం అయిన 12 పాశురాలను కల ప్రబంధాన్ని, 429 పాశురాలను కల పెరియాఴ్వార్ తిరుమొఝి ప్రబంధాన్ని అనుగ్రహించారు. ఇవి రెండు నాలాయిర దివ్య ప్రబంధ వాఙ్మయంలోని **"ముదలాయిరమ్"** అనే మొదటి సహస్రంలో కూర్చబడ్డాయి.

శ్రీపెరియాఴ్వార్లు భగవానుని ఆజ్ఞను శిరసావహించి, పాండ్యరాజు అయిన శ్రీవల్లభదేవుని సభకు వెళ్ళి, తమకు భగవదనుగ్రహంవల్ల కల్గిన విశుద్ధజ్ఞానంతో వాదించి, శ్రీమన్నారాయణుడే పరతత్త్వం అనే నిర్ణయాన్ని చేశారు. అపుడు వల్లభదేవుడు చాలా ఆనందించి, వీరిని వాదశుల్కంతో సత్కరించడమే కాకుండా పలు రీతుల్లో గౌరవించి, గజారోహణసంమానాన్ని చేశాడు. అపుడు పురవీధులలో ఏనుగును ఎక్కి ఊరేగే తన భక్తుడైన భట్టనాథులను చూడాలనే కుతూహలంతో పరమాత్మ సలక్ష్మీకుడై, దివ్యాయుధోపేతుడై గరుడవాహనంపై ఆకాశంలో ప్రత్యక్షం అయ్యాడు. ఆ స్వామిని దర్శించిన పెరియాఴ్వార్లకు కల్గిన ఉత్కటమైన భక్తికారణంగా స్వామిరక్షణ విషయంలో వారికి అస్థానే భయశంక కల్గింది. భగవానునకు ఏమి కీడు మూడుతుందో! ఏమో! అనే భయంతో ఆఴ్వార్లు

"పల్లాణ్డు పల్లాణ్డు" అని అంటూ మంగళాశాసనం చేయడమే పల్లాణ్డు అనే ఈప్రబంధంలోని ముఖ్యప్రమేయం. పల్లాణ్డు ప్రబంధంలోని మొదటి పాశురంలో భట్టనాథులు **"మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా"** అని అంటూ చేసిన సంబోధన విభవ వాతారాలలో ఒకటి అయిన శ్రీకృష్ణావతారంలో స్వామి ప్రదర్శించిన, చాణూర ముష్టికులనే మల్లయుద్ధవీరులను నిరసించడం అనే లీలావిశేషాన్ని తెలుపుతున్నా, ధర్మైక్యాన్నిబట్టి ఇది 108 శ్రీవైష్ణవదివ్యదేశాలలో ఒకటి అయిన తిరుమలలోని అర్చామూర్తిని పరామర్శిస్తున్నదని చెప్పవచ్చునని అభిజ్ఞుల వివరణం. తిరుమఙ్గై ఆఴ్వార్లు పెరియ తిరుమొఴి ప్రబంధంలో **"వేఙ్గడమామలై మేయ మల్లార్ తిరడోళ్ మణివణ్ణన్"** (1-10-10) అని, **"మల్లార్ తోళ్ వడవేఙ్గడవనై"** (10-10-5) అని అనుగ్రహించినందున, **"పేశిర్ర్రే పేశలల్లాల్"** అనే రీతిలో దివ్యసూరుల వాక్కులు ఐకకంఠ్యాన్ని కల్గినవి అని ఆచార్యుల సిద్ధాంతం కనుక, పల్లాణ్డులోని **"మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా"** అనే ప్రయోగం తిరుమలలోని స్వామిని ఉద్దేశించి చేయబడిందని, ఆనాడు భట్టనాథులకు ఆకాశంలో గరుడారూఢుడై వచ్చి, ప్రత్యక్షం అయిన స్వామి వేంకటేశ్వరుడేనని చెప్పడంలో అనౌచిత్యం లేదు. చరమశ్లోకాన్ని సూచించే సన్నివేశంలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వరుని ఆచార్యులు శ్రీకృష్ణ రూపునిగా సంభావించే విషయం సంప్రదాయంలో సుప్రసిద్ధమే కదా! శ్రీవేంకటేశ్వరుని మహిమను తెలిపే పలు పౌరాణిక గాథలలో తిరుమలపై శ్రీనివాసుడు భక్తులకు గరుడారూఢుడై ప్రత్యక్షం అయినట్లు తెలుపబడింది కూడా.

## తిరుప్పల్లాణ్డు

**116.** **పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిరత్తాణ్డు,**
**పలకోటి నూఱాయిరమ్,**
**మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా! ఉన్,**
**శేవడి శెవ్వి తిరుకాప్పు**

చాణూరముష్టికులనే మల్లులను నిరసించిన బలిష్ఠ బాహువులను కల మణివర్ణా! నీ ఎఱ్ఱని అందమైన శ్రీపాదాలకు రక్షణ కలగాలి. పలు సంవత్సరాలు నీవు జయశీలుడవై వర్ధిల్లాలి. నీకు కాలతత్త్వం ఉన్నంతవరకు మంగళం కలగాలి. పలుకోట్ల వందల ఏండ్లు నీకు మంగళం కలగాలి.

## పెరియాఴ్వార్ తిరుమొఴి

**117. అవ:** ఈ పాశురంలో శ్రీయశోదాదేవి, చంద్రుణ్ణి "రా! రా!" అని పిలిచినపుడు చిన్నబాలుడైన శ్రీకృష్ణునకు సంతోషం కలిగినట్లుగా, తాముకూడా పలుమార్లు



చంద్రుణ్ణి పిలిచే ప్రకారాన్ని, ఆఴ్వార్లు యశోదాదేవి భావనతో పల్కి, ఆనందిస్తున్నారు.

**శుర్ఱుమ్ ఒళివట్టమ్ శూఴ్న్దు శోది పరన్దు ఎఙ్గుమ్,**
**ఎత్తనై శెయ్యినుమ్ ఎన్మగన్ ముగమ్ నేరొవ్వాయ్,**
**విత్తగన్ వేఙ్గడవాణన్ ఉన్నై విళిక్కిన్ర,**
**కైత్తలమ్ నోవామే అమ్బులీ! కడిదోడి వా** **1-4-3**

చంద్రుడా! కాంతిని కల నీ మండలం అక్షయమై, చుట్టు నిండినదై, కళంకం లేనిదై, అంతటా తేజస్సుతో వ్యాప్తమై ఉన్నా నా కుమారుని పరమవిలక్షణం అయిన తిరుముఖానికి అది సరి కాదు. తన అందంతో, గుణచేష్టితాలతో విస్మయాన్ని కల్గించే వాడై, దుర్మార్గులైన నీవంటివారిని అనాదరించి, దివ్యమైన వేంకటాచలాన్ని ఆదరించి వర్తించేవాడైన స్వామి తన చిన్ని చేతులతో నిన్ను పిలుస్తున్నాడు. ఇతని చేతులు నొప్పి పుట్టకుండేటట్లు నీవు త్వరగా రా!

మోహనరాగం - ఆటతాళంలో ఈ పాశురం రచింపబడింది.

**118. అవ :** శ్రీకృష్ణుడు పరుగెత్తి వచ్చి తనను ఆలింగనం చేసికొవాలని శ్రీయశోదా దేవి ఆశపడింది. ఆమె ఆశకు అనుగుణంగా శ్రీకృష్ణుడు వచ్చి ఆమెను కౌగలించుకొన్నాడు. అపుడు యశోదాదేవి పొందిన ఆనందాన్ని ఆఴ్వార్లు తాముకూడా యశోదాభావనతో పొంది, ఆ అనుభవవిశేషాన్ని ఇందులో వ్యక్తం చేస్తున్నారు.

**ఎన్నిదు మాయమ్ ఎన్నప్పన్ అఱిన్దిలన్,**
**మున్నైయ వణ్ణమే కొణ్డు అళవా యెన్న,**
**మన్ను నముశియై వానిల్ శుఴర్ఱియ,**
**మిన్ను ముడియనే! అచ్చో వచ్చో వేఙ్గడవాణనే! అచ్చో వచ్చో** **1-8-8**

మహాబలిచేతినుండి దానజలం పడగానే ఉన్నతంగా పెరిగిన నీవు నీ శ్రీచరణాలతో మహాబలి ఇచ్చిన భూమిని కొలవాలని ప్రయత్నించగా, ఆ ఆశ్చర్యకరమైన లీలను చూచిన మహాబలి పుత్రుడైన నముచి పరుగెత్తి వచ్చి, "ఇది ఏమి? అన్యాయం!" అని అంటూ పెరిగే నీ శ్రీపాదాలను అడ్డుకొన్నాడు., "నీవెందుకు అడ్డుతున్నావు? నేను భూమిని దానాన్ని పొందడం కొలిచి గ్రహించడంకోసమేకదా!" అని (నీవు) అనగా, అపుడు నముచి -"నీవు చేసేది కృత్రిమంకదా! నాతండ్రి నీ మాయలో పడి నీ స్వభావాన్ని గుర్తించలేదు. ముందున్న రీతిలోనే నీవు కొలవాలి" అని అంటూ (నీవు) ఎంత చెప్పినా వినకుండా తాను పట్టిన పట్టు విడువకుండా

మొండిపట్టుదలతో ఉండగా, పెరిగిన నీ శ్రీపాదంతో అతణ్ణి ఆకాశంలోకి తీసికొని పోయి తిప్పి విసిరివేసినవాడవు, ప్రకాశించే కిరీటాన్ని కలవాడవు అయిన స్వామీ! త్వరగా వచ్చి నన్ను నీ శైశవావస్థకు అనుగుణంగా కౌగలించుకో. శ్రీవేంకటా చలపతీ! త్వరగా పరుగెత్తి వచ్చి నన్ను కౌగలించుకో.

**"అచ్చో! అచ్చో!"** అనే ద్రావిడపదాలకు "కౌగలించుకో" అని అర్థం. రెండు మార్లు ఈ పదం పల్కడం అభినివేశాతిశయంవల్ల. దేశీయరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం రచింపబడింది.

**119. అవ :** శ్రీయశోదాదేవి శ్రీకృష్ణునకు జుట్టు దువ్విన తరువాత పూలు ముడువడంకోసం అతనిని వెదికే సమయంలో శ్రీకృష్ణుడు "గోవులను మేపి, తోలుకొని వచ్చే బెత్తాన్ని నాకు ఇవ్వాలి" అని పేచీపెట్టాడు, "ఆవిధంగానే బెత్తాన్ని తీసికొని వచ్చి ఇస్తాను" అని పల్కి అతని ఏడుపును మాన్పి, "ఓ కాకీ ! బెత్తాన్ని తీసికొని రా" అని పలుమార్లు పల్కుతూ శ్రీకృష్ణుణ్ణి సంతోషపెట్టింది. ఆ లీలను పెరియాళ్వార్లు యశోదాభావనతో తాముకూడా మానసికంగా దర్శించి అనుభవించి, ఆ అనుభవరసాన్ని ఈ పాశురంలో వ్యక్తం చేస్తున్నారు.

**తెన్నిలజ్గై మన్నన్ శిరమ్ తోళ్ తుణి శెయ్దు,**
**మిన్నిలజ్గు పూణ్ విబీడణనమ్బిక్కు,**
**ఎన్నిలజ్గు నామత్తళవుమ్ అరశెన్ద,**
**మిన్నిలజ్గారఱ్కు ఓర్ కోల్ కొణ్డువా వేజ్గడవాణఱ్కు ఓర్ కోల్ కొణ్డువా**
**2-6-9**

ఓ కాకీ! మూడు విధాలైన రక్షణలను కల్గినది కావడంవల్ల అందంగా నిర్మింప బడినది, రాక్షసులు నివసించేది అయిన లంకకు నాథుడైన రావణుని పది తలలను, ఇరవై బాహువులను బాణాలతో ఛేదించి, పడగొట్టినవాడు, వెలిగే ఆభరణాలను ధరించినవాడైన శ్రీరామచంద్రుని శరణు పొందడంవల్ల సంపదను కలవాడైన శ్రీవిభీషణాళ్వాన్‌కు "నా పేరు ఈ లోకంలో ప్రకాశించేవరకు నీ రాజ్యాధికారం చెల్లుతుంది"అని అనుగ్రహించినవాడై, మెఱుపువలె వెలిగే నవరత్నాలతో కూర్చి నిర్మించిన దివ్యాభరణాలను ధరించి, అందంగా ఉండేవానికి గోవులను మేపడానికి పనికివచ్చే బెత్తాన్ని వెదికి తీసికొని రా! శ్రీవేంకటనాథునకు బెత్తాని తీసికొని రా!"

దేశీయరాగంలో - ఆదితాళంలో ఈ పాశురాన్ని గానం చేయవచ్చు.



**120. అవ :** శ్రీయశోదాదేవి తన సుందరబాలకృష్ణునకు జుట్టు దువ్వి జడవేసిన తరువాత అతనికి పూలు ముడవాలని తలచి, అతనిని సముదాయించడంకోసం సంపెంగ, మల్లె, ఎఱ్ఱకలువ, ఇరువాట్చి- మొదలైన వర్ణంలోను, సుగంధంలోను ఒకదానికి వేఱొకటి విలక్షణం అయిన పూలను సేకరించి, వాటిని ప్రత్యేక ప్రత్యేకంగా పేరు పెట్టి చెబుతూ చూపిస్తూ, "నీకు ఈ ఈ పూలను ముడిచేటట్లుగా నాదగ్గరకు రావయ్యా!" అని అతని వెంటబడి తిరుగుతూ, అతని తలలో పూలను అలంక రించింది. ఈ దివ్యలీలావిశేషాన్ని యశోదాభావనతో పెరియాళ్వార్లు భావించి ఆనందించి, ఆ అనుభవాన్ని అనుసంధించే దశకంలోనిది ఈ పాశురం. ప్రస్తుత పాశురంలో ఆళ్వార్లు - "గోపికలతో నిత్యం చిలిపిపనులను చేస్తూ వారికి సులభుడవై, తిరుమలలో పరాత్పరుడవై వేంచేసి ఉండే స్వామీ! పచ్చని దమనంతోపాటు పాదిరిపూవును ముడువడంకోసం నాదగ్గరకు రావయ్యా!"- అని పిలుస్తున్నారు.

**మచ్చొడు మాళిగై యేఱి మాదర్‌గళ్ తమ్మిడమ్ పుక్కు,**
**క్కచ్చొడు పట్టై క్కిழిత్తు క్కామ్బుతుగిలవై కీఱి,**
**నిచ్చలుమ్ తీమైగళ్ శెయ్‌వాయ్ నీళ్ తిరువేజ్గడత్తు ఎన్దాయ్!,**
**పచ్చై త్తమనగత్తోడు పాదిరిప్పూ చ్చూట్ట వారాయ్** **2-7-3**

శ్రీకృష్ణా! ఈ ఊరిలోనివారి ఇళ్ళ మధ్యలో ఉండే ప్రదేశాలలోనికి, పైమిద్దెలలోనికి ఎక్కి, గోపికలు ఉండే చోట్లకు పోయి, వారి రెవికలను, రెవికలపై ధరించే అందమైన జరీపట్టును చించివేసి, అంతటితో తృప్తిపడక, మంచి చక్కని అంచులతో అందంగా ఉండే వారి చీరలనుకూడా చించి, వారిని గేలిచేస్తూ, ఏడిపిస్తూ ఎప్పుడూ అల్లరి పనులను చేస్తున్నావు- అని ఈ ఊరిలోని వారంతా నావద్దకు వచ్చి నీపై ఆరోపణలను చేస్తున్నారు. ఇకపై నీవు ఆ వైపుకు పోవద్దు. గొప్ప ఉన్నతంగా ఉండే దివ్యశిఖరాలతో విరాజిల్లే శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామీ! నీవు త్వరగా రావయ్యా! నీకు మంచి సువాసనను కల్గిన, పచ్చగా ఉండే దమనంతోపాటు పాదిరిపుష్పాలను అలంకరిస్తాను. నాపై దయచూపి రావయ్యా!

అఠాణా రాగం, రూపకతాళంలో ఈ పాశురం కూర్చబడింది.

**"మచ్చు"** - మధ్యప్రదేశం. **"కచ్చు"** ఇది కంచుకశబ్దభవం. రెవిక అని అర్థం. **"పట్టు"** - ఇది పట్టుతో చేసిన పావడను లక్షిస్తుంది. **"నిచ్చల్"** - **"నిత్య"** శబ్దవికృతి. **"దమనకమ్"** - దమనమనే సంస్కృత పదవికారం.

**121. అవ :** శ్రీకృష్ణుడు చేసే చిలిపిపనులను సహించలేక, రేపల్లెలో ఉండే కొందఱు వచ్చి మొఱపెట్టి "నీ కుమారుణ్ణి ఇక్కడకు పిలు" అని యశోదాదేవితో పల్కగా,

యశోదకూడా శ్రీకృష్ణుణ్ణి తనవద్దకు రావడంకోసం పలు మార్లు అతనిని పొగడి, "నిన్నుగూర్చి ఇతరులు పలికే నిందలను నేను సహించలేకుండా ఉన్నాను. నా దగ్గరకు రావయ్యా!'' అని బ్రతిమిలాడే రీతులను యశోదాదేవి భావనతో దర్శించి ఆనందించిన పెరియాఴ్వార్లు ఆ అనుభవవిశేషాన్ని ప్రకృతదశకంలో **(2-9)** తెలుపు తున్నారు. ప్రస్తుత పాశురంలో ఇరుగు పొరుగువారు "యశోదాదేవీ ! నీ కుమారుణ్ణి పిలు'' అని అనగానే తన కుమారుణ్ణి ఈమె పిలిచే తీరు చెప్పబడు తున్నది.

**పోదర్ కణ్డాయ్ ఇజ్గే పోదర్కణ్డాయ్**
**పోదరే నెన్నాదే పోదర్ కణ్డాయ్,**
**ఏదేనుమ్ శొల్లి అశలగత్తార్**
**ఏదేనుమ్ పేశ నాన్ కేట్క్కమాట్టేన్,**
**కోదుకులముడై క్కుట్టనేయో!**
**కున్జెడుత్తాయ్! కుడమాడుకూత్తా!,**
**వేదప్పొరుళే! ఎన్ వేజ్గడవా!**
**విత్తగనే! ఇజ్గే పోదరాయే 2-9-6**

అందఱు శ్లాఘించే కల్యాణగుణాలను కలవాడా! చిట్టి తండ్రీ! ఇటువంటి నీవు అందఱూ నిందించేటట్లుగా ఈ రీతిగా ఉన్నావే! ఇరుగు పొరుగువారు నీ విషయంలో తిరిగి చెప్పడానికి వీలు లేనట్లు దోషాలను ఆరోపించడమే కాకుండా, నాదగ్గరకు వచ్చి చెవితో వినడానికి, నోటితో పల్కడానికి సాధ్యం కానట్లు నీపై దోషాలను, దుర్భాషలను పల్కుతుండగా, శ్రీకృష్ణా! నేను సహించలేకుండా ఉన్నాను. గిట్టనివారు ఉండే ఆచోట్లకు పోవద్దు. నా దగ్గరకు త్వరగా రావయ్యా! వేగంగా రావయ్యా!

గోవర్ధనగిరిని ఎత్తి గొడుగుగా చేసి గోవులను, గోపాలకులాన్ని సంరక్షించిన వాడవుకదా నీవు! ఐశ్వర్యంవల్ల కల్గిన అతిశయం వ్యక్తం అయేటట్లు కుంభనృత్యాన్ని చేసినవాడవుకదా నీవు ! ఆ విధంగా గోకులానికి రక్షకుడవై, ఈ కులంలో పుట్టినందువల్ల కల్గిన ఐశ్వర్యమే నీకు నిజమైన ఐశ్వర్యం అని తలచి ఉండేవాడవు కదా నీవు! దీనికి తగిన రీతిలో నీవు నడచుకొనవద్దా! సకలవేదప్రతిపాద్యుడవై, అంతమాత్రమే కాకుండా, బాహ్యనేత్రాలతో దర్శించగలిగేటట్లు భూలోకవాసులకు, పరమపదవాసులకు గొప్ప నిధిగా శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉన్నావుకదా!



ఆశ్చర్యాన్ని కల్గించే దివ్యకల్యాణవిభూతి విగ్రహలీలలను కలవాడవుకదా నీవు! వేగంగా ఇక్కడకు రా. "నేను రాను''అని అనకుండా వెంటనే ఇక్కడకు రా! నీ గుణహానిని పలికేవారు ఉండేచోట ఉండకుండా, నీ గుణాలనే అనుసంధించే నాదగ్గరకు శీఘ్రంగా రావయ్యా!

కేదారగౌళరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం రచింపబడింది.

**"కోతుకులమ్"** - కుతూహలశబ్దభవం. **"కోతుకులముడైయ పావాయ్"** - అని తిరుప్పావైలో ప్రయోగం. **"కుడక్కూత్తు"** - తలపై, రెండు భుజాలపై, కడవలను ధరించి, రెండు చేతులతో కడవలను పైకెగురవేస్తూ, ఏ కడవ క్రిందపడకుండా పట్టుకొంటూ చాకచక్యంగా ఆడే ఆట. ఇది గొల్లలకు అసాధారణమైన క్రీడ.

**122. అవ :** శ్రీకృష్ణుడు గోవులను మేపి తిరిగి వచ్చే సమయంలో అలసటచేత వాడిన అతని శరీరాన్ని చూచి ఓర్వలేక, "శ్రీకృష్ణా! నీవు రేపటినుండి గోవుల వెంట పోవద్దు. ఇంటిదగ్గరే చక్కగా అలంకరించుకొని ఉండు'' అని పల్కిన యశోదాదేవి భావనను పెరియాఴ్వార్లు తద్భావనతో ఈ దశకంలో **(3-3)** అనుసంధిస్తున్నారు. ప్రస్తుత పాశురంలో "నీ ఎఱ్ఱని తామరలవంటి పాదాలు కందిపోయాయి, కన్నులు ఎఱ్ఱబడ్డాయి. ఎంత అలసిపోయావు! నాతండ్రీ!'' అని అంటూ తల్లడిల్లుతూ ఆఴ్వార్లు పల్కుతున్నారు.

**కడియార్ పొఴిలణి వేజ్గడవా! కరుమ్బోరేఱే!, నీ యుగక్కుమ్**
**కుడైయుమ్ శెరుప్పుమ్ కుఴలుమ్ తరువిక్కక్కొళ్ళాదే పోనాయ్ మాలే!**
**కడియ వెజ్గానిడై క్కన్ఱిన్పిన్ పోన శెరుక్కుట్ట చ్చెజ్గమల**
**అడియుమ్ వెదుమ్బి, ఉన్ కణ్గళ్ శివన్దాయ్ అశైన్దిట్టాయ్ నీ ఎమ్బిరాన్ 3-3-4**

పూల పరిమళంతో నిండిన తోటలను కల్గిన, అందంగా ఉండే తిరుమలలో నిత్య నివాసం చేసేవాడా! నల్లని వర్ణాన్ని కల్గినదై, మిక్కిలి బలిసిన, యథేచ్ఛగా తిరిగే వృషభంవలె సంచరించేవాడా! స్వామీ! నీవు ఆశపడే వర్షాతపవారణం అయిన ఛత్రం, కంటకాది పరిహారకం అయిన పాదుకలు, గోవులను మరలించి మేపడానికి, పిలువడానికి తగిన సాధనం అయిన పిల్లనగ్రోవి- మొదలైన వస్తువులను అన్నిటినీ తెప్పించాను. వీటిని తీసికోకుండా గోవులను మేపడంలోని వ్యామోహంతో పోయినవాడా! చాలా వేడిమిని కల అరణ్యంలో గోవులు పోయిన చోట అంతా వెంబడించి పోయినందువల్ల చిన్నపిల్లవాడివైన నీ ఎఱ్ఱని, కమలంవంటి శ్రీచరణాలు కందిపోయి, నీ చేతులు ఎఱ్ఱబడి బాధపడ్డావు. అయ్యో! నా కుమారా!

నేను దీన్ని చూచి ఏవిధంగా సహించగలను? ఇకపై రేపటినుండి నీవు అరణ్యానికి పోవద్దు. అలంకరించుకొని ఇక్కడే ఉండు స్వామీ!

సురటరాగం - ఆదితాళంలో ఈ పాశురం కూర్పబడింది.

**123. అవ :** భగవానుడు పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చారూపాలనే అయిదు స్వరూపాలతో వేంచేసి ఉండడం చేతనులను సంస్కరించడంకోసం, సంస్కరింపబడ్డ వారినుండి కైంకర్యాన్ని స్వీకరించడం కోసమేకదా! అతని సౌశీల్యాదిసకల కల్యాణ గుణాలను పూర్ణంగా దర్శించగల్గినది- శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉన్న స్థితిలోనే. ఈ పెరియాళ్వార్లకు ప్రథమసుకృతం ఈ స్వామియే. భగవానుడు వీరిని కటాక్షించి, వీరికి అనుభవం అనే ఎరువును వేసి, ఆచార్యోపదేశం అనే నీటిని ప్రవహింపజేసి, సత్సహవాసం అనే విత్తనాన్ని నాటి, వీరి హృదయం అనే క్షేత్రంలో పరభక్తి- పరజ్ఞాన- పరమభక్తులనే సస్యాన్ని పండించాడు. అంతటితో వీరికి విరోధులపట్ల అరుచి, ప్రాప్యం పట్ల రుచి కల్గింది.

ఈ విధంగా సంస్కరింపబడ్డ ఈ ఆళ్వార్లను చూచి భగవానుడు సంతోషించగా, భగవానుని ఆనందాన్ని చూచి ఆళ్వార్లు కూడా సంతోషించారు. వీరి విషయంలోగల నిరవధికప్రేమచేత భగవానుడు అపుడు వీరికేమి అవద్యం కలుగుతుందో! అనే సంభ్రమాన్ని పొందాడు. ఆ సంభ్రమాన్ని చూచిన ఆళ్వార్లు- "స్వామీ! ఎందుకు నీకీ సంభ్రమం? నీ అనుగ్రహంవల్ల నా విరోధులన్నీ తీరి పొందవలసిన దాన్ని పొందానుకదా! నాకిక ఏ లోటు లేదు''అని ఈ పాశురంతో శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలో ప్రార్థిస్తున్నారు.

శెన్నియోఙ్గు తణ్ తిరువేఙ్గడముడైయాయ్ ఉలగు
తన్నై వాழ నిన్ఱ నమ్బీ దామోదరా శదిరా
ఎన్నైయుమ్ ఎన్నుడైమైయైయుమ్ ఉన్ శక్కరప్పొఱి యొఱ్ఱిక్కొణ్డు
నిన్నరుళే పురిన్దిరున్దేన్ ఇని ఎన్ తిరుక్కుఱిప్పే 5-4-1

ఆకాశం అంత ఎత్తున ఉన్నంతగా ఉండే శిఖరాలను కల, చల్లనిదైన శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండి, లోకులను అందరినీ ఉజ్జీవింపజేసే దివ్యకల్యాణ గుణ పూర్తిని కలవాడవైన స్వామీ! యశోదాదేవిచేత నడుమును కట్టబడిన ఆ చిన్నదారంలోని ముడులు నీ నడుమున ఒరసుకోవడంచేత ఏర్పడిన కిణాలను కల దామోదరా! ఆశ్రితుల దోషాలను గమనించని చాతుర్యాన్ని కలవాడా! నా ఆత్మను, నా శరీరాన్ని నీ సుదర్శనచక్రాంకనాలతో ముద్రించుకొని, నీ కరుణనే పురుషార్థంగా తలచి ఉన్నాను. ఇక నా పట్ల నీ ఉద్దేశ్యం ఏమి? విషయాంతర ప్రవణుడనై, అక్కడ ఇక్కడా చిరకాలం పరిభ్రమించే నన్ను నీ వైలక్షణ్యాన్ని చూపి, నీవశం చేసికొని, నా ఆత్మాత్మీయాలను అన్నిటినీ నీకు శేషంగా చేసికొని, నీ కరుణనే పురుషార్థంగా భావించే స్థితిని దాసునకు కలుగజేశావు. ఇందువల్ల నీ కోఱిక తీరింది. నా కోఱిక తీరింది. ఇక చేయవలసినది ఏదీ లేదు. ఈవిధంగా ఉండగా నీ మనస్సులో ఈ కొఱత ఎందుకయ్యా?



ఈ పాశురం శ్రీరాగం - త్రిపుటతాళంలో కూర్పబడింది.

**"తణ్"** - రక్షకుని, రక్ష్యభూతుని తాపాలను తీర్చే చల్లదనాన్ని తిరుమల కల్గి ఉండడాన్ని ఈ పదం సూచిస్తుంది. **"నమ్బి"** - నమ్మదగినవాడు, గుణపూర్ణుడు, స్వామిత్వ, వాత్సల్యాది గుణపూర్తిని ఇది సూచిస్తుంది. **"శదిర్"** - చాతుర్యం. చతుర శబ్దభవం కావచ్చు. ఇచటి చాతుర్యం భక్తుల దోషాదర్శిత్వమే. ఆత్మకు చక్రాంకనం అంటే - అనన్యార్హశేషత్వజ్ఞానాన్ని కల్గి ఉండడమే. దీన్ని వ్యక్తం చేయడంకోసమే బాహ్యంగా భుజాలపై శంఖచక్రధారణం.

## ఆణ్డాళ్

కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్ ।
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్ ॥

గోదాదేవి భూదేవి అంశతో జన్మించింది. పెరియాళ్వార్ల నందనవనంలో నళనామ సంవత్సరం కర్కాటకమాసం శుద్ధచతుర్దశీ మంగళవారం పూర్వఫల్గునీ నక్షత్రంలో శ్రీవిల్లిపుత్తూర్ అనే దివ్యదేశంలో జనకచక్రవర్తికి సీతాదేవివలె తమకు లభించిన ఈమెకు **"గోదా"** అనే పేరును పెట్టి పెరియాళ్వార్లు పెంచారు. **"బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః"** అనే రీతిలో చిన్నతనంనుండే గొప్ప భగవద్భక్తిని కల ఈమెకు శ్రీరంగనాథుని విషయంలో ప్రావణ్యం దినదినప్రవర్ధమానం అయింది. పెరియాళ్వార్లు ప్రతిదినం శ్రీవిల్లిపుత్తూర్‌లోని అర్చామూర్తి అయిన వటపత్రశాయి స్వామికి సమర్పించడంకోసం కూర్చిపెట్టిన పూలమాలికలను రహస్యంగా తాను ముందుగా ధరించి, అద్దంలో తన అందాన్ని చూచుకొని, తనకు శ్రీరంగనాథుని వివాహం చేసికోవడానికి యోగ్యత ఉన్నదా? లేదా! అని పరీక్షించుకుంటూ ఉండేది. కొన్నాళ్ళ తర్వాత ఒకనాడు ఈమె చేసే ఈ పనిని గుర్తించిన పెరియాళ్వార్లు చాలా బాధపడి గోదాదేవిని మందలించారు. ఆనాడు తాము కట్టిన మాలను వటపత్రశాయిస్వామికి అర్పించడం నిలిపివేశారు. ఆనాటి రాత్రి

స్వామి పెరియాౘ్వార్లకు స్వప్నంలో సాక్షాత్కరించి, గోదాదేవి ప్రభావాన్ని తెలిపి, ఆమె ధరించి విడచిన మాలిక తనకు అత్యంతప్రియం అని అన్నాడు. ఆనాటినుండి గోద **"శూడిక్కొడుత్త నాచ్చియార్"** (పూలను ముడుచుకొని, సమర్పించిన దేవేరి) అని పిలువబడింది. గోదాదేవి భగవద్విరహాన్ని సహించలేక, గోపికలు కాత్యాయనీ వ్రతాన్ని ఆచరించినట్లు, ధనుర్మాసవ్రతాన్ని భగవానుని ఉద్దేశించి ఆచరించి, శ్రీరంగనాథుని భర్తగా పొందింది. ఈమె 30 పాశురాలను కల, నిత్యానుసంధేయం అయిన తిరుప్పావై ప్రబంధాన్ని, 143 పాశురాలను కల నాచ్చియార్ తిరుమొౘి ప్రబంధాన్ని అనుగ్రహించింది.

## నాచ్చియార్ తిరుమొౘి

**124. అవ :** శ్రీపెరియాౘ్వార్ల కుమార్తె అయిన శ్రీశూడిక్కొడుత్తనాచ్చియార్ (గోదాదేవి) భగవానుని విషయంలో తనకు గల వ్యామోహం అతివేలంకాగా, అతనిని పొందడంకోసం అనేకవిధాలుగా ఉపాయానుష్ఠానాన్ని చేసింది. అయినా అవి ఏవీ ఫలించకపోవడంవల్ల చాలా ఆర్తిని పొందింది. మార్గౘిమాసం అంతా తిరుప్పావై- అనే నోమును నోచి స్వామి అనుభవంకోసం ఎదురు చూచినా అతడు వచ్చి సేవను అనుగ్రహించక పోవడంవల్ల శరీరాన్ని ధరించలేక పోయింది. వియోగంలో ఉన్నవారిని కలిపే స్వభావాన్ని కల మన్మథుని ఆశ్రయించి, అతని అనుగ్రహంతో భగవానుని పొందాలని ప్రయత్నించింది. ఈ పాశురంలో "ఓ కామదేవా! నిన్ను, నీ తమ్ముని నమస్కరిస్తు న్నాను. నీవు కృపజేసి, ఏదో రీతిలో శ్రీవేంకటేశ్వరునకే నేను కైంకర్యం చేసేటట్లుగా కల్పించాలి- అని మన్మథుని ప్రార్థిస్తున్నది.

**తైయొరు తిఙ్గళుమ్ తరై విళక్కి**
**త్తణ్ మణ్డల మిట్టు మాశి మున్నాళ్,**
**ఐయనుణ్ మణల్కొణ్డు తెరువణిన్దు**
**అౘగిను క్కలఙ్గరిత్తు అనఙ్గదేవా!,**
**ఉయ్యవుమాఙ్గొలో ఎన్రు శొల్లి**
**ఉన్నైయుమ్ ఉమ్బియైయుమ్ తొౘుదేన్,**
**వెయ్యదోర్ తౘలుమిౘ్ శక్కరక్కై**
**వేఙ్గడవఱ్కు ఎన్నై విదిక్కిఱ్రియే** 1-1

ఓ అనంగదేవా! మార్గౘిమాసం అంతా నోము నోచాము. ఇక ఈ తైమాసం అంతా భగవానుడు వచ్చే చోటును శోధించి, అందంగా, గుండ్రంగా ఉండే ముగ్గును



పెట్టి, మాఘమాసం మొదటి పక్షంలో సుందరమైనది, అతని సౌకుమార్యానికి తగినది, సన్నని ఇసుకను తీసికొని అతడు వచ్చే దారిని అందమైన అతనికోసమే అలంకరించి, **"ఉజ్జీవించగలమా!"** అనే ఆశతో నిన్ను, నీ తమ్ముడైన (జాంబవతీ పుత్రుడైన) సాంబుని కొలిచాను. అందువల్ల కృపామూర్తివైన ఓ మన్మథా! ప్రతికూలురపట్ల నిప్పుకణాలను ఉమిసే అద్వితీయం అయిన శ్రీసుదర్శనాన్ని శ్రీహస్తంలో ధరించిన శ్రీవేంకటేశ్వరునకు సర్వవిధకైంకర్యాలను చేసే రీతిలో నన్ను నీవు కరుణించాలి.

ఈ పాశురభావాన్ని అనుసరిస్తూ **"నాడి నీ వేఙ్గడవఱ్కు విది ఎన్ర ఇమ్మాఱ్రమ్"** అని తిరుప్పావై తనియన్‌లో రచింపబడింది. సావేరిరాగం, ఆదితాళంలో ఈ పాశురం రచింపబడింది.

**125. అవ :** ఘటకుడైన మన్మథుడు ఇష్టపడేవాటినే అతనికి సమర్పించాలని తలచి, రజోగుణప్రచురుడైన కామదేవునకు అనురూపం అయేటట్లు మదాన్ని కల్గించే ఉమ్మెత్తపూలు, మోదుగపూలు మొదలైన వానిని సేకరించి, తులసిని కోసి స్వామికి సమర్పించేకులంలో పుట్టిన గోదాదేవి మన్మథునకు సమర్పిస్తూ, తనను శ్రీవేంక టేశ్వరునకు దాసురాలినిగా చేయాలని వేడుతున్నది.

**మత్త నన్నఱుమలర్ మురుక్కమలర్**
**కొణ్డుముప్పోదుమ్ ఉన్నడి వణఙ్గి,**
**తత్తువమిలి యెన్రు నెఞ్జెరిన్దు**
**వాశగత్తౘిత్తు ఉన్నై వైదిడామే,**
**కొత్తలర్ పూఙ్గణై తొడుత్తుక్కొణ్డు**
**కోవిన్ద నెన్బదోర్ పెయరెౘుది,**
**విత్తగన్ వేఙ్గడవాణ నెన్నుమ్**
**విళక్కినిల్ పుగ ఎన్నై విదిక్కిఱ్రియే** 1-3

ఓ కామదేవా! మంచి సువాసనను గల ఉమ్మెత్తపూలను, మోదుగపూలను తీసికొని వచ్చి, మూడు పొద్దులలో నీ పాదాలలో దండం సమర్పించి, నిన్ను ఆరాధిస్తున్నాను. నేను నిన్ను సేవించినందులకు ఫలంగా నా మనోరథాన్ని నీవు నెఱవేర్చకపోయినట్లయితే నా మనస్సు చాలా నొచ్చుకొంటుంది. "మన్మథుడు నిజంగా ఫలాన్ని అనుగ్రహించేవాడు కాడు. ఇతడు అసత్యమైన దైవం'' అని లోకంలో అంతటా నిందించేటట్లు, నేను నీ మహిమను నిందించేటట్లు ఏర్పడుతుంది. అటువంటి పరాభవాన్ని నీవు పొందకుండా, మంచి పేరు పొందాలని చూడు. మన్మథా! నీవు నాకు చేయవలసిన కార్యాన్ని చెబుతున్నాను విను. గుత్తులు

గుత్తులుగా వికసించే పూలు అనే బాణాలను వింటిలో సంధించి, మా రక్షణకోసం పట్టాభిషిక్తుడైనవాని "గోవింద" నామాన్ని నా హృదయంలో లిఖించి, అద్భుతమైన, వేంకటేశ్వరుడనే దివ్యజ్యోతిని నేను చేరేటట్లు నన్ను అనుగ్రహించాలి.

పరమగంభీరం, రస్యార్థపూర్ణం అయిన ఈ పాశురంలో ఎన్నో వ్యంగ్యార్థాలు భాసిస్తున్నాయి. వాటిలో కొన్ని మచ్చుకు ఈ కింద విన్నవింపబడుతున్నాయి.

నీకు ముఖోల్లాసం కలిగేటట్లు నీవు అభిలషించే పూలను సమర్పించి, ముప్పొద్దుల నేను నీకు పాదసేవ చేసి పూజిస్తాను. నీవు కృపజేసి నీ బాణంతో నా మనస్సులో గోవిందనామాన్ని వ్రాసి, అతని దగ్గరకు నన్ను చేర్చాలి - అనే అర్థాన్ని చెప్పవచ్చు. లేక, నీవింటిలో పూలు అనే బాణాలను తొడిగి, నా విషయంలో ఉదాసీనంగా ఉండే అతనిపై ప్రయోగించి, అపుడు కూడా అతడు ఆభిముఖ్యాన్ని చూపించకపోతే, అతని పేరును పలు చోట్ల వ్రాసి, గోవిందనామాన్ని కల ఇతడు ఒక అబలను, అనన్యార్హ శేషభూత అయిన స్త్రీని ఈవిధంగా అనాదరిస్తున్నాడు. అదియేనా గోవిందనామం యొక్క వైభవం! అని అందఱూ తెలిసేటట్లుగా చేసి, ఏవిధంగా అయినా అతని ఒప్పించి అతనిని నన్ను చేరేటట్లుగా చేయాలి- అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

ఈ పాశురానికి పరమకారుణికులైన పెరియవాచ్చాన్‌పిళ్ళై అందంగా రెండు విధాలైన అన్వయాలను చూపిస్తూ ఈ విధంగా అన్నారు- "**మదువిరియా నిన్ఱుళ్ళ పుష్పబాణఙ్గళై తొడుత్తుక్కొణ్డు "గోవింద" ఎన్నుమ్ తిరునామత్తై అమ్బిలే ఎఴుదిక్కొణ్డ ఎన్నుదల్, హృదయత్తిలే ఎఴుదిక్కొణ్డ ఎన్నుదల్**"

ఇందులో మొదటి అన్వయానికి- గోవిందనామాన్ని బాణంలో వ్రాసి, ఆ బాణాన్ని అతనిపై ప్రయోగించి, ఆ నామమే గోదాదేవి మనస్సులో ఎప్పుడూ అనుసంధింప బడుతున్నది - అని అతనికి తెలియజెప్పి, అతనికి నాపై దయ కలిగేటట్లు చేసి, నాతో అతడు సంశ్లేషించేటట్లు చేయాలి- అని అర్థం.

లేక, నీ బాణంలో అతని గోవిందనామాన్ని వ్రాసి, దానిని నాపై ప్రయోగించి, అతని విషయంలోనే నా మనస్సు లగ్నం అయేటట్లుగా చేసి, అతనితో ఏకతత్త్వం అనే రీతిలో నన్ను కలుపు. శ్రీరాముని తిరునామంతో అంకితం అయిన అంగుళీయ కాన్ని హనుమంతుడు సీతాదేవికి ఇచ్చినట్లు, ఆచార్యుడు శిష్యునకు చక్రాంకనాన్ని చేసి, దాస్యనామాన్ని ఇచ్చేటట్లు, నీవు అతని తిరునామంతో అంకితం అయిన నీ బాణాన్ని నాపై ప్రయోగించి, నన్ను అతనికే అంకితం చేయాలి (అనన్యార్హగాచేయాలి). సీతాదేవి రామనామాంకితం అయిన అంగుళీయకాన్ని చూచి, ఆనందించినట్లు,



అతడు విశ్లేషాసహిష్ణుతను కల్గి ఉన్నట్లే నేను కూడా కొంత తృప్తిని పొందుతాను- అని దీని తాత్పర్యం.

రెండవ అన్వయానికి - నీ మనస్సులో అతని నామాన్ని వ్రాసి, అతనితో నన్ను కలపడానికి సంకల్పించి, అతనితో నన్ను చేర్చు. నీ మనస్సులో అతని నామాన్ని వ్రాసికొన్నట్లయితే, ఆ తిరునామప్రభావంచేత నీకుకూడా నావిషయంలో దయ కల్గుతుంది. అపుడు నాబాధ కొంత నీకు తెలుస్తుంది. నావిషయంలో అనుతాపం కల్గుతుంది. అపుడు నీవు నన్ను అతనితో తప్పక చేరుస్తావు. అందులో సందేహం లేదు - అనే భావం చెప్పవచ్చు. లేక, నీ మనస్సులో అతని నామాన్ని వ్రాసి, అతనికి నన్ను శేషంగా చేసి, నిరుపాధిక ప్రాప్తశేషి అయిన అతనితో నన్ను చేర్చు - అని కూడా భావం. ఈ విధంగా ఈ పాశురంలోని రసాన్ని అనుభవించినపుడు దానికి అంతం లేదు.

సావేరిరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

**126. అవ :** నాకు ఇష్టం ఉన్నదో? లేదో అని సందేహించి, భగవానుడు తిరుమలకు వచ్చి నిలచి ఆలస్యం చేస్తున్నాడు కాబోలు! అందుకే నేను ఈవిధంగా శ్రమను అనుభవిస్తున్నాను. నా ఆర్తిని తెలిసి, వేగంగా వచ్చి నన్ను తనతో హత్తుకొనేటట్లుగా కూడికదైవం అనుకూలించాలి- అని ఇందులో గోదాదేవి ఆశపడుతున్నది.

**కాట్టిల్ వేఙ్గడమ్ కణ్ణపురనగర్,**
**వాట్ట మిన్ఱి మగిఴ్న్దుఱై వామనన్,**
**ఓట్టరావన్దు ఎన్కై ప్పఱ్ఱి, తన్నొడుమ్**
**కూట్టుమాగిల్ నీ కూడిడు కూడలే** **4-2**

ఓ సంధానదైవమా! (ప్రేయసీప్రియులను కలిపే ఓ దైవమా!) శ్రీదండ కారణ్యంలో ఋషులతో కలసి ఉండి, వనవాసం చేసినట్లు, లేక శ్రీబృందావనంలో గోపికలతో కూడి ఉన్నట్లు, తిరుమలలో వేంచేసి ఉన్నవాడు, అయోధ్యలో అందఱితో కలసి ఉండి నగరనివాసానుభవం అనుభవించినట్లు, లేక, రేపల్లెలో గోపికలతో కూడి ఉన్నట్లు, తిరుక్కణ్ణపురంలో వేంచేసి ఉన్నవాడు, నగరవాసంతో, వనవాసంతో భేదం లేకుండా "వనవాసో మహోదయః" అన్నట్లు రెండిటినీ మధురంగా ఆస్వాదించే మనస్తత్త్వాన్ని కలవాడు, ఆశ్రితులైన దేవతలకోసం శ్రియః పతియై, అవాప్తసమస్తకాముడై, నిత్యముక్తానుభావ్యుడై, పరాత్పరుడై ఉండే తన స్వభావాన్ని సైతం మార్చుకొని, వామనబ్రహ్మచారిగా అవతరించి, యాచకవృత్తిని కూడా చేసి, అన్ని లోకాలను తన శ్రీపాదస్పర్శతో ఉద్ధరించిన స్వామి, పరమకృపతో

వేగంగా వచ్చి నా హస్తాన్ని గ్రహించి, కౌగలించుకొనేటట్లయితే, నీవు కలవాలి. అంటే -అతడు వేంచేసి, నన్ను కలిసేటట్లు నీవు అనుకూలించాలి - అని భావం.

కేదార రాగంలో - ఆటతాళంలో ఈ పాశురాన్ని గానం చేయవచ్చు.

**"వాట్టమిన్ఱి"** - పరమపదాన్ని వదలి హేయం అయిన సంసారమండలంలోకి వచ్చానే! అనే కొఱతను పొందకపోవడమే.

**127. అవ :** ఏదైనా ఒక బాధకు పరిహారాన్ని చేయాలి అంటే, ఆ బాధ ఉన్న స్థితిని తెలియాలి కదా! అని అంటే, తనను స్వామి బాధించే రీతిని కోకిలకు తెలుపుతూ గోదాదేవి దాని సహాయాన్ని అర్థిస్తున్నది.

వెళ్ళైవిళి శఙ్గు ఇడజ్జైయిల్ కొణ్డ
విమలన్ ఎనక్కు ఉరుక్కాట్టాన్,
ఉళ్ళమ్ పుగున్దు ఎన్నై నైవిత్తు
నాళుమ్ ఉయిర్ పెయ్‌దు కూత్తాట్టు క్కాణుమ్,
కళ్ళవి*ழ్* శెణ్బగ ప్పూమలర్ కోది
క్కళిత్తిశై పాడుమ్ కుయిలే,
మెళ్ళ విరున్దు మి*ழ*ఱ్ఱి మి*ழ*ఱ్ఱాదు ఎన్
వేఙ్గడవన్ వర క్కూవాయ్ 5-2

తేనె స్రవించే సంపెంగపూలలోని అసారమైన అంశాన్ని తొలగించి, సారమైన భాగాన్ని అనుభవించి, ఆనందాన్ని పొంది, తత్పరీవాహరూపంగా రాగాలను పాడుతున్న ఓ కోకిలా! కారుమబ్బువంటి నల్లని దివ్యదేహానికి పరభాగ శోభను కల్గించే తెల్లని రంగును కల్గినదై, "నావలె మీరుకూడా కైంకర్యాన్ని చేయడానికి ప్రయత్నించండి'' అని ఆహ్వానించేటట్లు గర్జనలు చేసే శ్రీపాంచజన్యాన్ని తన ఎడమ చేతిలో ధరించిన స్వామి, తనను దర్శించాలని ఎంతో ఆశను కల నాకు తన దివ్యరూపాన్ని చూపకుండా మఱుగుపఱచుకొని ఉన్నాడు. అతడీవిధంగా ఉపేక్షించినందువల్ల అతని ఆ రూపాన్ని మఱచిపోదాం - అని ప్రయత్నిస్తే-దాన్నికూడా చేయనివ్వడంలేదు. నా మనస్సులోకి వచ్చి ప్రవేశించి, **"నినై దొఱుమ్ శొల్లున్దొఱుమ్ నెఞ్జిడిన్దుకుమ్"** అనే రీతిలో శైథిల్యాన్ని కల్గిస్తున్నాడు. ఆ శైథిల్యంవల్ల ప్రాణం పోయే స్థితి ఏర్పడగానే, "ఇంతటితో ఈమెను అతంచేసి ఊరుకుందామా! లేక, ఇంకా కొన్నాళ్ళు బాధించవచ్చునా!'' అని తలచి, తిరిగి ప్రాణం తల ఎత్తేటట్లు చేసి, పూర్వంవలెనే హింసిస్తున్నాడు. ఈవిధంగా నన్ను తల్లడిల్లేటట్లు చేసి, ఇదే



కాలక్షేపంగా కల్గి ఉన్నాడు. నేను ఈరీతిలో బాధపడుతూ ఉండగా, నీవు మాత్రం ఈ విధంగా ఆనందంగా రాగాన్ని పాడుతూ, పొద్దుపుచ్చడం న్యాయమా! నీవు నాకు చేయవలసిన పని ఏమో చెబుతాను విను. నీవు సదా నాతోనే ఉండి, మధురమధురంగా తీయని మాటలను పల్కడం, విలాసచేష్టితాలను చేయడం చేస్తున్నావుకదా! ఈ పద్ధతిని విడచి, నా కోసం తిరుమలకు వచ్చి, అక్కడ నిలచి ఉన్న స్వామిని, ఈ విధంగా నాల్గు అడుగులు వేసి, నా దగ్గరకు వచ్చేటట్లు పిలవాలి అని నిన్ను వేడుతున్నాను.

ఆనందభైరవిరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

**128. అవ :** శ్రీగోదాదేవి నాచ్చియార్‌తిరుమొ*ழ*ిలోని ఏడవ దశకంలో పాంచజన్య శంఖంతో సంభాషిస్తూ, ఒక విధంగా పొద్దు పుచ్చింది. ఈమె ఎంతగా మొఱపెట్టినా ఆ శంఖం సమాధానం ఏమీ పల్కలేదు. అందువల్ల భగవద్విశ్లేషంచేత కల్గిన ఆమె ఆర్తి అతిశయించింది. ఆ కాలంకూడా వర్షాకాలం. అపుడు తిరుమలపై ఆకాశంలో అంతటా మేఘాలు మెరుస్తూ, గర్జిస్తూ కన్పించాయి. ఆ మేఘాలతోపాటు, వాటి వర్ణంవంటి వర్ణాన్ని కల స్వామి వచ్చి ఉంటాడనే భావంతో గోదాదేవి "భగవానుడు కూడా మీతో వచ్చాడా?'' అని అంటూ వాటిని ప్రశ్నించింది. అవి బదులు ఏమీ పలుకలేదు. దానితో మేఘాలను ఉద్దేశించి "మీరు నా నాయకుడైన శ్రీవేంకటేశ్వరుని సన్నిధికి చేరి, నా దశను తెలియజేయాలి'' అని వాటిని వేడుతున్నది. ఈ విధంగా మేఘాలను దూతగా పంపడమే ఈ దశక ప్రమేయం.

అందులోని ఈ మొదటి పాశురంలో "ఆకాశంలో అంతటా వ్యాపించి, ఉన్న ఓ మేఘాలలారా! నాస్వామి అయిన శ్రీవేంకటేశ్వరుడుకూడా మీతోపాటు ఇక్కడకు వచ్చాడా?'' అని గోదాదేవి మేఘాలను ప్రశ్నించగా, ఆ ప్రశ్నకు అవి ఏ సమాధానం చెప్పకపోవడంతో, ఆమె కన్నీరు విడువడం ప్రారంభించి, వాటితో "మేఘలలారా! నేను ఈ విధంగా కన్నీరు విడుస్తూ ఏడ్చేటట్లు నన్ను చేయడం అతని గొప్పతనమా? మీరే చెప్పండి'' అని అంటున్నది.

విణ్ణీల మేలాప్పు విరిత్తాఱ్పోల్ మేగఙ్గాళ్!,
తెణ్ణీర్ పాయ్ వేఙ్గడత్తు ఎన్ తిరుమాలుమ్ పోన్దానే,
కణ్ణీర్గళ్ ములైక్కువట్టిల్ తుళి శోర చ్చోర్‌వేనై,
ప్పెణ్ణీర్మై యీడ*ழ*ిక్కు మిదు తమక్కు ఓర్ పెరుమైయే 8-1

ఆకాశంలో అంతటా ఆవరించిన, నీలవర్ణాన్ని కల మేల్‌కట్టు కట్టినట్లుగా కన్పించే మేఘాలలారా! చాలా పరిశుద్ధం అయిన పుణ్యతీర్థాలు సదా ప్రవహించడం వల్ల చాల శీతలంగా, సుందరంగా ఉండే శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే నా స్వామి, తన వర్ణంతో సమానమైన వర్ణాన్ని కల మీతో కలసి వచ్చాడా? ఏమి? పరమకరుణాకరుడైన అతనికి ఈ విధంగా నన్ను కన్నీరు విడిచేటట్లుచేయడం ఒక అతిశయమా? మీరే చెప్పండి- అని అంటూ గోదాదేవి మేఘాలతో మొఱపెడు తున్నది.

ఈ దశకపాశురాలు తుశావంతి రాగంలో ఆదితాళంలో ఉన్నవి.

**129. అవ :** "ఓ మేఘాలలారా! మీరు నాకోసం ఔదార్యంలో కొత్తగా పరిచయాన్ని పొందాలా? ఔదార్యాన్ని సహజసిద్ధంగా కలవారుకదా మీరు! అందువల్ల ప్రార్థించే నాకోసం నోరు తెఱచి కనీసం ఒక మాట అయినా పలుకకూడదా! శ్రీవేంకటేశ్వరుని వృత్తాంతం మీకు తెలియకుండా ఉండదే! ఇతరులకు బంగారాన్ని, ముత్యాలను వర్షించే మీరు నాకు కనీసం నోటిమాటను పల్కడం అరుదా!" అని గోదాదేవి ఇందులో అంటున్నది.

**మాముత్త నిది శొరియుమ్ మాముగిల్‌గాళ్!, వేఙ్గడత్తు!**
**చ్చామత్తిన్ నిఱజ్గొణ్డ తాళాళన్ వార్‌త్తై యెన్నే!,**
**కామత్తీయుళ్ పుగున్దు కదువప్పట్టు ఇడైక్కఙ్గల్,**
**ఏమత్తోర్ తెన్దలుక్కు ఇఙ్గిలక్కాయ్ నా నిరుప్పేనే 8-2**

నల్లని వర్ణాన్నికల ఓమేఘాలలారా! మీరు నాకోసం ఔదార్యంలో ఇపుడు కొత్తగా పరిచయాన్ని కలుగజేసికోవాలా! ఔదార్యాన్ని సహజంగానే కలవారు మీరు. వెల కట్టలేని గొప్ప ముత్యాలను, బంగారాన్ని ఎవరూ అడుగకుండానే మీరు వర్షిస్తారుకదా! అటువంటి మీరు మీ పదాలపై పడి అర్థించే నాకోసం నోరు తెఱచి కనీసం ఒక మాటను పలుకరాదా! శ్రీవేంకటేశ్వరుని సంగతి మీకు తప్పక తెలిసి ఉంటుంది. ఏదైనా చెప్పకూడదా! ఆ స్వామి విషయంలో నాకు కల ఆ కామం (భక్తి) అనే అగ్ని నా బాహ్యేంద్రియాలను నిశ్శేషంగా దహిస్తూ, ఇక దానికి ఎఱ చాలక పోవడంవల్ల నా లోపలకుకూడా ప్రవేశించి దహిస్తున్నది. మలయమారుతం దానికి సహకరిస్తూ బాధను అతిశయింపజేస్తున్నది.ఈ రీతిలో ఈ రెండింటిచేతిలో చిక్కుకొని ఎంతకాలం తల్లడిల్లుతూ ఉంటాను!

**130. అవ :** దయను జూపే మేఘాలలారా! విరహంవల్ల నా దేహంలోని కాంతి, వర్ణం అన్నీ మారిపోయాయి. మనస్సు, నిద్ర నన్ను వదలిపెట్టిపోయాయి. నా



సౌందర్యం రూపుమాసింది. ఇకపై ఒకక్షణంకూడా నేను జీవించి ఉండలేను- అని గోదాదేవి ఇందులో విలపిస్తున్నది.

**ఒళివణ్ణమ్ వళైశిన్దై ఉఱక్కత్తోడు ఇవై యెల్లామ్,**
**ఎళిమైయాల్ ఇట్టెన్నై యీడళియ ప్పోయినవాల్,**
**కుళిరరువి వేఙ్గడత్తు ఎన్ గోవిన్దన్ గుణమ్ పాడి,**
**అళియత్త మేగఙ్గాళ్! ఆవికాత్తిరుప్పేనే 8-3**

భగవానుని విశ్లేషంవల్ల అనుభవించిన దుఃఖంతో నా శరీరశోభ మాఱి, వర్ణం చెడి, గాజులు వదులై, మనస్సు తల్లడిల్లి, నిద్రలేకుండా పోయింది. ఈ విధంగా నాగొప్పతనం అంతా నశించి బాధపడే నా స్థితినిగూర్చి ఏమని చెప్పను. విశ్లేషసమయాలలో నాయకుని కల్యాణగుణాలను కీర్తిస్తూ,ప్రాణాన్ని ధరించి ఉండాలని చూచినా, కాంతి, రంగు, గాజులు, మనస్సు పాడయిపోయేటట్లుగా ఏర్పడిన ఈ దశలో గుణకీర్తనాన్ని చేసి నాప్రాణాన్ని రక్షించుకొని తట్టుకోవడం నాకు సాధ్యమా! మీరే చెప్పండి.

**131 అవ :** శ్రీవేంకటాచలంలో లక్ష్మీదేవితో లీలారసాన్ని అనుభవించే స్వామితో అందమైన తమ వక్షఃస్థలంలో నా స్తనాలను హత్తుకొని నా ఆశ తీరేటట్లుచేయమని ఒక మాటను చెప్పండి - అని అంటూ మేఘాలను చూచి గోదాదేవి వేడుతున్నది.

**మిన్నాగత్తెళుగిన్ఱ మేగఙ్గాళ్!, వేఙ్గడత్తు,**
**త్తన్నాగ త్తిరుమఙ్గై తఙ్గియశీర్ మార్వర్‌క్కు,**
**ఎన్నాగత్తిళఙ్కొఙ్గై విరుమ్బిత్తాయ్ నాడోఱుమ్,**
**పొన్నాగమ్ పుల్‌గుదఱ్కు ఎన్ పురివుడైమై శెప్పుమినే 8-4**

భగవానుని నల్లని దివ్యదేహంలో మెఱపుతీగవంటి పిరాట్టి ప్రకాశించే తీరును తలపిస్తూ మెరుస్తూ ఆకాశంలో ఎగిరే అందమైన మేఘాలలారా! మీరు శ్రియః పతి, పరమకారుణికుడు అయిన శ్రీవేంకటేశ్వరుని దగ్గరకు పోయి ఒక మాటను చెప్పాలి. నా వక్షఃస్థలంలో ఉండే లేలేత స్తనాలను ఆ స్వామి ఆశపడి ఆలింగనం చేసికొంటూ నన్ను ఏనాడూ విడువకుండా ఉండాలి - అని నేను ఆశపడుతున్నాను- అనే విషయాన్ని మీరు అతనికి చెప్పాలి. ఎప్పుడూ మెఱపుతీగలతో కూడి ఉండే మీరు, లక్ష్మీదేవితో కలసి ఉండే వక్షఃస్థలాన్ని కలవాడైన ఆ స్వామికి నా మనః క్లేశాన్ని తెలియజేయవద్దా!

**"మిన్నాకత్తెళుకిన్ఱ"** - శరీరంలో ప్రకాశించే విద్యుల్లతను కల్గిన మీరు నాయకునకు దూరం అయిన నాపట్ల దయ చూపవద్దా - అని హార్దభావం. "తన్నాగ

త్తిరుమజ్జై తజ్గీయ శీర్ మార్వర్క్కు" - క్షణకాలం అయినా విశ్లేషించకుండా సదా వక్షఃస్థలంలో వేంచేసి ఉంటే లక్ష్మినిని కల స్వామి తన విరహార్తితో బాధపడే నన్ను ఉపేక్షించవచ్చునా? అని ఈ ప్రయోగంలోని హృదయం.

**132. అవ :** ఆశ్రితులను రక్షించడంకోసం తన వాడి గోళ్ళతో హిరణ్యకశిపుని వక్షస్సును చీల్చిన స్వామి తన స్వభావాన్ని మఱచి, అతనినే నమ్మి ఉన్న నన్ను బాధపెడుతున్నాడు. నానుండి దోచుకొని పోయిన చేతి గాజులను నాకు తిరిగి ఇవ్వమని అతని దగ్గరకు పోయి నా దురవస్థను అతనికి తెలియజేయండి- అని తిరుమలలో గుంపు గుంపులుగా సంచరించే మేఘాలతో శ్రీగోదాదేవి అంటున్నది.

> **వాన్ కొణ్డు కిళర్న్దెழுన్ద మాముగిల్గాళ్!, వేఙ్గడత్తు**
> **త్తేన్కొణ్డ, మలర్ శిదఱ త్తిరణ్డేఱి ప్పొழிవీర్గాళ్!,**
> **ఊన్ కొణ్డ వళ్ళుగిరాల్ ఇరణియనై ఉడలిడన్దాన్,**
> **తాన్కొణ్డ శరివళైగళ్ తరుమాగిల్ శాற்ఱుమినే** 8-5

ఆకాశంలో అంతటా ఎక్కడ చూచినా మీరే అన్నట్లుగా వ్యాపించి, ఆకాశాన్ని కబళీకరించి, సంచరిస్తున్న మేఘాలలారా! తేనె నిండిన చక్కని పూలు చెదఱి పడే రీతిలో హానిని కల్గిస్తూ మీరు వర్షిస్తే ఏం ప్రయోజనం? ఇతరులకు బాధను కల్గించడమేనా మీకు పురుషార్థం! బాధపడేవారిని ఆనందసముద్రంలో మునిగేటట్లు మీరు చేయవద్దా! అనిష్టాన్ని తీర్చడంతో పాటు ఇష్టాన్ని ప్రసాదించడంకూడా చేయవద్దా! విరహదశలో ఇపుడు నాకు అనిష్టం అయిన పూలను చెదఱిపడేటట్లు చేసినంత మాత్రంతో చాలదు. భగవత్ సంశ్లేషంఅనే ఇష్టప్రాప్తిని కూడా కల్గించాలి. లోకాల కష్టాన్ని పోగొట్టడంకోసం క్రూరులైన అసురసమూహాలను నశింపజేసి, హిరణ్యకశిపుని శరీరాన్ని తన నిశిత నఖాలతో చీల్చిన స్వామి నాదగ్గర నుండి అపహరించుకొని పోయిన చేతి గాజులను నాకు తిరిగి ఇవ్వమని పల్కి, నా దురవస్థను అతనికి చెప్పండి.

స్వామి తాను అపహరించిన గాజులను తిరిగి ఇవ్వడం అంటే - ఆమె ప్రార్థనను మన్నించి అనుగ్రహించడమే.స్వామి విరహార్తివల్ల శరీరం కృశించగా, గాజులు వదులై జారిపోయాయి. స్వామి అనుగ్రహిస్తే మళ్ళీ శరీరం బలాన్ని పొంది గాజులు నిలుస్తాయి- అని హార్దభావం.

**133. అవ :** తనను ఆశ్రయించిన దేవతలను రక్షించడంకోసం మహాబలిదగ్గర నుండి భూమిని స్వీకరించిన స్వామి వేంచేసి ఉండే తిరుమలలోనే కదా మీరు



వ్యాపించి ఉన్నారు. పెద్ద దోమలు తిన్న వెలగపండువలె నేను, నామనస్సు బాధపడే టట్లు నాలో ప్రవేశించి, నా వైలక్షణ్యాన్ని అంతటిని అపహరించిన నారాయణునకు నా కష్టాన్ని తెలియజేయండి - అని గోదాదేవి మేఘాలను ప్రార్థిస్తున్నది.

> **శలఙ్గొణ్డు కిళర్న్దెழுన్ద తణ్ముగిల్గాళ్, మావలియై**
> **నిలఙ్గొణ్డాన్ వేఙ్గడత్తే నిరన్దేఱి ప్పొழிవీర్గాళ్!,**
> **ఉలఙ్గుణ్డ విళఙ్కనిపోల్ ఉళ్ మెలియ ప్పుగున్దు, ఎన్నై**
> **నలఙ్గొణ్డ వారణఱ్కు ఎన్ నడలైనోయ్ శెప్పుమినే** 8-6

మేఘలలారా! మీ రూపసౌందర్యం, చల్లదనం అంతా భోగ్యంగానే ఉన్నాయి. అందులో ఏకొఱతా లేదు. కాని, ప్రయోజనాంతరపరులైన దేవతలకోసం తనను యాచకునిగా చేసికొని, వారి కార్యాన్ని పూర్తిచేసిన త్రివిక్రమస్వామి వేంచేసి ఉండే దేశంలో నిత్యనివాసాన్ని చేసే మీరు అనన్యప్రయోజన అయిన నాకోసం పనిచేయవద్దా! భగవానునివలె మిమ్ములను ఒక అసురుని దగ్గరకు పోయి కార్యం సాధించాలని అంటున్నానా? స్వామి దగ్గరకుకదా నేను మిమ్ములను పొమ్మని అంటున్నాను. నా కార్యాన్ని చేయకుండా ఉంటే అది మీకు దోషమేకదా! పెద్ద దోమలు వెలగపండులో ప్రవేశించి దానిలోని రసం అంతా పీల్చేటట్లు నా మనస్సున ప్రవేశించి, నా సర్వస్వాన్ని అహరించిన నారాయణమూర్తికి నేను ఈ విధంగా బాధపడుతూ ఉన్నానని దయతో తెలియజేయండి.

**134. అవ :** "నా స్తనాలపై అలదిన కుంకుమపంకం బాగా చెరిగిపోయేటట్లు కనీసం ఒక్కనాడు అయినా నీవు వచ్చి సంశ్లేషించినపుడే నాప్రాణాలు నిలుస్తాయి, లేకపోతే నిలువవు'' అనే నా విన్నపాన్ని అతని దగ్గర దయతో చెప్పండి- అని తిరుమలలో సంచరించే మేఘాలను ఉద్దేశించి గోదాదేవి అంటున్నది.

> **శఙ్గమా కడల్ కడైన్దాన్ తణ్ ముగిల్గాళ్!, వేఙ్గడత్తు**
> **చ్చెఙ్గణ్మాల్ శేవడిక్కీழ் అడివీழ்చ్చి విణ్ణప్పమ్,**
> **కొఙ్గైమేల్ కుఙ్గుమత్తిన్ కుழம్బుழிయ ప్పుగున్దు, ఒరునాళ్**
> **తఙ్గుమేల్ ఎన్నావి తఙ్గు మెన్ఱు ఉరైయీరే** 8-7

శంఖాలు నిండిన గొప్పతనాన్ని కల సముద్రాన్ని చిలికి, ఆవిధంగా తనను శ్రమపెట్టుకొని తనను ఆశ్రయించినవారి కార్యాన్ని సాధించిన స్వామి వేంచేసి ఉండే దివ్యదేశం అయిన వేంకటాచలంలో సంచరించే పరమౌదార్యాన్ని కల మేఘాలలారా! మీరు శ్రీవేంకటేశ్వరుని పర్వతపాదప్రదేశంలో దాసురాలి విజ్ఞాపనను

విన్నపించాలి. నా విన్నపం ఏమి? అంటే, "నా స్తనాలపై అలంకారంగా పూసిన కుంకుమపంకం చెదఱి చెరిగిపోయే రీతిలో ఒక్కనాడైనా నాతో అతడు సంశ్లేషిస్తే నా ప్రాణాలు నిలుస్తాయి" అన్నదే నా విన్నపం. నా స్వామి ఏదో ఒకనాడు నాతో సంశ్లేషిస్తాడనే నమ్మకంతోనే నా స్తనాలపై కుంకుమను పూసి అలంకరించుకొన్నాను. అది సప్రయోజనం అయేటట్లు చేసేవాడైనపుడే నా ప్రాణాలను ధరించగలను - అని చెప్పండి.

**135. అవ** : యుద్ధరంగంలో పోరు సల్పి, విజయాన్ని సాధించిన శ్రీరాముని తిరునామాలను సంకీర్తనం చేస్తూ, వర్షాకాలంలో జిల్లేడు ఆకులు రాలిపడే రీతిలో, నేను నశించడానికి సిద్ధంగా ఉన్నాను. "ఒకనాడైనా తమ ఒకమాటను నాకోసం అనుగ్రహించడా?" అని అంటూ వర్షాకాలంలో తిరుమలకొండపై కన్పించిన మేఘాలను ఉద్దేశించి గోదాదేవి వేడుతున్నది.

**కార్‌కాలత్తె*ழு*గిన్ఱ కార్‌ముగిల్‌గాళ్!, వేఙ్గడత్తు**
**ప్పోర్ కాలత్తు ఎ*ழு*న్దరుళి ప్పొరుదవనార్ పేర్ శొల్లి,**
**నీర్‌కాలత్తు ఎరుక్కి నమ్ ప*ழு*విలైపోల్ వీ*ழ்*వేనై,**
**వార్‌కాలత్తు ఒరు నాళ్ తమ్ వాశగమ్ తన్దరుళారే 8-8**

ఉదారమైన స్వభావాన్ని కల కాలమేఘాలలారా! వర్షాకాలానికి నేను తప్పకుండా వచ్చి చేరతాను- అని చెప్పిపోయిన స్వామి రాకపోయినా, అతని దివ్యరూపాన్ని పోలిన మీరైనా వచ్చి కన్పిస్తున్నారుకదా! చాలా సంతోషంగా ఉన్నది. ఆస్వామి రాకపోయినా ఆస్వామి నామసంకీర్తనం చేసి ఒకరీతిలో ప్రాణధారణను చేయవచ్చునని తలచిన నేను, ఆశ్రితుల కార్యాన్ని చేయడమే స్వభావంగా కల్గి, విరోధినిరసనంలో ఉత్సాహాన్ని పొంది, ప్రయత్నించే శ్రీరాముని తిరునామాలను సంకీర్తనం చేయడం ప్రారంభించాను. తత్కారణంగానే వెంటనే మన శ్రైథిల్యాన్ని పొందాను. వర్షాకాలంలో జిల్లేడు ఆకులు పట్టు వీడి రాలి కిందపడే రీతిలో నేను శిథిలమై పతనానికి సిద్ధంగా ఉన్నాను. ఈ స్థితిలోకూడా భగవానుడు నన్ను కటాక్షించాలని అనుకోవడం లేదు. నేను బ్రతికిన నాళ్ళను అన్నిటినీ ఈ విధంగా దుఃఖమయంగానే గడుపవలసివస్తున్నదే. ఒకనాడైనా ఒక మంచి మాటను అతడు చెప్పి పంపడా!

**136. అవ** : లోకాలను అన్నిటినీ రక్షించడంకోసం యోగనిద్రలో ఆదిశేషునిపై పరుండి ఉండే స్వామి ఈ విధంగా అసత్యభాషణం చేస్తాడా ! అతడు తన



ఆశ్రితరక్షణస్వభావాన్ని మఱచిపోయి ఒక స్త్రీని ఈ రీతిలో వధిస్తున్నాడు. అయితే, దీనిని భూమిలోని వారెవ్వరూ సమర్థించరు- అని అంటూ మత్తగజాలవలె తిరుమలపై సంచరించే మేఘాలను ఉద్దేశించి గోదాదేవి పల్కుతున్నది.

**మదయానై పోలె*ழு*న్ద మాముగిల్‌గాళ్!, వేఙ్గడత్తై**
**ప్పదియాగ వా*ழ்*విర్‌గాళ్! పామ్బణైయాన్ వార్‌త్తై ఎన్నే,**
**కది యెన్ఱుమ్ తానావాన్ కరుదాదు, ఓర్ పెణ్‌కొడియై**
**వదై శెయ్‌దా నెన్నుమ్ శొల్ వైయగత్తార్ మదియారే 8-9**

శ్రీవేంకటేశ్వరుని నిరంతరం సేవిస్తూ, అందువల్ల మదించిన ఏనుగులవలె గర్వంగా తిరుమలలో సంచరించే మేఘాలలారా! ఆదిశేషుని దగ్గరనుండి సకల కైంకర్యాలను స్వీకరించేటట్లే, నా దగ్గరనుండికూడా కైంకర్యాలను స్వీకరిస్తాడని నమ్మి ఉన్నాను. **"మా శుచః"** అనే అతని మాటను సత్యం అని విశ్వసించాను. రెండు నాల్కలను కల పాముతో కలసి ఉండే స్వామి ఆ పాముకుండే ఆ రెండు నాల్కల స్వభావాన్ని పొందాడు కాబోలు! సకలజనాలకు సర్వవిధరక్షకుడని పేరు పొందినవాడు ఒక స్త్రీని వధించాడు అని అంటే ఈ లోకంలోనివారు నమ్ముతారా!

**137. అవ** : ఈ చివరి పాశురంతో ఈ దశకాన్ని అభ్యసించినవారు పొందే ఫలాన్ని గోదాదేవి తెలియజేస్తున్నది.

**నాగత్తి నణైయానై నన్నుదలాళ్ నయన్దు ఉరై శెయ్**
**మేగత్తై వేఙ్గడక్కోన్ విడు తూదిల్ విణ్ణప్పమ్,**
**పోగత్తిల్ వ*ழு*వాద పుదువైయర్‌కోన్ కోదై తమి*ழ்*,**
**ఆగత్తు వైత్తురైప్పారవర్ అడియారాగువరే 8-10**

తాము ప్రార్థించిన రీతిలో భగవదనుభవాన్ని పొంది సంతోషించిన పెరియా*ழ்*వార్ల కుమార్తె అయిన శ్రీగోదాదేవి ఆదిశేషునిపై శయనించి, యోగనిద్రలో ఉండే పరవాసుదేవుడైన శ్రీవేంకటేశ్వరుని ఆశపడి, అనుగ్రహించిన మేఘదూతమైన ఈ దశకాన్ని పఠించేవారు ఆస్వామి నిత్యకైంకర్యసామ్రాజ్యాన్ని పొంది, ఎల్లప్పుడూ సుఖిస్తారు.

**138. అవ** : గోదాదేవి భగవద్విరహాన్ని ఉపశమింపచేసికోవడంకోసం ఉద్యానవనానికి వెళ్ళింది. అక్కడ మల్లెపూవులు కంటికి కన్పించి, ఆమెను బాధను ఇనుమడింప జేశాయి. అక్కడనుండి తన చూపును తప్పించి, ఆమె ఏదిక్కులో చూచినాగానీ, ఒక్కొక్క పూవు కంటికి కన్పించి, హింసించడం ప్రారంభించింది. అంతటితో

గోదాదేవి కన్నులను మూసికొన్నది. ఆమె కన్నులను మూసికొన్నదే తప్ప, ఆమె బాధ ఏమీ తగ్గలేదు. చెవిని మూసికొనలేకపోవడంవల్ల కోయిలల పాటలు వెంటనే ఆమె చెవికి సోకాయి. వాటిని విని భరించలేకపోవడంవల్ల ఆమె ఆ కోయిలలను చూచి, "ఎందుకు మీరు ఈ విధంగా కర్ణకఠోరంగా అరుస్తున్నారు? చాలు! చాలు! మీరు పాడిన అందం చాలు! దయచేసి నిలపండి!'' అని అంటున్నది.

**పాడుమ్ కుయిల్గాళ్! ఈదు ఎన్న పాడల్?, నల్వేఙ్గడ**
**నాడర్ నమక్కు ఒరు వాఴ్వు తన్దాల్ వన్దు పాడుమిన్,**
**ఆడుమ్ కరుళక్కొడియుడైయార్ వన్దు అరుళ్ శెయ్దు,**
**కూడువరాయిడిల్ కూవినుమ్ పాట్టుక్కళ్ కేట్టుమే** **10-5**

ఒళ్ళు తెలియకుండా పాడుతున్న కోయిలలారా! కర్ణకఠోరంగా అయిన మీ ఈ కూతలు చాలు. నిలపండి. ఇవేమి పాటలు! ఈ కాలంలోనా పాడడం! చాలు! చాలు! మీ పాట అందం! నిలపండి. మీ పాటలు వినే స్థితిలోనా నేను ఉన్నాను! అయ్యో! ఏమి పాట! ఏమి పాట! పాపిష్ఠివారలారా! పాడినది చాలు! ఇప్పటికి చాలు! కోపించకండి.

భగవానుడు అనుగ్రహించి, ఇక్కడకు వేంచేసి, నన్ను ఆలింగనం చేసికొని, ఉజ్జీవింపజేసే కాలం వస్తే, అపుడు మీరు ఇక్కడకు వచ్చి మీ ఆశ తీరేటట్లు పాడండి.

శ్రీవేంకటేశ్వరుడు వచ్చి నీకు ఉజ్జీవనం కల్గించే సమయం మాకు ఏవిధంగా తెలుస్తుంది? అని అంటారా! స్వామి రాకకు సూచకంగా గరుడుడు తన రెక్కలను విస్తరించి, నర్తిస్తూ వస్తాడు.ఆ గుర్తును చూచే మీరు గ్రహించవచ్చు. ఒకవేళ మీరు తెలిసికోలేక పోయినా, అపుడు నేనే మిమ్ములను రప్పించి, మీపాటను వింటాను. మీరు సందేహపడవద్దు.

ఈ పాశురం తరువాతి పాశురం కాంభోజిరాగంలో - త్రిపుటతాళంలో ఉన్నది.

**139. అవ :** గోదాదేవి వర్షాన్ని కురవబోయే మేఘాలను చూచి తన విరహార్తి జ్వలించడం ప్రారంభించగానే సహించలేక, వాటితో ఈ విధంగా అంటున్నది.

**మఴైయే మఴైయే మణ్ పుఱమ్ పూశి ఉళ్ళాయ్ నిన్టు,**
**మెఴుకూఱ్ఱినాల్పోల్ ఊఱ్ఱు వల్ వేఙ్గడత్తుళ్ నిన్ట,**



**అఴకప్పిరానార్ తమ్మై ఎన్నెఞ్జత్తగప్పడ**
**త్తఴువి నిన్టు, ఎన్నై త్తదైత్తుక్కొణ్డు ఊఱ్ఱవుమ్ వల్లైయే** **10-8**

ఓ మేఘాలలారా! వర్షించే మేఘలలారా! పైన మన్నును పూసి, లోపల ఉండే మైనాన్ని కరగించి, తీసివేసే రీతిలో ఆ స్వామికూడా నన్ను శరీరంపైన ఆలింగనం చేసికొని, లోపల ఉండే నా సత్తను కరగించి పారబోస్తున్నాడు. ఈ విధంగా చేయగల వేంకటాద్రివాసుడైన, సుందరుడైన స్వామి నా మనస్సులో సేవను అనుగ్రహించిన రీతిలోనే నేను ప్రత్యక్షంగా హత్తుకొనేటట్లు చేసి, నన్ను అతనితో గాఢంగా ఒకటిగా చేరేటట్లు చేసిన తర్వాతనే వర్షించండి. ఇదేకదా ఔదార్యం కలవారు చేసే పని.

## తిరుప్పాణ్ ఆఴ్వార్లు

వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణం నిచుళాపురే ।
శ్రీవత్సాంశం గాయకేంద్రం మునివాహన మాశ్రయే ॥

శ్రీరంగక్షేత్రానికి సమీపంలో ఉండే ఉఱైయూర్‌లో కలియుగంలో దుర్మతినామ సంవత్సరం వృశ్చికమాసం కృష్ణద్వితీయా బుధవారంనాడు రోహిణీనక్షత్రంలో శ్రీవత్సాంశతో అయోనిజులుగా ఈ ఆఴ్వార్లు అవతరించారు. సంతానం లేని ఒక మాలదాసరి వీరిని పెంచి పెద్దచేశాడు. భగవానుని అనుగ్రహంవల్ల వీరికి దివ్యజ్ఞానం కల్గింది. తాము అంత్యవర్ణానికి చెందినవారమని భావించిన తిరుప్పాణ్, శ్రీరంగనాథుని పట్ల అపారమైన భక్తిని కలవారైనా, అప్పటి సంఘవ్యవస్థనుబట్టి, కావేరీనది దక్షిణతీరం ఆవలివైపున ఉండి, వీణను మీటుతూ, భగవద్గుణగానాన్ని చేస్తూ కాలం గడిపేవారు. ఒకనాడు శ్రీరంగనాథుడు వీరిని అనుగ్రహించి, బలవంతంగా అయినా తనవద్దకు తీసికొనిరమ్మని లోకసారంగముని అనే ఆలయపరిచారకుని అర్చకముఖంగా ఆజ్ఞా పించాడు. లోకసారంగముని బలవంతంగా తనను భుజాలపైకి ఎక్కించుకొని శ్రీరంగనాథుని దగ్గరకు తీసికొనిపోయే సమయంలో తిరుప్పాణ్ శ్రీరంగనాథుని దివ్యరూపాన్ని ఆపాదమస్తకం సేవిస్తూ ఆ అనుభవాన్ని వ్యక్తంచేసే అమలనాదిపిరాన్ అనే 10 పాశురాలనుకల గొప్ప ప్రబంధాన్ని అనుగ్రహించారు.

### అమలనాదిపిరాన్

**140. అవ :** అమలనాదిపిరాన్ ప్రబంధంలో శ్రీవేంకటేశ్వరుణ్ణి స్తుతించే పాశురాలు రెండు ఉన్నాయి. వాటిలో మొదటిది అయిన ఈ పాశురంలో శ్రీరంగనాథుని

శ్రీచరణసౌందర్యం నన్ను వశపఱచుకొని, పరవశుణ్ణి చేసి దాసునిగా చేసికొన్నది- అని ముగ్ధులై తిరుప్పాణ్ ఆళ్వార్లు పల్కుతున్నారు.

అమలనాదిపిరాన్ అడియార్క్కు ఎన్నై ఆట్పడుత్త
విమలన్ విణ్ణవర్కోన్ విరైయార్ పొళిల్ వేఙ్గడవన్
నిమలన్ నిన్మలన్ నీదివానవన్ నీళ్ మదిళరఙ్గత్తమ్మాన్ తిరు
క్కమలపాదమ్ వన్దు ఎన్కణ్ణినుళ్ళన వొక్కిన్ఱదే -1

హేయవస్తువుల సంబంధంతో తనకు ఏవిధమైన దోషం ప్రాప్తించనివాడై, అందఱి చేత అభిలషింపబడతగినవాడై, అన్ని లోకాల సృష్టి-స్థిత్యాదికార్యాలకు అన్నిటికీ కారణ భూతుడైనవాడై, వీటివల్ల ప్రకాశించే కల్యాణగుణగణాలను కలవాడై, కరుణా మూర్తియై, ఈ స్థితులను అన్నిటినీ నాకు తెలియజేసిన మహోపకారకుడై, "నాకు'' అని, "ఇతరు లకు'' అని తలుస్తూ ఇంతకాలం పరిభ్రమించిన నన్ను తనకు, తన దాసులకు దాసునిగా చేసిన, గొప్ప కీర్తిని కలవాడై, పరమభోగ్యం అయిన పరమపదంలో సదాపశ్యంతిగా చెప్పబడే నిత్యసూరులకు స్వామిగా ఉన్నా, లీలావిభూతిలో కైంకర్యాన్ని స్వీకరించడంకోసం పరిమళప్రచుర దివ్యోద్యానాలచే పరివేష్టితం అయిన తిరుమలకు వచ్చి, నిత్యనివాసం ఏర్పరచుకొన్నవాడై, నేను అభిలషించకపోయినా, నాకు ఉపకారం చేసినందువల్ల మిక్కిలిగా ప్రకాశించేవాడై, తన దాసులకు నన్ను దాసునిగా చేసికొన్నందువల్ల కల్గిన ఔజ్జ్వల్యాన్ని కలవాడై, "సొత్తు- సొత్తుదారుడు'' అనే క్రమం తప్పని నిత్యవిభూతిలో ఉండేవాడై, గొప్ప ప్రాకారాలను కల శ్రీరంగంలో శయనించి ఉండేవాడై, సర్వస్వామి అయిన శ్రీరంగనాథుని ఎఱ్ఱదనం, శైత్యం, వికాసం, సౌగంధ్యం కల, పరమభోగ్యం అయిన శ్రీపాదపద్మాలు తమకు తామే నన్ను అనుగ్రహించి వచ్చి, అతినీచుణ్ణి అయిన నా కన్నులకు లక్ష్యమై ఉన్నాయే! ఆహా! ఇదేమి ఆశ్చర్యం!

యమునా కల్యాణిరాగం - త్రిపుటతాళంలో ఈ పాశురం, తరువాతి పాశురం ఉన్నవి.

**"అమలన్"** - తాము దరి చేరితే స్వామికి దోషం కల్గుతుందనే తమ శంకను తీర్చినవాడు. **"నిమలన్"** - తమను భాగవతపర్యంతం శేషభూతులనుగా చేసినవాడు. **"విమలన్"**- తమ మనస్సులోని శంకను తీర్చి, దానివల్లకల్గిన సంతోషాతిశయంచేత వెలిగే దివ్యమంగళ విగ్రహాన్ని కలవాడు. **"నిన్మలన్"** - ఆశ్రితుల దోషాలను ఎంచే



లోపం లేనివాడు. **"ఆది"**- జగత్కారణభూతుడు, స్పృహణీయుడు. **"ఎన్నై"** - ఈ సర్వనామశబ్దం వక్తృవివక్షవల్ల - అతి నికృష్టుణ్ణి అయన నన్ను - అనే అర్థాన్ని ఇస్తుంది. **"అరఙ్గత్తమ్మాన్"** - అని శేషిత్వం, **"కమలపాదమ్"** అని భోగ్యత, **"వన్దు"** అని ఉపాయం చెప్పబడ్డాయి. **"ఒక్కిన్ఱదు"** - ఒకే రీతిలో, ఏ మార్పులేక ఉన్నది అని, రక్షకునకు శీలసిద్ధిని, రక్ష్యభూతునకు స్వరూపసిద్ధిని కల్గిస్తున్నదని భావం.

**141. అవ :** ఈ పాశురంలో శ్రీరంగనాథుని విషయంలో వేంకటేశ్వరుని స్వభావం ఉన్నదని, స్వామి పీతాంబరం అందం తిరునాభీకమలంపై వ్యాపించి దాసుని ఆత్మ స్వరూపాన్ని వశీకరించుకొన్నది- అని అంటున్నారు.

మన్ది పాయ్ వడవేఙ్గడమామలై వానవర్గళ్
శన్ది శెయ్య నిన్ఱాన్ అరఙ్గత్తరవినణైయాన్
అన్దిపోల్ నిఱత్తాడైయుమ్ అదన్మేల్ అయనైప్పడైత్తదు ఓరెళిల్
ఉన్దిమేలదన్ఱో అడియే నుళ్ళత్తిన్నుయిరే -3

అతిచంచలం అయిన బుద్ధిని కల్గి, వినోదాన్ని కల్గించే చేష్టలను చేసే వానరాలు ఒక కొమ్మనుండి ఇంకొక కొమ్మకు నిరంతరం గెంతుతున్న చోటు, ద్రవిడదేశానికి ఉత్తరదిక్కు ఎల్ల అయిన వేంకటాచలం అనే గొప్ప పర్వతంపైన నిత్యసూరులు పుష్పాలను తీసికొని, తన శ్రీపాదాలను ఆరాధించేటట్లుగా వేంచేసి ఉన్నవాడైన నా స్వామి, పరమభోగ్యం అయిన శ్రీరంగదివ్యాలయంలో అందం, చల్లదనం, మార్దవం, పరిమళం, ధావళ్యం - మొదలైన అయిదు గుణాలతో కూడి, చాలా భోగ్యంగా ఉండే ఆదిశేషుడనే దివ్యపర్యంకంలో శయనించి ఉన్నాడు. ఆ భగవానుని ఎఱ్ఱని ఆకాశంవంటి పీతాంబరం పైన, దానికి పైభాగంలో చతుర్ముఖుని ఉత్పత్తిస్థానం అయిన, సాటిలేని సౌందర్యాన్నికల తిరునాభీకమలంపైన దాసుని మధురమైన ఆత్మస్వరూపం చిక్కుకొని ఉన్నది. ఇదేమి ఆశ్చర్యం!

**"మన్ది పాయ్"** - చపలచిత్తులై ఎల్లప్పుడూ అస్థిరులుగా ఉండే సంసారులకు **"మన్ది"** ఉపలక్షణం. **"అన్దిపోల్ నిఱమ్"** - భక్తుల అజ్ఞానతమస్సును తీర్చే ఉదయ సంధ్యగా, వారి తాపాన్ని తీర్చే సాయంసంధ్యగా ప్రకాశిస్తున్నది. **"శన్ది శెయ్య"** - సంధ్యాకాలకర్తవ్యం. అంటే - భగవత్కైంకర్యం. భగవత్సేవ సదా కర్తవ్యమే అయినా, సంధ్యాసమయాలలో తప్పక చేయాలని శాస్త్రాలలో విశేషించి విధింపబడిందికదా!

# తిరుమజ్గై ఆళ్వార్లు

వృశ్చికే కృత్తికాజాతం చతుష్కవిశిఖామణిమ్ ।
షట్ప్రబంధకృతం శార్జ్గమూర్తిం కలిహ మాశ్రయే ॥

కలియుగంలో నళనామ సంవత్సరం వృశ్చికమాసం శుక్లపక్షపూర్ణిమ గురువారం కృత్తికానక్షత్రంలో శార్జ్గమనే భగవానుని వింటి అంశతో తిరుక్కుఱైయలూర్ అనే దివ్యదేశంలో తిరుమజ్గైమన్నన్ అవతరించారు. వీరు పద్మాంశంతో జన్మించిన కుముదవల్లినాచ్చియార్‌ను వివాహం చేసికొన్నారు. ఆమె పెట్టిన నియమానుసారం ప్రతిదినం భాగవతతదీయారాధనను నిర్వహించేవారు. దాని నిర్వహణకోసం ఆవశ్యక మైన ద్రవ్యాన్ని సంపాదించడానికిగా దారిదోపిడీలనుకూడా చేశారు. కొంత కాలానికి భగవానుడు వీరిని అనుగ్రహించదలచి, పెండ్లికుమారుని రూపంలో సలక్ష్మీకుడై వీరుండే దారిలో వచ్చాడు. భగవానుని అన్ని ఆభరణాలను దోచుకొన్న తిరుమజ్గైమన్నన్, చివరిగా స్వామి పాదంలో గల ఆభరణాన్ని బలవంతంగా పంటితో కొఱికి తీయాలని చూచారు. అపుడు భగవానుని పాదస్పర్శ ప్రభావంచేత దివ్యజ్ఞానాన్ని పొందిన తిరుమజ్గై ఆళ్వార్లు మొదటగా **"నాన్ కణ్డుకొణ్డేన్ నారాయణా ఎన్నుమ్ నామమ్"** అని అంటూ ప్రారంభించి పెరియ తిరుమొழி, తరువాత తిరువెழுకూర్ఱిరుక్కై, శిఱియ తిరుమడల్, పెరియ తిరుమడల్, తిరుక్కుఱు న్దాణ్డకమ్, తిరునెడున్దాణ్డకమ్ - అనే ప్రబంధాలను కూడా ప్రసాదించారు. ఈ ఆఱు ప్రబంధాలు వేదసారాలుగా చెప్పబడే నమ్మాళ్వార్ల నాల్గు ప్రబంధాలకు వివరణరూపాలు. కనుక ఇవి షడంగస్థానీయాలని ఆచార్యుల సూక్తి. వీరికి అర్చావతారంలో అభినివేశం ఎక్కువ. శ్రీరంగాలయాన్ని జీర్ణోద్ధారణను చేసిన వీరు అక్కడ అధ్యయనోత్సవాలనుకూడా నిర్వహించారు. పలు దివ్యదేశాలను దర్శించి, అచటి అర్చామూర్తులకు మంగళాశాసనాన్ని చేశారు. ముందుగా పెరియ తిరుమొழி ప్రబంధంలో శ్రీవేంకటేశ్వరుని కీర్తించే దశకాలు, ఆ తరువాత ప్రత్యేక పాశురాలు విన్నపింపబడుతున్నాయి.

## పెరియతిరుమొழி

**142. అవ :** పెరియతిరుమొழி పూర్వదశకంలో తిరుమజ్గైమన్నన్ శిజ్గవేழுకున్ఱమ్ అనబడే అహోబిలక్షేత్రంలోని వేడిమిని తలచి, ద్రవించారు. దానిని చూచిన భగవానుడు ఆళ్వార్లు! **"తెழிకురలరువి త్తిరువేజ్గడమ్"** అని మనస్సు చల్లబడేటట్లు



తిరుమలలో అందటికీ సులభంగా నేను సేవను అనుగ్రహిస్తున్నాను కదా! అచటికి వచ్చి నన్ను సేవించి, ఆనందించండి''అని పలికాడు. అందులకు అంగీకరించిన ఆళ్వార్లు తిరు మలకు వేంచేసి దాని వైభవాన్ని ఈ దశకంలో కీర్తిస్తున్నారు. పెరియతిరుమొழி ప్రబంధంలో ఈ దశకంతోపాటు, తరువాత గల మూడు దశకాలుకూడా శ్రీవేంక టేశ్వరునిగూర్చి తిరుమజ్గై ఆళ్వార్లు పల్కినవే.

"శ్రీకృష్ణుడై అవతరించి, క్షీరాబ్ధిలో శయనించే శ్రీమన్నారాయణుడే తిరుమలలో నెలకొని ఉన్నాడు. అందువల్ల ఆ తిరువేజ్గడాన్ని ఎల్లప్పుడూ అనుసంధించు''- అని అంటూ ఇందులో తమ మనస్సుకు ఆళ్వార్లు ఉపదేశిస్తున్నారు.

**కొజ్గలర్న్దమలర్ క్కురున్దమ్ ఒశిత్త కోవలన్ ఎమ్బిరాన్,**
**శజ్గుతజ్గు తడజ్గడల్ తుయిల్ కొణ్డ తామరై క్కణ్ణినన్,**
**పొజ్గు పుళ్ళినై వాయ్ పిళన్ద పురాణర్ తమ్మిడమ్, పొజ్గు నీర్**
**చ్చెజ్గయల్ తిళైక్కుమ్ శునై త్తిరువేజ్గడమ్ అడై నెఞ్జమే!** **1-8-1**

సుగంధాన్ని వెదజల్లే పూలలో నిండిన కుందవృక్షాన్ని కూల్చిన గోపాలకృష్ణుడు, మనకు స్వామి, శంఖాలు నిండి ఉండే గొప్ప క్షీరాబ్ధిలో శయనించిన పుండరీకాక్షుడు, మదించి మీదకు వచ్చిన బకాసురుని నోటిని చీల్చి వేసిన పురాణపురుషుడు అయిన శ్రీమన్నారాయణుడు పరమకృపతో వేంచేసి ఉండేది, నీటిసమృద్ధిని కల్గినది, ఎఱ్ఱని చేపలను కల్గి ఉన్న వాగులను కల్గిఉండేది అయిన శ్రీవేంకటాచలాన్ని ఓ మనసా! ఆశ్రయించు.

ఈ దశకపాశురాలు అన్నీ యమునాకల్యాణి రాగం - త్రిపుట తాళంలో ఉన్నాయి.

**143. అవ :** "పూతన అనే పిశాచి విషస్తన్యాన్ని ఆరగించిన శ్రీకృష్ణుడు పాలకడలిలో పరుండి ఉన్నాడు. శ్రీవేంకటాద్రిపై నిలచి ఉన్నాడు. అతనిని ఆశ్రయించాలని ప్రయత్నించు.'' అని అంటూ ఇందులో ఆళ్వార్లు తమ మనస్సును ఉద్దేశించి పల్కుతున్నారు.

**పళ్ళియావదు పాఱ్కడల్ అరజ్గమ్ ఇరజ్గవన్ పేయ్ములై,**
**పిళ్ళైయాయ్ ఉయిరుణ్డ ఎన్దై పిరానవన్ పెరుగుమిడమ్,**
**వెళ్ళియాన్ కరియాన్ మణినిఱవణ్ణ నెన్జెణ్ణి నాడొఱుమ్,**
**తెళ్ళియార్ వణజ్గుమ్ మలై త్తిరువేజ్గడమ్ అడై నెఞ్జమే!** **1-8-2**

స్వామి చిన్నబాలుడై, పిశాచి విషం పూసిన స్తన్యాన్ని గ్రోలి, తన బాల్యక్రీడను అనుభవింపజేసినది - రేపల్లెలో. శయనించి ఉండి, లోకసంరక్షణలీలను అనుభవింప జేసినది - పాలసముద్రంలోను, శ్రీరంగంలోను. అందటికీ సేవను అనుగ్రహిస్తూ వేంచేసి ఉన్న చోటు - పరమభోగ్యం అయిన తిరుమల. స్వచ్ఛమైన జ్ఞానాన్ని కల భక్తాగ్రేసరులు దీనిని గ్రహించి, "కృతయుగంలో శ్వేతవర్ణుడుగా, కలియుగంలో నీలవర్ణుడుగా, ద్వాపరయుగంలో మణివర్ణుడుగా స్వామి వేంచేసి ఉన్నాడు. అతడే వేంకటాద్రిలో నిత్యవాసం చేస్తున్నాడు''- అని భావించి, ప్రతిదినం నమస్కరిస్తారు. అటువంటి శ్రీవేంకటాచలాన్ని ఓమనసా! అనుసంధించు.

**144. అవ :** "శ్రీకృష్ణుడై అవతరించి, మద్దిచెట్లను కూలగొట్టి, గోవర్ధనాన్ని ఎత్తి, గోవుల మందను మేపిన సర్వేశ్వరుడు వేంచేసి ఉండే శ్రీవేంకటాచలమే నీకు రక్షకం'' అని తన మనస్సుకు ఇందులో ఆ*ఴ్వా*ర్లు ఉపదేశిస్తున్నారు.

నిన్ఱ మామరుదు ఇ*ఱ్ఱు* వీ*ఴ* నడన్ద నిన్మలన్ నేమియాన్,
ఎన్ఱుమ్ వానవర్ కైతొ*ఴు*మ్ ఇణైత్తామరైయడి ఎమ్బిరాన్,
కన్ఱిమారి పొఴిన్దిడ క్కడిదానిరైక్కు ఇడర్ నీక్కువాన్,
శెన్ఱు కున్ఱ మెడుత్తవన్ తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే! 1-8-3

స్వామి శయనించి ఉన్న రీతిని, నిలచి ఉన్న రీతిని ఆ*ఴ్వా*ర్లు ముందు పాశురంలో అనుసంధించారు. ఇందులో నడిచే రీతిని అనుసంధిస్తున్నారు. సుదృఢాలు అయిన మద్దిచెట్లను కూలదోసి, వాటి నడుమన దోగాడిన నిర్మలుడు, సుదర్శన చక్రధారి, నిత్యసూరులచేత ఎల్లప్పుడూ సేవింపబడే శ్రీచరణారవిందద్వయిని కల స్వామి, కోపంతో ఇంద్రుడు శిలావర్షాన్ని కురిపించినపుడు పశువులను కాపాడడం కోసం గోవర్ధనగిరిని గొడుగుగా ఎత్తినవాడైన భగవానుడు వేంచేసి ఉండే తిరుమలయే మనకు రక్షకం- అని ఓమనసా! భావించు.

**145. అవ :** "ఆశ్రితసులభుడైన శ్రీకృష్ణుడు వేంచేసి ఉండే వేంకటాచలమే మనకు రక్షకం'' - అని ఇందులో ఆ*ఴ్వా*ర్లు అంటున్నారు.

పార్త్తఱ్కాయ్ అన్ఱు పారదమ్కై శెయ్దిట్టు వెన్ఱ పరఞ్జుడర్,
కోత్తు అఙ్గు ఆయర్దమ్పాడియిల్ కురవై పిణైన్ద ఎమ్కోవలన్,
ఏత్తువార్ తమ్మనత్తుళ్ళాన్ ఇడవెన్దై మేవియ ఎమ్బిరాన్,
తీర్త్తనీర్ త్తడఞ్జోలై శూ*ఴ్* తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే! 1-8-4



పాండవులకోసం భారతసంగ్రామాన్ని నడపి, జయాన్ని పొందినవాడు, ఆశ్రితుల కోసం కార్యాన్ని సఫలం చేయగల్గినట్లయితే మిక్కిలి ప్రకాశించే తిరుమేనిని కలవాడు, గోపికలతో రాసక్రీడ అనే నాట్యాన్ని ఆడినవాడు, తనను స్తుతించేవారి మనస్సును వీడిపోనివాడు, **"ఇడవెన్దై"** అనే దివ్యదేశంలో అందంగా, మధురంగా వేంచేసి ఉన్నవాడు అయిన స్వామికి చెందినదై, పలు పుణ్యతీర్థాలతో, పెద్దపెద్ద పూదోటలతో చుట్టబడి ఉన్న వేంకటాచలాన్ని చేరి ఓ మనసా! ఆశ్రయించు.

**146. అవ :** "ఆశ్రితుల దుఃఖాన్ని తీర్చే భగవానుడు సులభుడై వేంచేసి ఉండే శ్రీవేంకటా చలాన్ని చేరు''- అని మనస్సుకు ఆ*ఴ్వా*ర్లు ఉద్బోధిస్తున్నారు.

వణ్కైయాన్ అవుణర్క్కు నాయగన్ వేళ్వియిల్ శెన్ఱు మాణియాయ్,
మణ్కైయాల్ ఇరన్దాన్ మరామర మే*ఴు*మ్ ఎయ్ద వలత్తినాన్,
ఎణ్కైయాన్ ఇమయత్తుళ్ళాన్ ఇరుఞ్జోలై మేవియ ఎమ్బిరాన్,
తిణ్కైమ్మా తుయర్ తీర్త్తవన్ తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే! 1-8-5

కొఱినవారికి కొఱిన రీతిలో దానాన్ని చేసే అసురచక్రవర్తి అయిన మహాబలి యాగభూమికి బ్రహ్మచారి వేషంలో వెళ్ళి చేతిని చాచి, "మూడడగుల నేలను దానం చెయ్యి'' అని యాచించినవాడు, తనపట్ల సుగ్రీవునకు నమ్మకం కల్గడంకోసం ఏడు సాలవృక్షాలను ఒకే బాణంతో తొలిచిన గొప్ప బలం కలవాడు, ఆశ్రితరక్షణకోసం శంకచక్రాది దివ్యాయుధాలతోకూడిన ఎనిమిది బాహువులను కలవాడు (**"అట్టపు యకరమ్"** అనే దివ్యదేశంలో సేవను అనుగ్రహించేవాడు), హిమాలయంలో బదరికా శ్రమం అనే దివ్యక్షేత్రంలో వేంచేసి ఉండేవాడు, తిరుమాలిరుమ్ శోలైకు వచ్చి నిలచిన వాడు, మొసలినోటిలో చిక్కుకొని, బాధపడిన శ్రీగజేంద్రా*ఴ్వా*న్ దుఃఖాన్ని తీర్చి రక్షించినవాడు అయిన స్వామియొక్క వేంకటాచలాన్ని ఓ మనసా! త్వరగా పోయి చేరు.

**147. అవ :** "లోకాలను అన్నిటినీ ప్రళయకాలంలో తన ఉదరంలో ఉంచుకొని, వటపత్రశాయిగా ఉన్నవాడు,చంద్రుని క్షయరోగాన్ని తీర్చినవాడు, మహాబలశాలి అయిన హిరణ్యకశిపుని సంహరించిన నృసింహుడై, లోకాలను సంరక్షించిన వాడైన భగవానుడు వేంచేసి ఉండే పరమభోగ్యం అయిన వేంకటాచలాన్ని ఓ మనసా! ఆశ్రయించాలని ప్రయత్నించు''- అని అంటున్నారు.

ఎణ్‌తిశైగళు మేళ్ములగముమ్ వాజ్గి ప్పానవయిత్రిల్ పెయ్‌దు,
పణ్డు ఓరాలిలై పుళ్ళికొణ్డవన్ పాల్ మదిక్కువిడర్ తీర్త్తవన్,
ఒణ్‌తిఅలవుణనురత్తు ఉగిర్ వైత్తవన్ ఒళ్ళియిత్రొడు,
తిణ్‌తిఅల్ అరియాయవన్ తిరువేజ్గడమ్ అడ్డై నెజ్జమే! 1-8-6

ప్రళయకాలంలో ఎనిమిది దిక్కులలోని ఏడు లోకాలు నశించిపోకుండా ఉండేటట్లు వాటిని తన బొజ్జలో పెట్టుకొని, రక్షించి, ఒక మఱ్ఱి ఆకుపై పరుండి ఉన్నవాడు, చంద్రునకు కల్గిన క్షయరోగాన్ని పోగొట్టినవాడు, అందమైన కోఱపళ్ళతో మహాబలశాలి అయిన నృసింహమూర్తిగా అవతరించి, తన బలిమితో సమానమైన బలిమిని కల హిరణ్యకశిపుని వక్షస్సులో గోళ్ళను అదిమి, అతని శరీరాన్ని చీల్చినవాడును అయిన భగవానుని వేంకటాచలాన్ని ఓమనసా! నీవు చేరు.

**148. అవ:** "పంచభూతస్వరూపి అయినవాడు, సహస్రనామాలచేత ప్రతిపాదింపబడేవాడు, నిత్యుడు అయిన భగవానుడు వేంచేసి ఉండే మహోన్నతం అయిన శ్రీవేంకటాచలాన్ని ఆశ్రయించు"- అని ఆళ్వార్లు తమ మనస్సునుగూర్చి పల్కుతున్నారు.

పారుమ్ నీర్ ఎరి కాత్రినోడు ఆకాశము మివైయాయినాన్,
పేరుమ్ ఆయిరమ్ పేశనిన్ఱ పిఱప్పిలి పెరుగుమిడమ్,
కారుమ్ వార్ పనినీళ్ విశుమ్బిడై చ్చోరు మాముగిల్ తోయ్‌దర,
శేరు వార్ పొళ్ళిల్ శూళ్ ఎళ్ళిల్ తిరువేజ్గడమ్ అడ్డై నెజ్జమే! 1-8-7

పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం - అనే అయిదు భూతాలైనవాడు, సహస్రనామాలతో ప్రతిపాదింపబడే గుణచేష్టితాలను కలవాడు, జన్మరహితుడు అయిన భగవానుడు వేంచేసి ఉండే చోటు, విశాలమైన ఆకాశంనుండి వర్షజలం, మంచు బిందువులు వర్షించే చోటు, మేఘాలు వచ్చి విశ్రమించడానికి తగినట్లు ఉన్నతంగా ఉండే తోటలచేత చుట్టబడిఉన్నది, అత్యంతం మనోహరమైనది అయిన వేంకటా చలాన్ని ఓ నా మనసా! ఆశ్రయించు.

**149. అవ** : "పంచభూతస్వరూపి, నిత్యసూరులకు నిర్వాహకుడు, లక్ష్మీనాథుడు అయిన భగవానుడు వేంచేసి ఉండే, మౌగ్ధ్యాన్ని కల కోయకాంతలు అందమైన సస్యక్షేత్రాలను కాపు కాచే అయిన వేంకటాద్రిని ఓ మనసా! ఆశ్రయించు"- అని అంటున్నారు.



అమ్బరమ్ అనల్ కాల్ నిలమ్ శల మాగి నిన్ఱ అమరర్‌కోన్,
వమ్బులా మలర్ మేల్ మలిమడజ్గైదన్ కొళ్ళునవన్,
కొమ్బినన్న ఇడై మడక్కుఱమాదర్ నీళిదణన్దొఱుమ్,
శెమ్బునమవై కావల్‌గొళ్ తిరువేజ్గడమ్ అడ్డై నెజ్జమే 1-8-8

నింగి, నిప్పు, నేల, నీరు, గాలి - అనే - అయిదు భూతాల స్వరూపిగా ఉండేవాడు, నిత్యసూరినాథుడు, పరిమళం నిండుగా ఉండే తామరపూవుపైన పొందికగా ఉన్న లక్ష్మీదేవికి నాయకుడు అయిన భగవానుడు వేంచేసి ఉన్నది, ఎత్తైన మంచెలలో అంటా దుప్పికొమ్మువంటి (సూక్ష్మం అయిన) నడుమును కల, ముగ్ధలైన స్త్రీలు అందమైన, ఎఱ్ఱని ధాన్యం పండిన చేలలో కావలి కాసేది అయిన తిరువేంకటాచలాన్ని ఓమనసా! ఆశ్రయించా లని ప్రయత్నించు.

**150. అవ** : "సర్వసులభుడైవాడు, తిరువష్టాక్షరీ మహామంత్రాన్ని అనుసంధించేవారిని ఉజ్జీవింపజేసే భగవానుడు వేంచేసి ఉండే దివ్యదేశం, సుగంధభరితాలైన వనాలతో చుట్టబడిఉన్నది, లోకాలు అన్నిటికీ తిలకమై ఉండేది అయిన వేంకటాచలాన్నే పొందాలని చూడు"- అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి ఆళ్వార్లు పల్కుతున్నారు.

పేశుమిన్ తిరునామ మెట్టెళ్ళుత్తుమ్ శొల్లి నిన్ఱు పిన్నరుమ్,
పేశువార్‌దమ్మై ఉయ్యవాజ్గి ప్పిఱప్పఱుక్కుమ్ పిరానిడమ్,
వాశ మామలర్ నాఱువార్ పొళ్ళిల్ శూళ్‌దరుమ్ ఉలగుక్కెల్లామ్,
తేశమాయ్ త్తిగళ్ళుమ్మలై త్తిరువేజ్గడమ్ అడ్డై నెజ్జమే! 1-8-9

అందఱిచేత అనుసంధించదగిన, మధురమైన అష్టాక్షరీ మహామంత్రాన్ని అనుసంధిస్తూ, ఇంకా ఇంకా దానినే అనుసంధించేవారిని ఉజ్జీవింపజేసి, వారి సంసారాన్ని తొలగించే స్వామి నెలకొని ఉన్నది, సువాసన నిండుగా ఉండే గొప్ప పూలు పరిమళించే విశాలమైన తోటలతో చుట్టబడి ఉన్నది, అన్ని లోకాలకు తిలకంవంటిదిగా ప్రకాశించేది అయిన తిరుమలను ఓ మనసా! ఆశ్రయించు.

**151. అవ** : చివరలో ఆళ్వార్లు ఈ దశకాన్ని అనుసంధించేవారికి లభించే ఫలాన్నిగూర్చి పల్కి దశకాన్ని ముగిస్తున్నారు.

శెజ్గయల్ తిళైక్కుమ్ శునై త్తిరువేజ్గడత్తుఱై శెల్వనై,
మజ్గైయర్ తలైవన్ కలికన్ఱి వణ్‌తమిళ్ శెఞ్జొల్ మాలైగళ్,

శజ్ఞై యిష్టి త్తరిత్తు ఉరైక్కవల్లార్‌గళ్ తఞ్జమదాగవే,
వఙ్గమాకడల్ వైయమ్ కావలరాగి వానులగాళ్వరే 1-8-10

యౌవనానికి తగినట్లు ఎఱ్ఱని రంగును కల చేపలు ఒకదానితో వేఱొకటి బలిసి స్పర్థించే వాగులను కల వేంకటాచలంపై నిత్యవాసం చేసే స్వామినిగూర్చి తిరుమజ్ఞై మన్నన్ అందమైన తమిళంలో ఋజువైన వాక్కులతో అనుగ్రహించిన ఈవాజ్మాలను ధరించి, అనుసంధించగలవారు ఈలీలావిభూతి ఉన్నంతవరకు రాజాధిరాజులై వెలిగి, తరువాత నిత్యవిభూతికికూడా నిర్వాహకులుగా కాగలరు.

**152. అవ :-** పూర్వ దశకంలో ప్రతిపాశురంలోను ఆళ్వార్లు **"తిరువేఙ్గడమ్ అడైై నెఞ్జమే! తిరువేఙ్గడమ్ అడై నెఞ్జమే!"** అని పల్కి తిరుమలను ఆశ్రయించేటట్లు తమ మనస్సును ప్రబోధించారు. అందికూడా ఆ రీతిలోనే అంగీకరించగా, ఇద్దఱూ కలసి శ్రీవేంకటేశ్వరుని అనుభవించాలని కోఱి, తిరుమలకు వచ్చారు.

"తగని లౌకికవిషయాలలో అభినివేశాన్ని కల్గి ఉండి, ఇంతవరకూ కాలాన్ని వ్యర్థంగా గడిపాను. ఇపుడు పశ్చాత్తాపంతో నీ శ్రీచరణాల సన్నిధికి వచ్చి చేరాను. నా ప్రాక్తన కర్మలను చూచి నన్ను చేయివిడువవద్దు. నా అపరాధాలను సహించి, దాసుణ్ణి అయిన నన్ను స్వీకరించాలి'' అని ఈ దశకంలో ఆళ్వార్లు లక్ష్మీపురుష కారపురస్సరంగా శరణాగతిని చేస్తున్నారు. నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళికి ప్రబంధంలోని **"ఉలక ముణ్డ పెరువాయా"** అనే దశకం వంటిది ఈ దశకం.

మొదటి పాశురంలో "శ్రీ వేంకటేశ్వరా తండ్రి మొదలైన ఆభాసబంధువులను నమ్మి, అనర్థాలను అనుభవించి కష్టపడిన నేను పశ్చాత్తాపంలో నీ శ్రీపాదాలను చేరాను. కృపతో దాసుణ్ణి నీ కైంకర్యంలో వినియోగించుకో'' అని ప్రార్థిస్తున్నారు.

**తాయే తన్దై యెన్ఱుమ్ తారమే కిళై మక్కళెన్ఱుమ్,**
**నోయే పట్టొళిన్దేన్ ఉన్నై క్కాణ్బదోరాశైయినాల్,**
**వేయేయ్ పూమ్బొళిల్ శూళ్ విరైయార్ తిరువేఙ్గడవా!,**
**నాయేన్ వన్దడైన్దేన్ నల్‌గి ఆళెన్నైక్కొణ్డరుళే 1-9-1**

సర్వస్వామి, సర్వవిధబంధువు అయిన సర్వేశ్వరుడు ఇక్కడ నిత్యవాసం చేస్తున్నందువల్ల మన అపేక్షితాలను అన్నిటిని మనం ఇక్కడే పొందవచ్చు అనే గొప్ప ఆశతో ఆళ్వార్లు వచ్చారు. కాని, తిరుమలనాథుడు వీరికి ఎదురు వచ్చి ఆహ్వానించడం, కౌగలించుకోవడం, మాటలు మాటలాడడం, తన కైంకర్యంలో



వీరిని వినియోగించడం వంటివి వేనినీ చేయలేదు. అందువల్ల ఆళ్వార్లకు చాలా బాధ కల్గింది. "పరమ కారుణికుడై, పరమోదారుడైన శ్రియఃపతి మనలను ఈవిధంగా ఉపేక్షించడానికి కారణం- పేరుకు పోయిన మన పాపాలే అయిఉండాలి- అని నిశ్చయించి, ఆ స్వామికి దయ కలిగేటట్లుగా ఆళ్వార్లు మొఱపెడుతున్నారు.

వెదుళ్ళు నిండుగా, దట్టంగా పెరిగిన పూలతోటలతో నిండినది, ఎల్లప్పుడూ పరిమళం ప్రచురం అయిన మందమారుతాలు వీచే పరమభోగ్యమైనది అయిన శ్రీవేంకటాచలంలో దివ్యభోగరసాన్ని అనుభవిస్తూ వేంచేసి ఉండే స్వామీ ! తల్లి,తండ్రి, భార్యలు, బంధువులు, సంతానం- అనే ఆభాసశరీరబంధువులను ఎల్లప్పుడూ పలవరిస్తూ, అనర్థపరంపరలను అనుభవించి, కుక్కవలె తిరిగాను. ఇపుడు నీ కటాక్షంవల్ల బుద్ధి వచ్చింది. ఆభాసబంధువులైన వారి సంబంధాన్ని సవాసనగా విడచి, సర్వవిధబంధువైన నీ శ్రీచరణాలను ఆశ్రయించాను. శరణాగతుణ్ణి అయిన నన్ను కృపతో దాసునిగా చేసికొని, అనుగ్రహించు.

ఈ దశకంలోని పాశురాలు ముఖారిరాగంలో - ఆటతాళంలో కూర్పబడ్డాయి.

**153. అవ :** "స్వామీ! శేషాద్రినాథా! భూమండంలోని అందమైన యువతుల వలలో చిక్కుకొని, అంతులేని ఎన్నో పాపాలను చేశాను. ఇక బుద్ధి వచ్చింది. నీ వద్దకు వచ్చి, శరణు పొందాను. నాపై కరుణను చూపాలి'' - అని ఇందులో ఆళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

**మానేయ్ కణ్మడవార్ మయక్కిల్పట్టు, మానిలత్తు**
**నానే నానావిదనరగమ్ పుగుమ్ పావమ్ శెయ్‌దేన్,**
**తేనేయ్ పూమ్బొళిల్ శూళ్ తిరువేఙ్గడమామలై, ఎన్**
**ఆనాయ్! వన్దడైన్దేన్ ఆడియేనై ఆట్కొణ్డరుళే 1-9-2**

తేనె నిండిన పూదోటలచేత పరివేష్ఠింపబడ్డ, చాలా అందమైన వేంకటాచలంలో పరమపదవాసులకు, భూలోకవాసులకు ఆశ్రయణీయుడవై వేంచేసి ఉండే గజసదృశుడ వైన స్వామీ! అజ్ఞానప్రదం అయిన ఈ భూమండలంలో లేడికన్నులవంటి కన్నులను కల కాంతల మాయాజాలంలో చిక్కుపడి, అనేకవిధాలైన ఘోరపాపాలను ఏమీ భయపడ కుండా ధైర్యంగా చేశాను. అయితే, ఇపుడు బుద్ధి వచ్చినందువల్ల నీ శ్రీపాదాలలో ఆర్తితో శరణు పొందాను. దాసుణ్ణి కృపజేసి అనుగ్రహించు.

**154. అవ :** శ్రీవేంకటేశ్వరా! ఏ కొంచెంకూడా వివేకం లేకుండా పలు జీవులను వధించాను. యాచకులకు కనీసం తీయని మాటనుకూడా ఏనాడూ పల్కి ఎరుగను. ఈవిధంగా అతిక్రూరాలు అయినా పాపాలను చేసినా, ఇపుడు నీదగ్గరకు వచ్చి ఆశ్రయించాను. దాసుడనైన నన్ను కృపచేయాలి''- అని తమ దోషాలను పల్కుతూ ఆఴ్వార్లు అపరాధక్షామణాన్ని చేసికొంటున్నారు.

కొన్ద్రేన్ పల్లుయిరై క్కుఱిక్కోళ్ ఒన్ద్రిలామైయినాల్,
ఎన్ద్రేనుమ్ ఇరన్దార్క్కు ఇవిదాగ ఉరైత్తఱియేన్,
కున్ద్రేయ్ మేగమదిర్ కుళిర్ మామలై వేఙ్గడవా!,
అన్ద్రే వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-3**

పర్వతాలవంటి మేఘాలు. ఎల్లప్పుడూ గర్జిస్తూ నిరంతరం వర్షించడంవల్ల చాలా చల్లనిదై, పరమభోగ్యమై ఉండే శ్రీవేంకటాచలంలో అందఱికీ సులభుడై వేంచేసి ఉండే స్వామీ! యుక్తాయుక్త వివేకం కొంచెంకూడా లేకుండా పలు ప్రాణులను చంపాను. ఏనాడూ యాచించినవారి విషయంలో తీయగా మాట్లాడి ఎరుగను. ఇంతటి ఘోరమైన ఎన్నో పాతకాలను చేసినా, కొంచెంకూడా సంకోచం లేకుండా ఇపుడు నీ శ్రీపాదాల దగ్గరకు వచ్చి శరణు వేడాను. దాసుని అన్ని అపరాధాలను క్షమించి, అనన్యగతికుణ్ణి అయిన నన్ను రక్షించు.

**"కుఱిక్కోళ్"** - దేహాతిరిక్తం అయిన ఆత్మ ఉన్నదని, పుణ్యాపాపాలు, స్వర్గ నరకాలు ఉన్నవని, వేదశాస్త్రాదులు ప్రమాణాలని అంగీకరించడంవల్ల కలిగే ఆస్తిక్యబుద్ధి. **"అన్ద్రే"** - ఆర్ద్రాపరాధిగా- అని భావం. చంపిన చేతినికూడా కడుగుకోకుండా, రక్తసిక్త హస్తాలతోనే - అని తాత్పర్యం.

**155. అవ : "పున రపి జననం పున రపి మరణమ్"** అనేటట్లు పుట్టడం, గిట్టడంగా ఇంతకాలం నశించిపోయాను. ఏవిధమైన మంచిని చేసినవాడను కాను. పలు కష్టాలను అనుభవించాను. ఇపుడు నిన్ను ఆశ్రయించాను. దాసుణ్ణి అయిన నన్ను కింకరునిగా స్వీకరించి అనుగ్రహించు'' - అని అంటూ శ్రీవేంకటేశ్వరుని ఆఴ్వార్లు ఇందులో ప్రార్థిస్తున్నారు.

కులన్దానెత్తనైయుమ్ పిఱన్దే యిఱన్దెయ్త్తొఴిన్దేన్,
నలన్దా నొన్ఱు మిలేన్ నలదో రఱమ్ శెయ్దుమిలేన్,



నిలమ్ తోయ్ నీళ్ముగిల్ శేర్ నెఱియార్ తిరువేఙ్గడవా!,
అలన్దేన్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-4**

మేఘాలు కంఠంవరకు నీటిని తాగి, ఆనీటిబరువువల్ల కాలు కదపలేక మెల్లమెల్లగా సంచరించే గుర్తులు దారిలో ప్రకాశించే వేంకటాచలంలో వేంచేసి ఉన్నవాడా! అనులోమ- ప్రతిలోమ జన్మలని శాస్త్రాలలో చెప్పబడ్డ సంకరజన్మలు అన్నిటిలో పుట్టి, నశిస్తూ చాలా కృశించి, నశించిపోయాను. ఇటువంటి పలు పలు యోనులలో పుట్టిన దినాలలో ఏనాడైనా ఒక సుకృతాన్ని అయినా చేసినవాడను కాను. "న ధర్మనిష్ఠోఽస్మి" అన్నట్లు ఏధర్మాన్ని ఆచరించినవాడను కాను. ఎన్నో కష్టాలను అనుభవించాను. ఇకపై ఏమీ సాధ్యం కాకుండా అలసి సొలసి ఇపుడు నీ శ్రీపాదాలలో పడి శరణు వేడుతున్నాను. నా ప్రాక్తన దోషాలను చూడకుండా దాసుని కింకరునిగా స్వీకరించి, అనుగ్రహించు.

**156. అవ :** "శ్రీవేంకటేశ్వరా! పలు రీతులలో పాపాలను చేసి, దుఃఖపడి, అకించనుడనై, అనన్యగతికుణ్ణి అయిన నేను నీ శ్రీచరణాల మోల వాలాను. దాసుణ్ణి కృపతో కటాక్షించాలి''- అని ప్రార్థిస్తున్నారు.

ఎప్పావమ్ పలవుమ్ ఇవైయే శెయ్దు ఇళైత్తొఴిన్దేన్,
తుప్పా! నిన్నడియే తొడర్న్దేత్తవుమ్ కిఱ్కిన్ద్రిలేన్,
శెప్పార్ తిణ్ వరైశూఴ్ తిరువేఙ్గడమామలై, ఎన్
అప్పా! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-5**

కోటగోడలవలె దృఢంగా ఉండే పర్వతాలతో చుట్టబడి ఉన్న శ్రీవేంకటాచంలో వేంచేసి ఉండే నా తండ్రీ! సర్వజ్ఞుడా! అతిపాతకం - ఉపపాతకం - మహాపాతకం అనే రీతిలో పలు పలు పాపాలను అన్నిటినీ కొంచెంకూడా లోపం లేకుండా చేశాను. తర్వాత సంభవించబోయే ఫలాలను విని బాధతో కుంచించుకొని పోయాను. నీ శ్రీపాదాలను ఆశ్రయించి, సేవించగలిగినవాడను కాలేకపోయాను. ఇపుడు నీ శ్రీపాదాల కిందకు చేరాను. నన్ను కృపజేసి, కింకరునిగా స్వామీ! అంగీకరించు.

**"తుప్పన్"** – అత్యంతసూక్ష్మవిషయాలనుకూడా వివేకించి గ్రహించే బుద్ధినైశిత్యం కలవాడు, రక్షణకు అవశ్యకం అయిన శక్తియుక్తులను కలవాడు. **"శెప్పు"** అభరణాదులను దాచే పెట్టెను తెలిపే ఈ పదం లక్షణయా ఇక్కడ రక్షించే ప్రాకారాన్ని తెలుపుతుంది.

**157. అవ :** "శ్రీవేంకటేశ్వరా! నాస్వామీ! పంచభూతాత్మకం అయిన ఈ శరీరంలో చిక్కుకొని, బాధపడి ఇక ఏ శరణం లేనివాడనై, నీ శ్రీపాదాల దగ్గరకు చేరాను. పరమకృపతో దాసుణ్ణి రక్షించాలి"- అని ఇందులో ఆళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

మణ్ణాయ్ నీర్ ఎరికాల్ మఙ్జులావుమ్ ఆకాశముమామ్,
పుణ్ణా వాక్కైదన్నుళ్ పులమ్బి త్తళర్న్దు ఎయ్త్తొழిన్దేన్,
విణ్ణార్ నీళ్శిగర విరైయార్ తిరువేఙ్గడవా!,
అణ్ణా! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-6**

పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం- అనే పంచభూతాలతో కూడినది, మాంసపిండరూపమైనది, మిక్కిలి హేయమైనది అయిన శరీరంలో ఇంతకాలం చిక్కు కొని కష్టపడ్డాను. ఇకపై ఆ శ్రమలను నేను సహించలేను. జన్మాంతరాలను లేకుండా చేయగల శ్రీచరణసన్నిధానానికి వచ్చి చేరాను. ఆర్తసంరక్షణార్థం కట్టబడిన ధ్వజాలవలె ఆకాశం అంత ఎత్తుకు వ్యాపించి, ప్రకాశించే శిఖరాలను కల, మనోహరం అయిన తిరువేంకటాద్రిలో వేంచేసి ఉండే స్వామీ! అనన్యగతికుణ్ణి అయిన దాసుణ్ణి కటాక్షించాలి.

**158. అవ:** "శ్రీవేంకటగిరీశా! **"బాలస్తావత్ క్రీడాసక్తః, తరుణ స్తావత్ తరుణీ సక్తః"** అన్నట్లు బాల్యంలో జ్ఞానం కొంచెంకూడా లేకుండా పలు పలు పాపాలను చేశాను. యౌవనంలో విషయాంతరప్రవణునిగా పరిభ్రమించి, దుఃఖాలను అనుభవించాను. ఇపుడు బుద్ధి వచ్చింది. నీ శ్రీపాదసన్నిధికి వచ్చి శరణు పొందాను. దాసుణ్ణి కటాక్షించాలి"- అని ఆళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

తెరియేన్ పాలగనాయ్ ప్పల తీమైగళ్ శెయ్దుమిట్టేన్,
పెరియేనాయినపిన్ పిఱర్క్కే యుழైత్తు ఏழైయానేన్,
కరి శేర్ పూమ్బొழిల్శూழ் కనమామలై వేఙ్గడవా!,
అరియే! వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-7**

నేను బాల్యావస్థలో అవివేకుణ్ణి అయి, పలు తగని కార్యాలను చేశాను. తరువాత వయస్సు రాగానే కాంతల వలలో చిక్కి తిరిగి, అలసి, మూర్ఖుణ్ణి అయినాను. గడచిన కాలం అంతా వ్యర్థమైనా, ఇకపై అయినా ఉజ్జీవించవచ్చునని ఇపుడు నీ శ్రీపాదాలలో శరణు పొందాను. ఏనుగులు సంచరించేది, పూలు నిండిన అందమైన తోటలతో చుట్టబడినది, అందమైనది అయిన వేంకటాద్రిలో ఉండే స్వామీ! దాసుణ్ణి రక్షించి అనుగ్రహించు.



**159. అవ :** "అందమైన వేంకటాచలంలో విజయంచేసి ఉండే నాప్రభూ! పలు జన్మలు కల్గేటట్లు అనేకమైన క్రూరకర్మలను చేశాను. అందువల్ల చాలా దుఃఖపడ్డాను. ఇపుడు నిన్ను దర్శించాలనే ఆశతో వచ్చి ఆశ్రయించాను. దాసుణ్ణి రక్షించాలి"- అని ఇందులో ఆళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

నో*ఱ్ఱే*న్ పల్ పిఱవి నున్నై కాణ్బదోరాశైయినాల్,
ఏ*ఱ్ఱే*న్ ఇప్పిఱప్పే ఇడరు*ఱ్ఱ*నన్ ఎమ్బెరుమాన్!,
కోల్తేన్ పాయ్న్దొழుగుమ్ కుళిర్శోలై శూழ் వేఙ్గడవా!,
ఆ*ఱ్ఱే*న్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-8**

వెదుళ్ళనుండి తీయని మధువు స్రవించి, ప్రవహించే చల్లని పూలతోటల చేత చుట్టబడి ఉండే వేంకటాచలంలో వేంచేసి ఉండే నాస్వామీ ! పలు జన్మలు కలిగేటట్లు లెక్కలేనన్ని కర్మలను చేశాను. ఈవిధంగా పలు జన్మలను ఎత్తుతూ ఎత్తుతూ ఉండగా, యాదృచ్ఛికం అయిన సుకృతవిశేషంచేత నిన్ను దర్శించాలనే ఆశ నాకు కల్గింది. అందువల్ల దీనికి ముందు నేనున్న స్థితి చాలా చెడ్డది అనే వివేకం కల్గింది. తత్కారణంగా నీ శ్రీపాదాలను చేరి సేవించే భాగ్యాన్ని పొందాను. దాసుణ్ణి కటాక్షించు.

**160. అవ :** శ్రీనమ్మాళ్వార్లు **"అకలకిల్లేన్"** అనే పాశురంలో లక్ష్మీదేవిని పురుషకారంగా చేసికొని శరణాగతి చేసినట్లే, వీరుకూడా ఈ పాశురంలో భగవానుని ఆశ్రయణ సౌకర్యాపాదకాలైన కల్యాణగుణాలను, లక్ష్మీసంబంధాన్ని కీర్తించి, తమ ఆర్ద్రాపరాధా లను తెలిసికొని, **"క్షమించి, అనుగ్రహించాలి"** అని తిరుమఙ్గై ఆళ్వార్లు శరణు పొందుతున్నారు.

ప*ఱ్ఱే*ల్ ఒన్డుమిలేన్ పావమే శెయ్దు పావియానేన్,
మ*ఱ్ఱే*ల్ ఒన్ఱఱియేన్ మాయనే! ఎఙ్గళ్ మాదవనే!,
కల్తేన్ పాయ్న్దొழుగుమ్ కమలచ్చునై వేఙ్గడవా!,
అ*ఱ్ఱే*న్ వన్దడైన్దేన్ అడియేనై ఆట్కొణ్డరుళే **1-9-9**

స్వామీ! నీ సంబంధాన్ని తెంచుకొని కడు దూరం పోయిన దాసునకు **"స పిత్రా చ పరిత్యక్తః"** అన్నట్లు ఎక్కడా ఆదరం లభించలేదు. ఆత్మకు జ్ఞానం,

ఆనందం నిరూపకం అయినా, నావిషయంలోమాత్రం పాపాలే నిరూపకం అయే టట్లుగా పలు పాపాలను చేసి, చాలా పాపిష్ఠివాడను అయ్యాను. నిన్ను ఆశ్రయించ డానికి తగిన ఉపాయాన్ని దేనినీ తెలియను. అయినా, నీవు శరణాగతులను కాపాడడమే ధర్మంగా తలచి ఉండేవాడవు. నీ కల్యాణగుణాలు, లక్ష్మీదేవి ఉండగా మాకేమి కొఱత? నీ చల్లని మనస్సులో మా అపరాధాలను తలచి ఒకవేళ కోపం కలిగినాకానీ, దాన్ని సహించేటట్లు చేసి, రక్షింపజేసే, కరుణే మూర్తీభవించిందా! అనేటట్లుగా ఉండే లక్ష్మీదేవి నీవక్షస్సులో స్థిరనివాసం ఉంటున్నది. అందువల్ల నేను నీ సన్నిధికివచ్చి శరణు పొందాను. ఇక నేను ఏమీ కోల్పోను. సర్వలోకశరణ్యుడవైన నీవు ఇక దాసుడనైన నన్ను కింకరునిగా స్వీకరించి, అనుగ్రహించు.

**"పావమే శెయ్దు పావియానేన్"** - దశరథునివలె సత్యభావణంద్వారా మొదట పుణ్యాన్ని ఆర్జించినా, చివరకు స్వామిని ఎడబాసిన పాపిని కాలేదు. శిశుపాలునివలె ఆదినుండి పాపాలను చేసినా చివరకు పరమపదాన్ని పొందిన పుణ్యశాలిని కాలేదు. పాపమే చేసి చివరకు పాపినే అయ్యాను - అని హృదయం.

**161. అవ :** ఈ చివరి పాశురంలో ఆళ్వార్లు ఈ దశకానుసంధానం చేసేవారికి కలిగే ఫలాన్ని గూర్చి పల్కి ముగిస్తున్నారు.

**కణ్ణాయ్ ఏழులగుక్కు ఉయిరాయ ఎమ్ కార్వణ్ణనై,**
**విణ్ణోర్తామ్ పరవుమ్ పొழిల్ వేఙ్గడవేదియనై,**
**తిణ్ణార్ మాడఙ్గళ్ శూழ் తిరుమఙ్గైయర్కోన్ కలియన్,**
**పణ్ణార్ పాడల్ పత్తుమ్ పయిల్వార్క్కు ఇల్లై పావఙ్గళే 1-9-10**

ఏడు లోకాలకు నేత్రస్థానీయుడు-అనగా-అన్ని విషయాలను గమనించి కాపాడే వాడు, ప్రాణంవలె ధారకుడై రక్షించేవాడు, నాపై కారుణ్యామృతాన్ని వర్షించే నల్లని మేఘంవంటి రంగును, స్వభావాన్ని కలవాడు, నిత్యసూరులచేత ఆశ్రయింపబడి స్తుతింపబడేవాడు, తోటలచేత పరివేష్టితం అయిన వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడు, సర్వవేదవేదాంతప్రతిపాద్యుడు అయిన స్వామినిగూర్చి దృఢమైన, ఉన్నతాలైన మిద్దెలతో, మేడలతో చుట్టబడిన **"తిరుమఙ్గై"** అనే నగరంలో ఉన్నవారికి స్వామి అయిన తిరుమఙ్గైమన్నన్ అనుగ్రహించిన,రాగయుక్తం అయిన ఈ పది పాశురాలను అనుసంధిచేవారికి సకలపాపనివృత్తి కలుగుతుంది.



**162. అవ :** పూర్వదశకంలో ఆళ్వార్లు తమ ఆకించన్యాన్ని తెలిపి, శరణు వేడి, కైంకర్యాన్ని అపేక్షించారు. అహంకార - మమకారాలు అనే విరోధులు తొలగితేకదా కైంకర్యం చేయడానికి వీలవుతుంది. అందుకోసం ఈ దశకంలో "ప్రతిబంధకాలను పోగొట్టి పరభక్తిని అనుగ్రహించాలి స్వామీ!" అని స్వామిని ప్రార్థిస్తున్నారు.

ఈ మొదటి పాశురంలో "పూర్వం లోకకంటకుడైన రావణుని సంహరించడం కోసం శ్రీరాముడవై అవతరించి, ఇపుడు భక్తులు అందఱు వచ్చి సేవించడంకోసం శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామీ! నా దుఃఖాలను తీర్చి అనుగ్రహించాలి"- అని ప్రార్థిస్తున్నారు.

**కణ్ణార్ కడల్ శూழ் ఇలఙ్గైక్కు ఇఱైవన్ తన్,**
**తిణ్ణాగ మ్పిళక్క చ్చరమ్ శెల ఉయ్త్తాయ్!,**
**విణ్ణోర్ తొழுమ్ వేఙ్గడమామలై మేయ,**
**అణ్ణా! అడియే నిడరై క్కళైయాయే 1-10-1**

సువిశాలం అయిన సముద్రంచే పరివేష్టితం అయిన లంకాపురికి నాథుడైన రావణుని బలిష్ఠమైన శరీరం భగ్నమయేటట్లు బాణాలను ప్రయోగించినవాడా! దేవతలు, నిత్యసూరులు వచ్చి సేవించే వేంకటాచలం అనే గొప్ప పర్వతంలో వేంచేసి ఉన్నవాడా! దాసుడైన నా దుఃఖాలను పోగొట్టి అనుగ్రహించు.

ముఖారిరాగంలో - ఆటతాళంలో ఈ దశకపాశురాలున్నాయి.

ఈ పాశురంలో శ్రీరామునకు, వేంకటేశ్వరునకుమధ్య ధర్మైక్యం చెప్పబడింది.

**163. అవ :** "పూర్వం ఒకానొక సమయంలో లంకలో బలిష్ఠుడై ఉండే మాలి అనే రాక్షసుణ్ణి వధించడంకోసం గరుడుని లంకాపురికి పంపినవాడా! శ్రీవేంకటేశ్వరా! అనన్యగతికుణ్ణి అయిన దాసునిపై కృప జేయాలి"- అని ప్రార్థిస్తున్నారు.

**ఇలఙ్గై ప్పదిక్కు అన్తు ఇఱైయాయ, అరక్కర్**
**కులమ్ కెట్టు అవర్ మాళ క్కొడిపుళ్ తిరిత్తాయ్!,**
**విలఙ్గల్ కుడుమి త్తిరువేఙ్గడమ్ మేయ,**
**అలఙ్గల్ తుళబముడియాయ్! అరుళాయే 1-10-2**

"మాలి" అనే రాక్షసుని నిరసించడంకోసం గరుడుని లంకకు పంపినవాడా! మహోన్నత శిఖరాలను కల వేంకటాచలంలో దివ్యగంధభరితం అయిన తులసీ మాలనుధరించి వేంచేసి ఉండే స్వామీ! దాసుణ్ణి కృపజేయాలి.

మాలికథ ఉత్తరరామాయణంలో ఉన్నది.

**164. అవ** : "ప్రళయాపదనుండి లోకాలను రక్షించడంకోసం నీ బొజ్జలో వాటిని ఉంచుకొని వటప్రతశాయియై వేంచేసి ఉండే స్వామీ! ఇపుడు అందఱినీ కాపాడడంకోసం వేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామీ! దాసునిపై కృపను చూపించాలి" - అని ఇందులో ఆళ్వార్లు ప్రార్థిస్తున్నారు.

**నీరార్ కడలుమ్ నిలముమ్ ముழுదుణ్డు,**
**ఏరాలమిళన్దళిర్ మేల్ తుయిల్ ఎన్దాయ్!,**
**శీరార్ తిరువేఙ్గడమామలై మేయ,**
**ఆరావముదే! అడియేఱ్కు అరుళాయే** 1-10-3

జలం నిండిన సముద్రాన్ని, భూమిని, మిగిలిన అన్ని పదార్థాలను ప్రళయాపద నుండి రక్షించడంకోసం ఆరగించి,బొజ్జలో భద్రంగా పెట్టుకొని, అందమైన లేత మఱ్ఱి ఆకుపై శయనించి ఉండే నా స్వామీ! గొప్పకొండ అయిన వేంకటాచంలో వేంచేసి ఉండే అపర్యాప్తామృతస్వరూపా! దాసుణ్ణి అనుగ్రహించు.

**165. అవ** : "శ్రీకృష్ణుడవై అవతరించి, ఉట్టిలో భద్రంగా పెట్టిన వెన్నను ఆరగించివాడా! వామనరూపివై భూమిని కొలిచినవాడా! వేంకటేశ్వరా! దేవాధిదేవా! ఆశ్రితులను రక్షించడమేకదా నీ స్వభావం. నిన్నే ఆశ్రయించి ఉండే దాసుణ్ణి నన్ను కటాక్షించి అనుగ్రహించాలి"- అని ప్రార్థిస్తున్నారు.

**ఉణ్డాయ్ ఉఱిమేల్ నఱునెయ్ అముదాగ,**
**కొణ్డాయ్ కుఱళాయ్ నిలమ్ ఈరడియాలే,**
**విణ్తోయ్ శిగర త్తిరువేఙ్గడమ్మేయ,**
**అణ్ణా! అడియేనుక్కు అరుళ్ పురియాయే** 1-10-4

రేపల్లెలోని గొల్లపడుచులు భద్రంగా ఉట్టిలో చేర్చి దాచిపెట్టిన వెన్న,నెయ్యి మొదలైన వస్తువులను ఆరగించి,వారికి ఎంతో సులభుడవై, యథేష్ట వినియోగార్హుడవై ఉన్నావు. వామనుడవై మహాబలిదగ్గరకుపోయి యాచించి మూడడుగుల నేలను దానంగా పొంది, రెండు అడుగులతో అన్ని లోకాలను ఆక్రమించి పరాత్పరుడవై ప్రకాశించావు. ఆ పరత్వసౌలభ్యాలు రెండూ ప్రకాశించేటట్లు వేంకటాచలంలో వేంచేసి ఉన్నావు పరమపదవాసులకు, భూలోకవాసులకు రక్షకుడవై ఉండే నీవు దాసుడనైన నన్ను అనుగ్రహించాలి.



మొదటి పాదంలో స్వామి సౌలభ్యం, రెండవ పాదంలో పరత్వం, మూడవ పాదంలో ఈ రెండు, చివరిపాదంలో పూర్ణత్వం వర్ణింపబడ్డాయి.

**166. అవ** : "నీ భక్తశిఖామణి అయిన ప్రహ్లాదుని రక్షించడంకోసం నృసింహమూర్తివై నీవు అవతరించలేదా! ఇపుడు దాసుణ్ణి రక్షించడంకోసంకదా తిరుమలలో వేంచేసి ఉన్నావు. అందువల్ల నీవే నన్ను నీ మనస్సులో తలచి, అనుగ్రహించాలి"- అని ప్రార్థిస్తున్నారు.

**తూణాయ్ అదనూడు అరియాయ్ వన్దు తోన్ఱి,**
**పేణా అవుణనుడలమ్ పిళన్దిట్టాయ్,**
**శేణార్ తిరువేఙ్గడమామలై మేయ,**
**కోణాగణైయాయ్! కుఱిక్కొళ్ ఎనై నీయే** 1-10-5

స్తంభంలోపలనుండి నరసింహమూర్తివై ఆవిర్భవించి, దుష్టుడైన హిరణ్యాకశిపుని శరీరాన్ని చీల్చి, గొప్ప భక్తుడైన ప్రహ్లాదుని అనుగ్రహించినట్లే, భక్తుల శత్రువుల విషయంలో కోపం, భక్తుల విషయంలో వాత్సల్యం స్ఫురించేటట్లు తిరుమలలో సేవను అనుగ్రహిస్తూ వేంచేసి ఉండే స్వామీ ! మిక్కిలి క్రూరులనుసైతం అణచి పాలించే క్రమంలో, సర్పరాజు అయన అనంతుని నీకు అంతరంగకింకరునిగా చేసికొన్నావు. అందువల్ల దాసునికూడా సంస్కరించి, అనుగ్రహించాలి.

**167. అవ** : గడచిన అయిదు పాశురాలలో ప్రార్థించిన విషయాన్ని పూర్తిచేసి అనుగ్రహించడంకోసం భగవానుడు ఆళ్వార్ల చిత్తంలో ప్రవేశించాడు. దానిని వీరు ఆశ్చర్యంతో ఇక తెలుపుతున్నారు. అందులో ఈ పాశురంలో "దాసుణ్ణి అయిన నన్ను తనకు కింకరునిగా చేసికొని, వేంకటేశ్వరుడు నా మనస్సులో ప్రవేశించి ఉన్నాడు"- అని తమ ఆనందాతిశయాన్ని వ్యక్తం చేస్తున్నారు.

**మన్నా ఇమ్మనిశప్పిఱవియై నీక్కి,**
**తన్నాక్కి త్తన్ ఇన్నరుళ్ శెయ్యుమ్ తలైవన్,**
**మిన్నార్ ముగిల్ శేర్ తిరువేఙ్గడమ్ మేయ,**
**ఎన్నానై ఎన్నప్పన్ ఎన్నెఞ్జినుళానే** 1-10-6

అత్యంతం అస్థిరం అయిన ఈ మానవజన్మను తీర్చి, తనకు నన్ను దాసునిగా చేసికొని, తన పరమకృపను చూపేవాడు, మెఱుపులతో కూడిన మేఘాలు వచ్చి చేరేటట్లున్న శ్రీవేంకటాచలంలో వేంచేసి ఉండే గజసదృశుడైన నా స్వామి నా మనస్సులో వేంచేసి ఉన్నాడు. ఏమి నా భాగ్యం!

"తన్నాక్కి" - తనకు దాసునిగా చేసికొన్నాడని, తనవలె పరమ సామ్యాపత్తిని కల్గించాడని భావం. "మిన్నా ముకిల్ శేర్" - విద్యుల్లతతో కూడిన మేఘం ఇక్కడ లక్ష్మీవిశిష్టుడైన స్వామిని సూచిస్తుంది.

**168. అవ :** పూర్వం నప్పిన్నైప్పిరాట్టి సంశ్లేషంకోసం అవరోధంగా ఉన్న ఏడు ఎద్దులను చంపినట్లే, నా దుఃఖాలను తీర్చి నా మనస్సులో స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు- అని అంటున్నారు.

**మానేయ్ మడనోక్కి తిఱత్తు ఎదిర్ వన్ద,**
**ఆనేఱ్ఱ్విడై శెఱ్ఱ అణివరైత్తోళా!,**
**తేనే! తిరువేఙ్గడమామలై మేయ,**
**కోనే! ఎన్మనమ్ కుడికొణ్డిరున్దాయే** **1-10-7**

లేడికళ్ళవంటి కళ్ళను కల నప్పిన్నైప్పిరాట్టిని వివాహం చేసికోవడంకోసం, ఆమె తండ్రి నిర్ణయించిన కన్యాశుల్కాన్ని అనుసరించి ఏడు ఎద్దులను చంపిన గొప్ప బలాన్ని కలవాడా! ఆమెకు భోగ్యుడవై ఉన్నట్లే నాకుకూడా భోగ్యుడవై ఉన్నావు. శ్రీవేంకటేశ్వరా! ఆహా! ఏమి నీ దయ! ఔదార్యం! ఆహా! ఏమి నా భాగ్యం! ఆ నప్పిన్నైపిరాట్టితోకూడా కలసి నా మనస్సులోకి వచ్చి నివాసం ఏర్పరచుకొన్నావు. ఈవిధంగాకూడా ఒక అనుగ్రహమా! స్వామీ!

**169. అవ :** "పరమభోగ్యుడైన శ్రీవేంకటేశ్వరుడు నప్పిన్నైపిరాట్టితో కలిసి ఈవిధంగా పరమకృపతో నా మనస్సులో ప్రవేశించి ఉన్న తరువాత ఆ స్వామి శ్రీచరణాలను తప్ప వేఱు దేనినీ నేను తెలియను"- అని అంటున్నారు.

**శేయన్ అణియన్ ఎన శిన్దైయుళ్ నిన్ఱ,**
**మాయన్ మణివాళొళి వెణ్ తరళఙ్గళ్,**
**వేయ్ విణ్డు ఉదిర్ వేఙ్గడమామలై మేయ,**
**ఆయనడి యల్లదు మఱ్ఱఱియేనే** **1-10-8**

నిన్ను ఆదరించనివారికి అందనివాడవై, కొలిచేవారికి సులభుడవై (చేతికి అందే వాడవై) ఉండేవాడా! పరమనికృష్టుణ్ణి అయిన నా మనస్సు లోపలకు వచ్చి నిత్యవాసం చేసే ఆశ్చర్యకరమైన శీలగుణాన్ని కల నీవు సులభుడవని వేఱే చెప్పాలా! వెదుళ్ళు పగిలి ప్రకాశించే రత్నాలు, కాంతిని, తెల్లని రంగును కల ముత్యాలు చిందిపడే



తిరుమలలో వేంచేసి ఉండే పరమసులభుడవైన నీ శ్రీపాదాలను తప్ప వేఱు దేనినీ తెలియను.

**170. అవ :** తాము పొందిన ఫలాన్ని "వన్దాయ్ ఎన్ మనమ్ పుకున్దాయ్ మన్నినిన్దాయ్" అని ప్రత్యేక వాక్యాలలో విభజించి, తమ ఆనందం స్పష్టంగా ప్రకాశించేటట్లు తెలుపుతున్నారు.

**వన్దాయ్ ఎన్మనమ్ పుకున్దాయ్ మన్ని నిన్దాయ్!,**
**నన్దాద కొழுమ్ శుడరే ఎఙ్గళ్ నమ్బీ!,**
**శిన్దామణియే! తిరువేఙ్గడమ్ మేయ,**
**ఎన్దాయ్! ఇని యానున్నై ఎన్ఱుమ్ విడేనే** **1-10-9**

అప్రాకృత దివ్యమంగళవిగ్రహవిశిష్టుడవైన నీవు నీచాతినీచుణ్ణి అయిన నా మనస్సులోకి వచ్చి ప్రవేశించావు. అందువల్ల నీ తేజస్సు చాలా అతిశయించి ప్రకాశిస్తున్నది. "చింతామణిరత్నంవలె తలచినమాత్రంలోనే అభీష్టాలు అన్నిటినీ ప్రసాదించేవాడా! పరమభోగ్యం అయిన తిరుమలలో వేంచేసి ఉండేవాడా! పరమపదం, క్షీరాబ్ధి మొదలైన అత్యంతరమణీయాలైన స్థలాలను విడచి, ఇక్కడకు వచ్చావు. వచ్చి నా మనస్సును వెదకి వెదకి అందులో ప్రవేశించావు. ప్రవేశించి, మౌనంతో నిండిన ఆ నా మనస్సును అసహ్యించుకొని విడచిపోకుండా- "ఇంతకంటే గొప్ప స్థానం నాకు ఇంకొకటి లేదు"అని నా మనస్సులో స్థిరంగా ఉన్నావు. ఆహా! ఈ రీతిలోకూడా ఒక కార్యం ఉంటుందా! ఏమి నీ సౌశీల్యం స్వామీ!

**171. అవ:** చివరిగా ఈదశకాన్ని అభ్యసించినవారికి కలిగే ఫలాన్ని తెలిపి ముగిస్తున్నారు.

**విల్లార్ మలి వేఙ్గడమామలై మేయ,**
**మల్లార్ తిరడోళ్ మణివణ్ణనమ్మానై,**
**కల్లార్ తిరడోళ్ కలియన్ శొన్న మాలై,**
**వల్లారవర్ వానవరాగువర్ తామే** **1-10-10**

శ్రీగుహప్పెరుమాళ్వంటి బోయలు "క్రూరజంతుభూయిష్ఠం అయిన ఈ అరణ్యంలో ఏ సమయంలో ఎవరివల్ల స్వామికి ఏ కీడు మూడుతుందో! అనే అతిశంకతో ఎల్లప్పుడూ బాణం సంధించిన వింటిని చేతిలో ధరించి ఉండే తిరుమలలో వేంచేసి ఉండేవాడు. మల్లులను సంహరించిన బలిష్ఠబాహువులును

కలవాడు, మణివర్ణుడైన స్వామిని గూర్చి, కొండవంటి, బలిసిన భుజాలను కల తిరుమఙ్గైమన్నన్ అనుగ్రహించిన ఈ దశకాన్ని అనుసంధించగల్గినవారు నిత్యసూరుల గోష్ఠిలో చేరి **"సదా పశ్యంతి"** అనే రీతిలో నిత్యంగా భగవత్సాక్షాత్కారాన్ని కలవారై, నిత్యకైంకర్య సామ్రాజ్యాన్ని ఏలుతారు.

**172. అవ :-** పూర్వదశకంలో ఆఴ్వార్లు తమ అహంకార - మమకారాలను పోగొట్టి పరమభక్తిని అనుగ్రహించాలని ప్రార్థించారు. ఈ దశకంలో ఫలాన్ని పొందడానికి, పొందలేకపోవడానికి మనస్సు కారణం కాబట్టి, చెడ్డ విషయాలలో అది ప్రవేశించకుండా స్వరూపయోగ్యం అయిన భగవానుడనే విషయంలో ఆసక్తం అయినది కదా! అని సంతోషించి తమ మనస్సును "శ్రీవేంకటేశ్వరునకు కైంకర్యవృత్తిని చేస్తున్నావే! భళా!'' అని అంటూ ప్రతిపాశురంలోను పొగడుతున్నారు. ఈ విధంగా ఈ దశకంలో తమ మనస్సును పొగడి పల్కడంద్వారా శ్రీవేంకటేశ్వరుణ్ణి అనుభవించి ఆనందిస్తున్నారు.

ఈ మొదటి పాశురంలో- "నా మనసా! యోగుల హృదయపుండరీకంలోను, శ్రీవేంకటాచలంలోను వేంచేసి ఉండేవాడు, వామనుడై అవతరించినవాడూ అయిన స్వామికి నిత్యకైంకర్యవృత్తిని స్వీకరించావే! ఏమి నీ భాగ్యం!'' అని పొగడుతున్నారు.

**వానవర్తఙ్గళ్ శిన్దై పోల ఎన్నెఞ్జమే! ఇనిదు వన్దు, మాదవ**
**మానవర్ తఙ్గళ్ శిన్దై అమర్న్దు ఉఱైగిన్ఱ ఎన్దై,**
**కానవరిడు కారగిల్ పుగై ఓఙ్గు వేఙ్గడమ్మేవి, మాణ్కుఱ-**
**ళాన అన్దణఱ్కు ఇన్ఱు అడిమైత్తొఴిల్ పూణ్డాయే 2-1-1**

నా మనసా! ప్రపన్నశిఖామణులైనవారి హృదయాలలో నిత్యవాసం చేసేవాడు, వేటగాళ్ళు తాము వంట వండుకోవడం కోసం అగరుచెట్లను నఱికి జ్వలింపచేసినపుడు, వచ్చే పొగ అంతటా ఘుమఘుమలాడుతూ పరిమళించే పరమరమణీయం అయిన వేంకటాచలంలో నిత్యనివాసం చేసేవాడు, మాయావామనుడై అవతరించినవాడు అయిన భగవానునకు నిత్యసూరుల హృదయంవలె నీవుకూడా చక్కని అభినివేశంతో కైంకర్యవృత్తిని చేస్తున్నావు కదా! ఏమి నీ భాగ్యం!

ఆనందభైరవి రాగంలో - రూపకతాళంలో ఈ దశకపాశురాలు ఉన్నాయి.

**173. అవ:** నా మనసా! ప్రాప్తశేషి అయిన శ్రీవేంకటేశ్వరుని కల్యాణగుణాలలో అభినివిష్టమై, అతని శ్రీచరణాలలో సేవావృత్తిని స్వీకరించావే!- అని ఆనందిస్తూ పల్కుతున్నారు.



**ఉఱవు శుఱ్ఱమెన్ఱొన్ఱిలా ఒరువన్ ఉగన్దవర్దమ్మై, మణ్మిశై**
**ప్పిఱవియే కెడుప్పాన్ అదు కణ్డు ఎన్ నెఞ్జ మెన్బాయ్!,**
**కుఱవర్ మాదర్గళోడు వణ్డు కుఱిఞ్జి మరుళిశై పాడుమ్ వేఙ్గడత్తు,**
**అఱవ నాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొఴిల్ పూణ్డాయే 2-1-2**

మనసా! మనం దాయాదులని, తల్లి-తండ్రి అని కొందఱు ఆభాసబంధువులను కల్పించుకొని, వారికి మంచిని మాత్రమే చేస్తున్నాము. భగవానుడు ఆవిధంగా కాకుండా అందఱి విషయంలోను ప్రేమను కలవాడై ఉన్నాడు. తాను అభిమానించినవారిని **"తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్"** అన్నట్లు సంసారంనుండి ఉద్ధరించి, నిత్యసూరిగణంలో నిలుపుతున్నాడు. ఇటువంటి భగవానుని స్వభావాన్ని తెలిసికొని అతని సేవావృత్తిని స్వీకరించావుకదా! కోయవనితలతోపాటు తుమ్మెదలు కుఱిఞ్జి మొదలైన రాగాలను గానం చేసే పరమభోగ్యం అయిన తిరుమలలో స్వామి సులభుడై, నిత్యసన్నిధానాన్ని కల్గి ఉన్నాడు. ఏమి అతని సౌశీల్యం ! సౌలభ్యం!

**"అఱవన్"** - చలివేందఱను పెట్టి మననుండి కైంకర్యాలను గ్రహించడంకోసం తనను మనకు యథేష్టవినియోగార్హునిగా చేసికొన్న పరమధార్మికుడు - అని వ్యాఖ్య. **"అఱమ్"** - అంటే ధర్మం. దానిని ఆచరించేవాడు **"అఱవన్"**.

**174. అవ :** ఓ మనసా ! పలు విధాలైన పూలను సమర్పించి, స్తుతించే దాసులను, వారి సంబంధిసంబంధులను శ్రీవేంకటేశ్వరుడు అనుగ్రహించి పరమపదానికి తీసికొని పోయి చేరుస్తాడు - అనే అతని ఔదార్యాదిగుణాలను దర్శించి అతని శ్రీపాదాలలో కైంకర్యాన్ని స్వీకరించావుకదా!'- అని సంతోషిస్తున్నారు.

**ఇణ్డైయాయివకొణ్డు తొణ్డర్గళేత్తువార్ ఉఱవోడుమ్, వానిడై**
**క్కొణ్డు పోయిడవుమ్ అదు కణ్డు ఎన్నెఞ్జమెన్బాయ్!,**
**వణ్డువాఴ్ వడవేఙ్గడమలై కోయిల్ కొణ్డదనోడుమ్, మీమిశై**
**అణ్డమాణ్డిరుప్పాఱ్కు అడిమై త్తొఴిల్ పూణ్డాయే 2-1-3**

నా మనమా! తుమ్మెదలు చేరి ఉండే తోటల వైభవాన్ని కల శ్రీవేంకటాచలాన్ని ఏలేటట్లే, పరమపదాన్నికూడా పాలిస్తూ, ఉభయవిభూతినిర్వాహకుడై పేరు పొందిన భగవానునకు కల అతని ఔదార్యం మొదలైన దివ్యకల్యాణగుణాలను చక్కగా గ్రహించి, "ఆస్వామికి కైంకర్యం చేయడం తగినది'' అని తెలిసి, శేషవృత్తిని స్వీకరించావే! ఏమి నీ భాగ్యం! ఆస్వామి తనకు పూమాలికలను సమర్పించడం

మొదలైన కైంకర్యాలను చేస్తూ తనను పూజించే భక్తులను మాత్రమే రక్షించడం కాకుండా, వారికి సంబంధి సంబంధులైనవారినికూడా అనుగ్రహిస్తాడు. ఈ మహాగుణాన్ని నీవు గ్రహించావుకదా! ఏమి నీ వివేకం!

**175. అవ :** నాకు ప్రియమైన మనసా! ఏ మాత్రం చలించని, దృఢమైన అధ్యయవసాయాన్ని కల్గి ఉన్నావు. ఈ భూలోకానికి పరమకృపతో వచ్చి అవతరించి, భక్తులనుండి పలు కైంకర్యాలను స్వీకరించి, అంతటితో తృప్తి పడకుండా నిత్యకైంకర్యాలను గ్రహించాలని వారిని తన పరమపదానికి తీసికొనిపోయి చేర్చే పరమోదారుడైన, తిరువేంకటాద్రిలో వేంచేసి ఉండే గోపాలకృష్ణునకు శేషవృత్తిని స్వీకరించావుకదా! ఆహా ఏమి భాగ్యం! అని ఆనందిస్తున్నారు.

**పావియాదు శెయ్‌దాయ్ ఎన్నెఞ్జమే! పణ్ణు తొణ్డు శెయ్‌దారై, మణ్మిశై**
**మేవి ఆట్కొణ్డు పోయ్ విశుమ్బేఱ వైక్కుమ్ ఎన్దై,**
**కోవినాయగన్ కొణ్డలున్దుయర్ వేఙ్గడమలై యాణ్డు, వానవర్**
**అవియాయిరుప్పాఱ్కు అడిమై త్తొழిల్ పూణ్డాయే 2-1-4**

నా మనసా! నీవు చలించకుండా, దృఢం అయిన నిశ్చయంతో స్వామి కైంకర్యంలో అన్వయించావుకదా! భక్తులనుండి పలు రీతులలో కైంకర్యాలను స్వీకరించడంకోసం ఈ భూలోకంలోకి వచ్చి అవతరించి, అంతటితో తృప్తిపడక ఇంకా వీరినుండి నిత్యకైంకర్యాలను గ్రహించాలని తలచినవాడై, వారిని తిరునాడుకు తీసికొనిపోయేవాడు, గోపాలకృష్ణుడై అవతరించినవాడైన వేంకటాచలాధీశునకు సర్వదేశ - సర్వకాల - సర్వావస్థలలోను నిత్యకైంకర్యాన్ని చేసే భాగ్యాన్ని పొందావే! ఏమి నీ అదృష్టపరిపాకం!

**176. అవ :** "అజ్ఞానప్రదం అయిన ఈ భూలోకంలో మనం వేదబాహ్యాలైన నాస్తిక మతాలలో జన్మించి గాని, ప్రవేశించిగాని పాడుకాకుండా, అదృష్టవిశేషంవల్ల శ్రీవైష్ణవ సంప్రదాయంలో ప్రవేశించి, స్వామికి శేషవృత్తిని చేసి తరిస్తున్నానుకదా!'' అని తమ ఆనందాన్ని ఆழ்వార్లు ఈ పాశురంనుండి మూడు పాశురాలలో వ్యక్తం చేస్తున్నారు. ఈపాశురంలో అసారాలైన జైన-బౌద్ధమతాలను నిరసిస్తూ పల్కుతున్నారు.

**పొఙ్గు పోదియుమ్ పిణ్డియుముడై ప్పుత్తర్ నోన్బియర్ పళ్ళియుళ్ళురై,**
**తఙ్గళ్ తేవరుమ్ తాఙ్గళుమే యాగ ఎన్నెఞ్జమెన్బాయ్!,**



**ఎఙ్గుమ్ వానవర్ దానవర్ నిఱైన్దేత్తుమ్ వేఙ్గడమ్మేవి నిన్ఱరుళ్,**
**అఙ్గణాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొழిల్ పూణ్డాయే 2-1-5**

నాకు ప్రియం అయిన మనసా! రావిచెట్టును నివాసంగా కల దేవతను భజించే బౌద్ధమతంలోనో, ఆశోకవృక్షాన్ని నివాసంగా కల దేవతను కొలిచే జైనమతంలోనో పుట్టకుండా, ఆ మతాలలో ప్రవేశించి నశించకుండా, ఆ అసారాలైన బాహ్యమతాలు అనే మహావృక్షాలు, శాఖలు ఉపశాఖలుగా చాలా పెరిగి, అజ్ఞానం అనే అంధకారం చేత వ్యాప్తం అయిన ఈ భూమండలంలో నీవు అదృష్ట విశేషంచేత పరమపద వాసులు, భూలోకవాసులు గుంపులుగా చేరి కొలిచే తిరుమలను ఆదరించి వేంచేసి ఉండే, కరుణను కురిపించే అందమైన నేత్రాలను కల స్వామికి ఇపుడు సేవావృత్తిని చేస్తున్నావుకదా! నీవుకదా భాగ్యశాలివి.

**"పోది"** - **"బోధి"** శబ్దభవం. ఇది రావి చెట్టును లక్షిస్తుంది. ఈ చెట్టుకిందనే బుద్ధునకు జ్ఞానోదయం అయింది. అందువల్ల దీనిని బౌద్ధులు పూజిస్తారు. **"పిణ్డి"** - అశోకవృక్షం. దీనిని జైనులు ఆరాధిస్తారు. పలు నోములు నోస్తారు కాబట్టి జైనులు **"నోన్బియర్"** అని నోములను నిరూపకంగా కలవారుగా ఇక్కడ నిర్దేశించబడ్డారు.

**177. అవ :** ఓ మనసా! నడుముకు కాషాయాన్ని కట్టుకొని, తలను బోడి చేసికొని, కనపడిన తిండిని అంతా తింటూ, శరీరాన్ని పెంచి, అంతటితో ఆగక, తమతోపాటు ఇతరులనుకూడా పాడుచేస్తూ, వారిని కలుపుకొని గుంపులు గుంపులుగా సంచరిస్తూ లోకాలను పాడుచేస్తూ కాలాన్ని గడిపే జైనులవలె నీవుకూడా వ్యర్థంగా కాలం గడపకుండా శ్రీవేంకటేశ్వరునకు సేవను చేసి సుఖంగా ఉజ్జీవిస్తున్నావుకదా- అని ఆనందిస్తున్నారు.

**తువరియాడైయర్ మట్టైయర్ శమణ్ తొణ్డర్‌గళ్ మణ్డి యుణ్డు పిన్నరుమ్,**
**తమరుమ్ తాఙ్గళుమే తడిక్క ఎన్ నెఞ్జమెన్బాయ్!,**
**కవరిమాక్కణమ్ శేరుమ్ వేఙ్గడమ్ కోయిల్ కొణ్డ కణ్ణార్ విశుమ్బిడై,**
**అమరనాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొழిల్ పూణ్డాయే 2-1-6**

నా ప్రియమైన మనసా! ఏమి నీ అధ్యవసాయంలోని దార్ఢ్యం! నడుముకు కాషాయ వస్త్రాన్ని ధరించి, తలవెంట్రుకలను బలవంతంగా పెరికికొని, బోడిగుండుతో ఉండే శ్రమణులు, తమ మనస్సుకు తోచినట్లు ఆహారాన్ని స్వీకరిస్తూ ఉండేవారు, వారితోపాటు వారిని చేరినవారుకూడా కండలను పెంచుకుంటూ ఉండగా, నీవు

వారివలె తిని శరీరాన్ని పెంచుకోవాలని చూడకుండా, చమరీమృగాలు గుంపులు గుంపులుగా చేరి సంచరించే తిరుమలను తన నివాసంగా చేసికొన్నవాడు, సువిశాలం అయిన పరమపదంలో ఉండే నిత్యసూరులకు నాథుడు అయిన స్వామికి ఈనాడు శేషవృత్తిని చేస్తున్నావు కదా! ఏమి నీ భాగ్యం!

**178. అవ :** "ఓ మంచి మనసా! శుష్కతర్కాలను కల తమ మతాన్ని ఆశ్రయించి, వాదిస్తూ, పెరుగు అన్నంతో పెద్దపెద్ద కబళాలను గొంతులో అడ్డుపడేటట్లు, కనుగ్రుడ్లు పైకివచ్చేటట్లు మింగుతూ, దురవస్థను అనుభవించే జైనుల బారిని పడకుండా, శ్రీవేంకటాచలంలోను, సూర్యమండలంలోను వేంచేసి ఉండే స్వామికి కైంకర్యాన్ని చేస్తున్నావు కదా!"- అని ప్రశంసిస్తున్నారు.

**తరుక్కినాల్ శమణ్ శెయ్‌దు శోఱుతణ్ తయిరినాల్ తిరళై, మిడ*ఱ్ఱి*డై**
**నెరుక్కువారలక్కణదు కణ్డు ఎన్నెఞ్జమెన్బాయ్!,**
**మరుట్కళ్ వణ్డుగళ్ పాడుమ్ వేఙ్గడమ్ కోయిల్ కొణ్డదనోడుమ్, వానిడై**
**అరుక్కన్ మేవి నిఱ్పార్క్కు అడిమైత్తొ*ழி*ల్ పూణ్డాయే 2-1-7**

శుష్కతర్కాలతో తమ జైనమతాన్ని పట్టుకొని, అసారాలు అయిన సప్తభంగి మొదలైన వాదాలను చేస్తూ, పామరజనాలను మోసగిస్తూ, కేవలం ఉదరపోషణంలో దృష్టిని కలవారై, గడ్డపెరుగుతో చేసిన అన్నకబళాలను గొంతులో కూరుకొంటూ, దేశ- కాల- దశానియమాలు ఏమీ లేకుండా ఎల్లప్పుడూ భుజిస్తూ తిరిగే జైనుల దురవస్థను చూచి, అది చాలా హేయం అని నిశ్చయించుకొని, వారి సమూహంలో చేరకుండా, మిక్కిలి తీయని పూల మకరందాన్ని తాగి, మదించిన తుమ్మెదలు మరుళ్ మొదలైన రాగాలను పాడే చోటు, పరమభోగ్యం అయిన తిరువేఙ్గడంలో భూలోక-పరమపదలోకవాసులకు సంసేవ్యుడై వేంచేసి ఉండే సూర్యమండల మధ్యస్థుడైన పరమపురుషుని ఆరాధించి, అతని శ్రీపాదాలలో కైంకర్యవృత్తిని స్వీకరించావు కదా! ఏమి నీ వివేకం! ఏమి భాగ్యం!

**179. అవ :** "పర-వ్యూహ-విభవ-అంతర్యామి-అర్చారూపాలలో కొన్నిటిని కొందఱు దౌర్భాగ్యులు దుర్భాషలాడుతూ, నిందిస్తూండగా, ఓమనసా! నీవు వారిని గర్హించి, నాతోకూడా చెప్పకుండా పరమభోగ్యం అయిన శ్రీవేంకటేశ్వరుడనే గోపాలకృష్ణుని శరణు పొంది, అతనికి శేషవృత్తిని చేస్తున్నావే! ఏమి నీ వివేకం!" అని ఆ*ழ*్వార్లు మనస్సును ప్రశంసిస్తున్నారు.



**శేయన్ అణియన్ శిఱియన్ పెరియనెన్బదుమ్ శిలర్ పేశ క్కేట్టిరు**
**న్దే ఎన్నెఞ్జమెన్బాయ్! ఎనక్కు ఒన్ఱు శొల్లాదే,**
**వేయ్‌గళ్ నిన్ఱు వెణ్ముత్తమే శొరి వేఙ్కడమలై కోయిల్ మేవియ,**
**ఆయర్‌నాయగఱ్కు ఇన్ఱు అడిమైత్తొ*ழి*ల్ పూణ్డాయే 2-1-8**

పరమవాసుదేవుడు అందని చోట ఉన్నందున అతనిని ఆశ్రయించడానికి సాధ్యం కాదని అంటారు కొందరు. అర్చావతారాలు చాలా సులభమై ఉండడంవల్ల వాటిని అనాదరంతో పల్కుతారు కొందరు. విభవావతారాలలో దోషాలను ఆరోపించి పల్కుతారు ఇంకొందరు. వ్యూహావతారం, అంతర్యామి మనస్సుకు అందనివి - అని పల్కి,వానిని తక్కువగా మాటలాడతారు మఱికొందరు. అందువల్ల ఈ విధంగా మనస్సుకు తోచిన రీతిలో పల్కుతూ భగవద్విషయంలోఆసక్తులు కాకుండా సంసారులై తిని, తిరుగుతూ ఉన్నారు. భగవానుని సౌలభ్యాన్ని దోషంగా భావించి నిందిస్తారు కొందరు. అతని పరత్వాన్ని లోపంగా నిందిస్తారు ఇంకొందరు. అతని మహిమను దోషంగా దూషిస్తారు కొందఱు.

ఈవిధంగా భగవానుని గుణాలను అన్నిటినీ దూషణాలకు లక్ష్యం చేసి, దూషించే వారివర్గంలో చేరకుండా ఓమనసా! నీవు నాతోసైతం ఒకమాటను చెప్పకుండా తటాలున వెదుళ్ళనుండి ముత్యాలు చిందే వేంకటాచలంలో వేంచేసి ఉండే స్వామి అయిన గోపాలకృష్ణుని శ్రీపాదాలలో శేషవృత్తిని స్వీకరించావు కదా! ఆహా! నీ భాగ్యమే భాగ్యం.

ఏనుగుల కుంభస్థలాలనుండి, వెదుళ్ళనుండి ముత్యాలు పుడతాయని కవి సమయమేకాక, లోకప్రసిద్ధికూడా. పాశురాలలో శ్రీకృష్ణునకు, వేంకటేశ్వరునకు ధర్మైక్యం సాధింపబడింది.

**180. అవ :** "మనసా! నీవు నిన్నటివరకు ఏవిధంగా పొద్దుగడుపుతూ తిరిగావు! ఇపుడు ఏవిధంగా ఉన్నావు!"- అని ఆశ్చర్యపడుతున్నారు.

**కూడియాడి యురైత్తదే ఉరైత్తాయ్ ఎన్నెఞ్జమెన్బాయ్! తుణిన్దు కేళ్,**
**పాడియాడి ప్పలరుమ్ పణిన్దేత్తి క్కాణ్గిలర్,**
**ఆడు తామరైయోనుమ్ ఈశనుమ్ అమరర్‌కోనుమ్ నిన్ఱేత్తుమ్, వేఙ్గడత్తు**
**ఆడు కూత్తనుక్కు ఇన్ఱు అడిమైత్తొ*ழி*ల్ పూణ్డాయే 2-1-9**

విషయాంతరాలలో ఆసక్తులై తిరిగే సంసారులతో కలసి ఉండి, వారు అనుభవించే లౌకికవిషయాలను అనుభవిస్తూ, వారు మాట్లాడే మాటలనే పల్కుతూ

నిన్నటివరకూ కాలాన్ని గడిపావుకదా నీవు! ఈ విధంగా ఉన్న నీవు ఇపుడు గభాలున ఎటువంటి స్థిరనిశ్చయాన్ని పొందావు! మంచి స్థితిని పొందావు! నీవు పొందిన భాగ్యం ఎటువంటిదో నీకు తెలియలేదు. నేను చెబుతున్నాను విను. నా మనసా! పలువురు స్తుతించి, ప్రార్థిస్తున్నా వారికి దర్శించడానికి సాధ్యం కానివాడు, బ్రహ్మరుద్రేంద్రులు మొదలైన గొప్ప దేవతలచే ఆశ్రయించి సేవింపబడేవాడు అయిన శ్రీవేంకటేశ్వరుని శ్రీచరణాలలో కైంకర్యాన్ని చేస్తున్నావుసుమా! నీ భాగ్యమే భాగ్యం!

**181. అవ** : చివరగా ఈ దశకాన్ని అనుసంధించినవారికి కలిగే ఫలాన్నిగూర్చి పల్కుతున్నారు.

మిన్ను మువుగిల్ వేవు తణ్ తిరువేఙ్గడమలై కోయిల్ మేవియ,
అన్నమాయ్ నిగ***ఴ్***న్ద అమరర్ పెరుమానై,
కన్ని మామదిళ్ మఙ్గైయర్ కలిగన్ఱి ఇన్ తమి***ఴ్***లాలురైత్త, ఇ
మ్మన్నుపాడల్ వల్లార్క్కు, ఇడ మాగుమ్ వానులగే **2-1-10**

మెఱిసే కాలమేఘాలు చేరి ఉన్నందున సుభగమై, శీతలమై, పరమరమణీయంగా ఉండే తిరుమలను నిత్యనివాసస్థానంగా చేసికొన్నవాడు, హంసరూపియై అవతరించి, బ్రహ్మకు వేదాలను తిరిగి ఇచ్చినవాడు అయిన స్వామిని గూర్చి కలికన్ఱి అనబడే తిరుమఙ్గైయాళ్వార్లు అనుగ్రహించిన ఈ దశకాన్ని అనుసంధించగల్గినవారు పరమ పదాన్ని వాసస్థానంగా పొందగలరు.

ఇకపై, పెరియతిరుమొ***ఴి*** ప్రబంధంలోని ప్రత్యేక పాశురాలు, వాటి భావం తెలుపబడుతున్నవి.

**182. అవ** : "తివళుమ్ వెణ్ మదియిల్" అనే గత దశకంలోని ఆళ్వార్లు భక్తిప్రకర్షవల్ల పరాంకుశనాయకీభావాన్ని పొంది మోహించి పడి ఉండగా, ఆమె తల్లి "తిరువిడవెన్దై" అనే దివ్యదేశంలోని స్వామి సన్నిధిలో పరాంకుశనాయకి ఆర్తిని వెల్లడిస్తూ, "ఈమెను ఏం చేయాలని అనుకుంటున్నావు?" అని ప్రశ్నించింది. ఈమె వచనాలలో స్వామి గుణకీర్తనాన్ని విన్న నాయకి కొంచెం తేరుకొని **"తిరువట్టపుయకరమ్"** (అష్టభుజ స్వామి సన్నిధి) లోని భగవానుని భావించి, ఆ భావనాప్రకర్షవల్ల తల్లితో చెలికత్తెలతో ఆ స్వామికి తనకు మధ్య జరిగిన సంభాషణను ఇందులో వివరించడంద్వారా అతని వైభవాన్ని కీర్తిస్తూ పల్కుతున్నది.



గడచిన పాశురంలో "నేను నృసింహావతారాన్ని ఎత్తినది అర్భకుడైన ప్రహ్లాదుని రక్షించడంకోసం మాత్రమే కాదు, మీకు సహాయం చేయడంకోసంకూడా వచ్చి అవకాశం కోసం వేచి ఉన్నాను" అని స్వామి అన్నాడు. అపుడు నాయిక ఈ పాశురంలో "నీవు నాకోసం కాదు, ప్రయోజనాంతపరులైన దేవతలకోసమే లోకాలన్నిటినీ కొలిచి నీవశం చేసికోవాలనే **"మణ్ణాశై"**తో త్రివిక్రముడవు అయ్యావు" అని తాను అంటే - అందుకు స్వామి "నేను నాకోసమే పరాంకుశనాయకి అనే స్త్రీవిషయంలోని **"పెణ్ణాశై"** వల్లనే - అంటే - త్రివిక్రమాపదానంద్వారా పరాంకుశనాయకిని స్వాధీనం చేసికోవడంకోసమే ఈ లీలను చేశాను" అని అన్నాడని అంటున్నది.

వెన్దిఱల్ వీరరిల్ వీరరొప్పార్ వేద మురైత్తిమైయోర్ వణఙ్గుమ్,
శెన్దమి***ఴ్*** పాడువార్తామ్ వణఙ్గమ్ తేవరివర్కొల్ తెరిక్కమాట్టేన్,
వన్దు కుఱళురువాయ్ నిమిర్న్దు మావలివేళ్వియిల్ మణ్ణళన్ద,
అన్దణర్ పోన్ఱివరార్ కొల్? ఎన్న అట్టపుయకరత్తే నెన్టారే **2-8-2**

దేవతలు వేదవాక్యాలను పల్కి నమస్కరించే గొప్ప పరాక్రమశాలురు అందరిలోనూ గొప్ప వీరుడైన శ్రీరామునివంటి ఈ మహనీయుడు అందమైన ద్రావిడ కవిత్వాన్ని పాడిన ముదలాళ్వార్లచే నమస్కరింపబడిన శ్రీవేంకటేశ్వరుడా! ఏమి! నాకు తెలియడం లేదు. మహాబలి యజ్ఞవాటికలో వామనమూర్తిగా వచ్చి, ఆ బలిచక్ర వద్దనుండి దానజలధారాపూర్వకంగా మూడడుగుల నేలను స్వీకరించగానే, త్రివిక్రముడై పెరిగి భూమిని కొలిచిన బ్రహ్మచారివలె ఉండే వీరెవ్వరో! - అని నేను అనగానే ఆయన "నేను అష్టభుజస్వామిని సుమా!" - అని అన్నారు.

**"శెన్దమి*ఴ్* పాడువార్"** అంటే ముదలా***ళ్***వార్లు - **"పెరున్దమి*ఴ్*నల్లేన్ పెరితు"** అని పూదత్తాళ్వార్ల సూక్తి స్మరణీయం. వీరు **"వణఙ్గుమ్ దేవర్"** అంటే వేంకటేశ్వరుడే. ముదలాళ్వార్ల ప్రబంధాల్లో ప్రచురంగా కన్పించే క్షేత్రం తిరుమలే. **"వెన్దిఱల్ వీరరిల్ వీరర్"** - **"శత్రోః ప్రఖ్యాత వీరస్య రంజనీయస్య విక్రమైః"** - అనే శ్రీరామాయణసూక్తి స్మరణీయం. భవభూతి శ్రీరాముని కథను **"మహావీరచరితమ్"** అనే పేరుతో గొప్ప రూపకంగా వ్రాయగా, శ్రీదేశికులు **"మహావీరవైభవమ్"** అని శ్రీరామాయణ గాథను రుచిరగద్య రూపంలో వెలయించారు.

**183. అవ** : "పూర్వం తనకు మనుమడు అయిన అనిరుద్ధుని చెఱనుండి విడిపించడం కోసం బాణాసురుని బాహువులను శ్రీసుదర్శనంతో ఖండించిన

శ్రీకృష్ణుడు, పరమ భోగ్యం అయిన వేంకటాచలంలో వేంచేసి ఉండే శ్రీవేంకటేశ్వరుడు నాకు శెమ్బొన్‌శెయ్ కోయిల్ అనే దివ్యదేశంలో వరదరాజస్వామిగా సేవను అనుగ్రహించగా నేను దర్శించి, ఉజ్జీవించాను"- అని ఇందులో అంటున్నారు.

అన్దియ వాణనాయిరమ్ తోళుమ్ తుణియ అన్రు ఆ*ழி*తొట్టానై,
మిన్ తిగ*ழு* కుడుమి వేఙ్గడమలైమేల్ మేవియ వేదనల్ విళక్కై,
తెన్‌తిశై త్తిలద మనైయవర్ నాఙ్గై చ్చెమ్బొన్ శెయ్ కోయిలినుళ్ళే,
మన్దదు పొలియ మగి*ழ்*న్దు నిన్రానై వణఙ్గి నాన్ వా*ழ்*న్దొ*ழி*న్దేనే **4-3-8**

తనపై కోపించి ఎదిరించిన బాణుని వేయి బాహువులను ఖండించి, అవి కింద పడేటట్లు తన పౌత్రుడైన అనిరుద్ధుని చెఱనుండి విడిపించే సమయంలో శ్రీసుదర్శన చక్రాన్ని ప్రయోగించిన శ్రీకృష్ణుడు, ప్రకాశించే శిఖరాలను కల వేంకటాచలం అనే గొప్ప పర్వతంపై వేంచేసి ఉన్నవాడు, వేదాలచేత తెలియబడతగిన గొప్ప దీపంవంటి వాడు, దక్షిణదిక్కుకు తిలకంవంటి మహానుభావులు నివసించే శెమ్బొన్ శెయ్‌కోయిల్ అనే దివ్యదేశంలో శ్రీవైష్ణవగోష్ఠి వెలిగేటట్లుగా మనస్సులో ఆదరించి వేంచేసి ఉన్నవాడు అయిన స్వామిని ఏ యోగ్యతను లేని నేను నమస్కరించి, కళ్ళార దర్శించి, ఆ స్వామి శ్రీపాదాలను సేవించి ఉజ్జీవనాన్ని పొందాను.

పంతువరాళిరాగంలో - ఆటతాళంలో ఈపాశురం రచింపబడింది.

**"ఆ*ழி* తొట్టానై"** - అతిలాఘవంగా బాణాసురుని వేయి బాహువులను ఛేదించిన విషయం ఈ ప్రయోగంద్వారా వ్యక్తం. **"మన్దు"** - అనేకులు చేరి ఉండే గోష్ఠి

**184. అవ:** "ఉత్తరదేశంలో, దక్షిణదేశంలో తిలకస్థానీయాలుగా ఉండే తిరువేంకటాచలంలో, తిరువెళ్ళుక్కుళమ్‌లోను పరమభోగ్యుడుగా వేంచేసి ఉండేవాడా! నిన్నే కీర్తించే ఈ దాసుని కర్మలను తీర్చాలి"- అని ప్రార్థిస్తున్నారు.

వేడార్ తిరువేఙ్గడమ్ మేయ విళక్కే!,
నాడార్ పుగ*ழ்* వేదియర్ మన్నియవాఙ్గూర్,
శేడార్ పొ*ழி*ల్‌శూ*ழ்* తిరువెళ్ళుక్కుళత్తాయ్!,
పాడా వరువేన్ వినైయాయినపా*ற்*రే **4-7-5**



ఏనాడూ విశ్లేషించకుండా శ్రీవేంకటేశ్వరుని విషయంలో భక్తులై ఉండే శ్రీగుహ పెరుమాళ్‌వంటి వ్యాధులు వంశపారంపర్యంగా స్థిరనివాసం ఏర్పరచుకొని ఉండే శ్రీవేంకటాద్రిలో, దేశమంతా వ్యాపించిన కీర్తిని కల, విలక్షణజ్ఞానానుష్ఠాన సంపన్నులైన, సర్వదేశ-సర్వకాల- సర్వావస్థలలోను భగవానునకు మంగళాశాసన పరులైన పరమవైదిక శిఖామణులు నిత్యవాసం చేసే తిరునాఙ్గూర్‌లో, వికసించిన పూలతో కూడి, చాలా మనోహరంగా ఉండే తోటలతో చుట్టబడి ఉన్న తిరువెళ్ళుక్కుళమ్‌లోను, ఆదరంతో నిత్యవాసం చేసే స్వామీ! నీ కల్యాణగుణచరిత్రలనే ఎల్లప్పుడూ గానం చేస్తూ పశ్చాత్తాపంతో తిరిగే దాసుడనైన నా కర్మలను అన్నిటినీ పోగొట్టి రక్షించాలి.

దేశీయరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

**185. అవ :** శ్రీకృష్ణుడై అవతరించి,విరోధులను నిర్మూలించి, తనను ఆశ్రయించిన పంచపాండవులను కాపాడి, ఆ విజయం వ్యక్తం అయేటట్లు తిరువెళ్ళత్తైలోను, శ్రీవేంకటాచలంలోను వేంచేసి ఉండే స్వామీ! దాసునకు పరమభక్తిని ప్రసాదించాలి- అని ఇందులో ప్రార్థిస్తున్నారు.

వామ్బరి యుగ మన్నర్‌దమ్ ఉయిర్ శెగ ఐవర్‌గట్కు అరశళిత్త,
కామ్బినార్ తిరువేఙ్గడప్పొరుప్పు! నిన్‌కాదలై అరుళ్ ఎనక్కు,
మామ్బొ*ழி*ల్ తళిర్ కోదియ మడక్కుయిల్ వాయదు తువర్‌ప్పెయ్‌ద,
తీమ్బలఙ్గనిత్తేనదు నుగర్ తిరువెళ్ళఱైనిన్రానే **5-3-4**

మనోహరాలైన మామిడితోటలలో లేలేత చిగుళ్ళను కొఱికి తినే అందమైన కోయిలలు తమ గొంతుకు వాటి వగరువల్ల వెగటు కలుగగా, ఆ రసం మాఱడంకోసం తీయని పనసపళ్ళలోని తేనెను తాగి ఆనందించి, మత్తెక్కి, ఆ ఆనంద పరీవాహ రూపంగా పంచమస్వరంలో పాడే చోటు, పరమభోగ్యంగా ఉండే చోటు అయిన శ్రీవేంకటాచలంలో అత్యంతాదరంతో వేంచేసి ఉన్న స్వామీ! పంచపాండవులను అనుగ్రహించడంకోసం నీవు పడరాని పాట్లు పడ్డావు. భారతయుద్ధంలో పైపైకి వచ్చే అశ్వాలు నశించేటట్లు, శత్రురాజుల ప్రాణాలు పోయేటట్లు చేసి, పాండవులకు రాజ్యాన్ని అనుగ్రహించావు. ఆ విధంగా నాకోసం ఏదయినా అరుదైన కార్యాన్ని చేయాలా! నీ ధ్యానంలో నాకు రుచిని కల్గించి, నేను చేసే కైంకర్యాన్ని స్వీకరించు. అంతే కదా నేను ప్రార్థించేది.

శంకరాభరణరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

**186. అవ :** అన్యాపదేశప్రక్రియలో (నాయికాభావనతో) అనుగ్రహింపబడిన దశకంలోనిది ఈ పాశురం ఆళ్వార్లు ఒక స్త్రీ దశను పొందిన, **"పరకాలనాయకి"** అనే పేరును పొంది, శ్రీరంగనాథుని విషయంలో తమకున్న ప్రావణ్యాన్ని, నాయకి తల్లి చెప్పే సన్నివేశంలో ఈపాశురం అనుగ్రహింపబడింది.

ఈ పాశురంలో పరకాలనాయకిని కని, పెద్ద చేసిన తల్లి, శ్రీరంగనాథునిపట్ల తన కుమార్తె ఉత్కట ప్రేమను పొంది, పిచ్చెక్కిన స్థితిలో ఉండే తీరును పల్కి, "స్వామి ఈమెను ఎటువంటి ఏపాట్లు పెట్టాడో చూడండి'' అని అంటున్నది.

**వెరువాదాళ్ వాయ్ వెరువి వేఙ్గడమే!**
**వేఙ్గడమే! ఎన్గిన్టాళాల్,**
**మరువాళాల్ ఎన్‌కుడఙ్గాల్ వాళ్ నెడుఙ్గణ్**
**తుయిల్ మఱన్దాళ్, వణ్డార్ కొణ్డల్**
**ఉరువాళన్  వానవర్‌దముయిరాళన్**
**ఒలితిరైనీర్ ప్పావమ్ కొణ్డ**
**తిరువాళన్, ఎన్ మగళై చ్చెయ్‌దనగళ్**
**ఎఙ్గనమ్ నాన్ శిన్దిక్కేనే? 5-5-1**

మదించిన తుమ్మెదలవలె, నిండుగా నీటిని కల మేఘంవలె అభిలషించదగిన రూపాన్ని కలవాడు, నిత్యసూరులకు ప్రాణస్థానీయుడు, పెద్దగా ఘోషించే గొప్ప గొప్ప అలలను కల క్షీరాబ్ధిని చిలికినపుడు అవతరించిన మహాలక్ష్మిని పత్నిగా స్వీకరించిన స్వామి నాకుమార్తె విషయంలో చేసిన ప్రకారాలను నేను భావించడానికి వీలున్నదా? అతడు ఏకొంచెంకూడా ఆర్ద్రతను, ఆనృశంస్యాన్ని లేనివాడై ఈమెను ఏపాట్లు పెడుతున్నాడో చూడండి. అయ్యో! నా కుమార్తె స్వామిపట్ల ప్రేమను కల్గి, పిచ్చెక్కి ఉన్నది. కొంచెంఅయినా భయపడకుండా "వేంకటాచలం! వేంకటాచలం!'' అని నోరు తెఱచి పలవరిస్తున్నది. నా ఒడిలో కొంచెంకూడా పొందికగా ఉండలేకుండా ఉన్నది. ఈటెవంటి దీర్ఘమైన తన కన్నులలో నిద్రను మఱచిపోయింది. అయ్యో! నేను ఏం చేయను?

కాంభోజిరాగంలో - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

శ్రీరంగనాథుని కీర్తించే సమయంలో వేంకటేశ్వరుని ప్రసక్తి ఏవిధంగా? అని అంటే **"విరైయార్ పొழిల్ వేఙ్గడవన్..... నీళ్‌మదిళ్ అరఙ్గత్తమ్మాన్"** అనే అమలనాది పిరాన్ సూక్తి స్మరణీయం. భగవద్రామానుజులుకూడా శ్రీరంగంలో శ్రీభాష్యరచన చేసేటపుడు శ్రీభాష్య ప్రారంభంలో వేంకటేశ్వరుణ్ణి, తిరుమలలో వేదార్థసంగ్రహాన్ని అనుగ్రహించేటపుడు మొదట శ్రీరంగనాథుణ్ణి స్మరించడంకూడా గమనించాలి. **"కావేరీ విరజా సేయమ్", "మాయావీ పరమానందమ్"** ఇత్యాది పరస్పరసామ్యాలు కూడా ఈ రెండిటికీ ఉన్నాయి. ఈ రెండు అర్చామూర్తుల మధ్య ధర్మైక్యం ఉండనే ఉన్నది.



**187. అవ:** ధ్యానానికి విషయం అయినవాడు, శ్రియఃపతి, వేంకటేశ్వరుడు, తిరుక్కోవలూర్‌లో వేంచేసి ఉండే త్రివిక్రమమూర్తి అయిన స్వామిని నేను సేవించగల్గినది శ్రీరంగంలోనే- అని అంటున్నారు.

**శిన్దనైయై త్తవనెఱియై త్తిరుమాలై, పిరియాదు**
**వన్దు ఎన్ మనత్తిరున్ద వడమలైయై వరివణ్డార్,**
**కొన్దణైన్ద పొழిల్కోవల్ ఉలగళప్పాన్ అడి నిమిర్‌త్త**
**అన్దణనై, యాన్ కణ్డదు అణినీర్ త్తెన్నరఙ్గత్తే 5-6-7**

నా మనోరథానికి లక్ష్యభూతుడు, మోక్షం పొందడానికి ఉత్తమోపాయమైనవాడు, పురుషకారస్వరూపిణి అయిన లక్ష్మీదేవికి వల్లభుడు, రమ్యమైన శ్రీవేంకటాచలానికి అధిపతి, దానిని కాదని వదలి వచ్చి నా మనస్సులో ఒక క్షణంకూడా విడువకుండా వేంచేసి ఉన్నవాడు, అందమైన తుమ్మెదలు మూగి ఉండే పూలగుత్తులు దట్టంగా ఉన్న ఉద్యానవనాలతో కూడుకొని ఉండే తిరుక్కోవలూర్‌లో లోకాలను కొలువడం కోసం చాచిన శ్రీపాదంతో సేవను అనుగ్రహించే పరమాత్మను నేను అందమైన కావేరీతీర్థంతో కూడిన, పరమపవిత్రంగా ఉండే శ్రీరంగదివ్యక్షేత్రంలో సేవించాను.

ఈ పాశురం భైరవిరాగంలో - రూపకతాళంలో ఉన్నది.

అత్యంతభోగ్యం అయిన పరమపదాన్ని వదలి, అతినికృష్టం అయిన నా మనస్సులో స్వామి నిత్యవాసం చేస్తున్నాడు. ఏమి అతని వాత్సల్యం! ఏమి సౌశీల్యం! ఏమి ఆశ్రితవ్యామోహం! అని ఆళ్వార్లు ఆశ్చర్యపడుతున్నారు.

**188. అవ:** "కృష్ణాజినంతో తన దివ్యవక్షస్సులో ఉండే లక్ష్మిని మఱుగు పఱచి, మహాబలి దగ్గర మూడడుగుల నేలను యాచించిన త్రివిక్రమస్వరూపియై లోకాలను ఆక్రమించి, అందఱిని ఉజ్జీవింపజేయడమే కాక, అన్నికాలాలో అందఱు వచ్చి సేవించి తరిస్తారనే ఉద్దేశ్యంతో తిరుమలలో వేంచేసి ఉండే పరమపురుషుని తిరునఱైయూర్‌లో సేవించ గలిగాను'' - అని అంటున్నారు.

మాన్‌కొణ్డ తోల్ మార్విన్ మాణియాయ్, మావలిమణ్
తాన్‌కొణ్డు తాళాలళన్ద పెరుమానై,
త్తేన్ కొణ్డ శారల్ తిరువేఙ్గడత్తానై,
నాన్ శెన్టు నాడి నఱైయూరిల్ కణ్డేనే 6-8-1

"అకలకిల్లేన్ ఇఱైయుమ్" అని నిత్యం అనుసంధిస్తూ క్షణం కూడా వక్షఃస్థలాన్ని విడిచి పోలేకుండా, అక్కడే సదా వేంచేసి ఉండే ఐశ్వర్యాధిదేవత అయిన శ్రీదేవిని కృష్ణాజినంతో కనపడకుండా మఱుగుపఱుచుకొని, వామనబ్రహ్మచారియై, మహాబలి యజ్ఞవాటికలో ప్రవేవించి, మూడడుగుల నేలను అతనిని అర్థించి పొంది, ముల్లోకాలను కొలిచిన స్వామి, అపుడు తనను కోల్పోయినవారు సైతం తన పాదాలను ఆశ్రయించి ఉజ్జీవించేట్లుగా శ్రీవేంకటాద్రికి వచ్చి నిలచిన స్వామి, అక్కడికి పోవడానికికూడా శక్తి లేనివారు సైతం ఉజ్జీవించేటట్లు సర్వసులభుడై, పరమరమణీయం అయిన తిరునఱై యూర్‌లో వేంచేసి ఉండి సేవను అనుగ్రహిస్తున్నాడు'' - నా తండ్రి, పరమకారుణికుడు అయిన అతనిని ఈనాడు కన్నులారా దర్శించగలిగాను. నా భాగ్యమే భాగ్యం! నా అదృష్టమే అదృష్టం! ధన్యుణ్ణి అయ్యాను. చాలా ధన్యుణ్ణి అయ్యాను.

భైరవిరాగంలో - జంపతాళంలో ఈ పాశురం ఉన్నది.

"మాన్‌కొణ్డతోల్ మార్బిన్" - "కృష్ణాజినేన సంవృణ్వాన్" అని అన్నట్లు వామన బ్రహ్మ బ్రహ్మచారిరూపంలోనూ వక్షఃస్థలంలో ఉండే లక్ష్మిని కృష్ణాజినంతో నీవు కప్పి పుచ్చావు. లేకపోతే శ్రీమంతుడవైన నీకు బిచ్చంవేయ సాహసించే వారెవ్వరు?- అనే సారస్యం ఇక్కడ వ్యంగ్యం. "తాళాల్ అళన్ద తిరువేఙ్గడత్తానై" - ఈసూక్తికి "అన్టు ఞాలమ్ అళన్ద పిరాన్ పరన్ శెన్టు శేర్ తిరువేఙ్గడమామలై" అనే తిరువాయ్‌మొழிసూక్తితో గల అర్థసంవాదం గమనించతగినది.

**189.** **అవ :** గత పాశురంలో ఆழ்వార్లు "అరుళ్ తన్దిడుమ్" (కృపచేయాలి) అని తిరునఱైయూర్‌లోని స్వామిని ప్రార్థించగానే, భగవానుడు "క్షీరాబ్ధిలో పరుండి ఉండడం, తిరుమలలో నిలచి ఉండడం, తిరుక్కోట్టియూర్‌లో వచ్చి ఉండడం - అంతా మీకోసమే కదా'' అని అన్నాడు. అప్పుడు చాలా ఆనందించిన ఆழ்వార్లు ఇక "నాకు తప్ప వేఱెవ్వరికీ ఈ కృపను ఇవ్వను" అని అంటూ తృప్తులు అవుతున్నారు

తాన్ పిఱర్క్కు ఉన్నరుళెన్నిడై వైత్తాయ్,
ఆరేన్ అదువే పరుకి క్కళిక్కిన్టేన్,
కారేయ్ కడలే మలైయే తిరుక్కోట్టి
యూరే!, ఉకన్దాయై ఉకన్దు అడియేనే 7-1-3

తిరునఱైయూర్‌లోని స్వామీ! నీ కృపను నాపట్ల నిలిపావు. ఇక ఈ అనుగ్రహాన్ని నేనెవ్వరికీ ఇవ్వను. మేఘాలు వచ్చి చేరే క్షీరాబ్ధిని, తిరుమలను, తిరుక్కోట్టియూర్‌ను హృదయపూర్వకంగా వాసస్థానాలుగా గ్రహించిన నిన్ను నేను ఆశపడి తృప్తిని పొందనివాడనై, ఆ నీ కృపనే అనుభవించి సంతోషిస్తున్నాను.

**190.** **అవ :** "పలు పలు పాపాలను చేసి, వాటి ఫలంగా క్రూరనరకాలకు పోయి, బాధపడే సమయంలో ఉదాసీనుడై ఉండకుండా, అక్కడకు వేంచేసి సేవను అనుగ్రహించి, అభయప్రదానాన్ని చేసి, రక్షించే స్వామినే నా మనస్సు ఎల్లప్పుడూ చింతిస్తున్నది''- అని అంటున్నారు.

ఆఙ్గు వెన్నరగత్తు అழுన్దమ్ పోదు
అఞ్జేలెన్టు అడియేనై అఙ్గే వన్దు
తాఙ్గు, తామరై యన్న పొన్నారడి
ఎమ్బిరానై ఉమ్బర్‌క్కణియాయ్ నిన్ట,
వేఙ్గడత్తరియై ప్పరి కీఱియై
వెణ్ణె యుణ్డు ఉరలినిడై యాప్పుణ్డ
తీఙ్గరుమ్బినై, తేనై నన్ పాలినై యన్టి
ఎన్ మనమ్ శిన్దై శెయ్యాదే 7-3-5

పలు రీతులలోని ఎన్నో పాపాలను పలు రకాలుగా చేసి, వాటి ఫలంగా చాలా దుర్భరాలైన నరకాలలో ప్రవేశించి, ఎన్నో యమయాతలను అనుభవించే సమయంలో పరమకృపతో అక్కడికి వేంచేసి, "నేనుండగా పాపాలనుగూర్చి భయపడే పని ఉన్నదా!'' అని అభయప్రదానాన్ని చేసి, నన్ను కాపాడిన స్వామి, పరమసుకుమారమైన మిక్కిలి అందాన్ని కల శ్రీచరణాలను కలవాడు, నాకు మిక్కిలి ఉపకారాన్ని చేసినవాడు, పైన ఉండే లోకాలకు అన్నిటికీ అలంకారం అయిన, సుభగశీతలంగా ఉన్న వేంకటాచలంపై గొప్ప సింహంవలె వేంచేసి ఉన్నవాడు, హయగ్రీవుడై వచ్చిన కేశి అనే అసురుని నోటిని చీల్చి వేసినవాడు, వెన్నను దొంగిలించి, ఆరగించి రోటికి కట్టుబడినవాడు, తీయని చెఱకుపానకంవంటివాడు, తేనెవలె పరమభోగ్యుడు, మధురమైన క్షీరంవలె ఉన్నవాడు పరమరమణీయం అయిన తిరునఱైయూర్‌లో సకలకల్యాణగుణపూర్ణుడై వేంచేసి ఉన్నాడు. అతనిని తప్ప వేఱొకనిని నా మనస్సు

కొంచెం కూడా స్మరించదు. ఇటువంటి మనస్సును కల్గి ఉండడం నిజంగా నా భాగ్యం.

మోహనరాగం - రూపకతాళంలో ఈ పాశురం ఉన్నది.

"ఉమ్బర్" - ఊర్ధ్వలోకాలు - అని, ఊర్ధ్వలోకం అయన పరమపదంలోని నిత్య సూరులు - అని అర్థం చెప్పవచ్చు. మొదటి అర్థంలో పరమపదంవరకు వ్యాపించి ఉండే వేంకటాద్రి ఔన్నత్యం వ్యంగ్యం. రెండవ అర్థంలో పరమపదంలోని నిత్య సూరులను వదలి, అస్మాదృశులను అనుగ్రహించడం కోసం తిరుమలకు స్వామి వేంచేశాడు - అనే అర్థం భావ్యం. దీనివల్ల స్వామి సౌలభ్య, సౌశీల్య గుణాలు వ్యంగ్యాలు "పరి కేశియై" -శ్రీకృష్ణావతారంలో కేశి అనే గుఱ్ఱపు రూపుతో వచ్చిన అసురుణ్ణి చీల్చిన కథ స్మరణీయం.

**191. అవ :** "అర్ధనారీశ్వరుని తన శరీరంలో ఒకవైపు ధరించి ఆనందించేవాడు, సుశీలుడు, ఆకాశస్వరూపుడు, సూర్యమండలమధ్యవర్తియైనవాడు, రాత్రి పగలు అనే కాల విభాగానికి కారణమైనవాడు అయిన శ్రీవేంకటేశ్వరుని తిరుక్కణ్ణమఙ్గైలో సేవించాను'' అని- అంటున్నారు.

ఎఙ్గళుక్కు అరుళ్ శెయ్‌గిన్ఱ ఈశనై
వాశవార్ కుழలాళ్ మలైమఙ్గైతన్
పఙ్గనై, ప్పఙ్గిల్ వైత్తుగన్దాన్‌తన్నై
ప్పాన్మైయై ప్పనిమామదియమ్ తవழ్,
మఙ్గులైచ్చుడరై వడమామలై
యుచ్చియై నచ్చి నామ్ వణఙ్గప్పడుమ్
కఙ్గులై, ప్పగలై చ్చెన్ఱు నాడి
క్కణ్ణమఙ్గైయుళ్ కణ్డుకొణ్డేనే **7-10-3**

నేను స్వామిని తిరుక్కణ్ణమఙ్గైలో సేవించగలిగాను. అతడు ఎటువంటివాడు? అని అంటే - అనన్యగతికులైన నావంటివారి విషయంలో నిర్హేతుకమైన కృపను చేయగలవాడు, దాసులమైన మావంటివారివలె కాకుండా, ఈశ్వరాభిమానాన్ని కల్గి ఉండి, సువాసనను కల దివ్యకేశపాశంతో విరాజిల్లే పార్వతిని తన సగభాగంగా కల్గి ఉండి, భోగలీలారసాన్ని అనుభవించే ఈశ్వరుని తన తిరుమేనిలో ఒకవైపు ధరించి, దానిని తన ప్రయోజనంగా తలచి ఆనందించే శీలగుణంతో మహోన్నతుడు, ఈశీలం ఏదో ఒకకాలంలో మాత్రమే కాకుండా ఎల్లప్పుడూ దానినే స్వభావంగా



కలవాడు, చల్లని పూర్ణచంద్రుడు సంచరించే ఆకాశానికి, సూర్యునకు నియామకుడై ఉండేవాడు. వడతిరువేఙ్గడమ్ (ఉత్తరదిక్కులోని తిరుమల) అనే పర్వతంయొక్క శిఖరానికి గొప్ప ఆభరణంగా ఉండేవాడు, 'మనచే ఆదరంతో సేవింపబడేవాడు'. భోగం అనుభవించడానికి తగిన రాత్రిపొద్దు, ఇందుకోసం ధనం సంపాదించడానికి వీలయిన పగటి పొద్దు - అనే ఈ రెండింటికి నిర్వాహకుడై ఉన్నవాడు. ఇటువంటి స్వామిని నేను తిరుక్కణ్ణమఙ్గైలో సేవించాను.

తోడిరాగం - ఆటతాళంలో ఈ పాశురం కూర్చబడింది.

**192. అవ :** పరకాలనాయకి విరహతప్తదశను చూచిన ఆమె తల్లి తల్లడిల్లి, తిరుక్కణ్ణపురంలోని స్వామినే నేరుగా ఉద్దేశించి తన పరితాపాన్ని తెలుపుతున్నది. లేక, తనలో తాను బాధపడుతూ పల్కుతున్నది- అనికూడా చెప్పవచ్చు.

అరువి శోర్ వేఙ్గడమ్ నీర్ మలై యెన్ఱు వాయ్
వెరువినాళ్, మెయ్యమ్ వినవి యిరుక్కిన్ఱాళ్,
పెరుగు శీర్ క్కణ్ణపురమెన్ఱు పేశినాళ్,
ఉరుగినాళ్, ఉళ్‌మెలిన్దాళ్ ఇదు ఎన్‌గొలో? **8-2-3**

ఈ పరకాలనాయకిని ఉద్దేశించి నేను ఏదైనా హితాన్ని పల్కినా, దానిని ఈమె పెడచెవిని పెడుతున్నది. దానికి సమాధానాన్నికూడా పల్కడం లేదు **"తిరువేఙ్గడమ్", తిరునీర్‌మలై"** అనే ఎల్లప్పుడూ ఈమె నోటు తెఱచి పలవరిస్తూ ఉన్నది. కొన్ని సమయాలలో **"తిరుమెయ్యమ్"** అనే దివ్యదేశానికి **"మెయ్యమ్"** అనే పేరు ఎందుకు వచ్చింది? దాసులకు సత్యస్వరూపుడుగా నిలచి, వారి కార్యాన్ని పూర్తి చేసే చోటు- అనే కారణంతోనా దానికి ఆ తిరునామం కల్గింది? అని తనకు దగ్గరగా ఉండేవారిని ప్రశ్నిస్తున్నది. దానికి బదులు పల్కేవారెవ్వరూ లేనందువల్ల పెద్ద నిట్టూర్పు విడచి మౌనంగా ఉండిపోతున్నది. ఇంకా కొన్ని సమయాలలో **"తిరుక్కణ్ణపురమ్"** అని నోటితో నిండుగా పల్కగానే, ఆ క్షణంలోనే నీటిబుడగవలె కఱగిపోతున్నది. మనస్సు శిథిలమౌతున్నది. ఈ విధంగా ఈమె కష్టపడడానికి నా పాపమే కారణం. వేఱొక కారణం ఏమో తెలియలేదు.

సైంధవి రాగం - ఆటతాళంలో ఈ పాశురం ఉన్నది.

**193. అవ :** భగవద్విరహార్తివల్ల తిరుమఙ్గైయాழ్వార్ పరాంకుశనాయకీభావాన్ని పొంది పలికే పాశురం ఇది. తిరుక్కణ్ణపురాన్ని రేపల్లెగాను, శౌరిరాజస్వామిని శ్రీకృష్ణుని

గాను, తమను ఒక గోపికగాను ఆళ్వార్లు భావించారు. ఆ అనుకారం ఉన్మస్తకం కాగానే "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే వేదాంతవాక్యప్రక్రియలో ప్రకార ప్రకారిభావం వల్ల కలిగే ఐక్యాన్ని పురస్కరించుకొని పరాంకుశనాయకి తనను శౌరిరాజప్పెరుమాళ్ గానే భావించి ఇందులో పలుకగా, ఆమె మాటను తల్లి చెలికత్తెల ముందు అనువదిస్తున్నది. తిరువాయ్‌మొళిలోని "కడల్ ఞాలమ్ శెయ్‌దేనుమ్ యానే ఎన్నుమ్" (5-6) అనే దశకంవంటిదే ఇది. అయితే, తిరువాయ్‌మొళిసూక్తి జగత్కారణరూపిని ఆధారంగా చేసికొన్నది కాగా, ప్రకృతంలో అర్చావతారరూపిని ఆధారంగా చేసికొని ఉండడం విశేషం. తిరువాయ్‌మొళిదశకంలోవలె ఇందులో కూడా నాయకీ-మాతృ-సఖీ భావనలు మూడూ స్ఫురించడం ఇంకొక విశేషం.

వడవరై నిన్ఱుమ్ వన్దు ఇన్ఱు కణపురమ్,
ఇడవకై కొళ్వదు యా మెన్ఱు పేశినాళ్,
మడవరల్ మాతర్ ఎన్ పేతై యివర్కివళ్
కడవతెన్?, కణ్ణుయిల్ ఇన్ఱు ఇవర్ కొళ్ళవే 8-2-6

"ఉత్తరదిక్కులో ఉండే వేంకటాద్రినుండి బయలుదేరి వచ్చి ఇపుడు తిరుక్కణ్ణపురాన్ని వాసస్థానంగా కల్గినవాడను నేనే" అని తానే శౌరిరాజప్పెరుమాళ్‌గా భావించి నా కుమార్తె పల్కుతున్నది. ఈ శౌరిరాజప్పెరుమాళ్ ఇప్పుడు ఈమె కంటికి కునుకు లేకుండా చేసేటట్లు మౌగ్ధ్యం అనే గుణాన్ని కల్గినది. స్పృహణీయ అయినది అయిన ఈ చిన్నపిల్ల ఈ స్వామికి అనన్యార్హ అయిన తీరు ఏమో కదా!

**194. అవ :** "నాకు ప్రియమైన ఓ మనసా! కామాదిభోగాలను అనుభవించాలని తలచేవారి సమూహంలో చేరకుండా, నీవు ఉజ్జీవించాలి అని అంటే, పరమపదంలోను, తిరుమలలోను వేంచేసి ఉండే స్వామియొక్క నివాసం అయిన తిరువల్లవాళ్ అనే దివ్యతిరుపతిలో పొందికగా ఉండు" అని అంటూ తమ మనస్సును ఉద్దేశించి ఆళ్వార్లు పల్కుతున్నారు.

పణ్ణులామెన్మొళి ప్పావైమార్ పణైములై యణైదుమ్ నా మెన్ఱు,
ఎణ్ణువార్ ఎణ్ణమదొళిత్తు నీ పిళైత్తు ఉయ్య క్కరుదినాయేల్,
విణ్ణుళార్ విణ్ణిన్ మీది యన్ఱ వేఙ్గడత్తుళార్ వళఙ్గొళ్ మున్నీర్,
వణ్ణనార్ వల్లవాళ్ శొల్లుమా వల్లైయాయ్ మరువు నెఞ్జే! 9-7-4



నా మనసా! తమకు అధీనంగా చేసికోవడంకోసం మధురంగా మాటలాడే వనితలను కౌగలించుకోవాలని ఆశపడేవారి గుంపులో చేరకుండా- "ఆ ప్రేమ స్వరూప హాని" కరం అని నిశ్చయించి, దానికి తప్పి ఉజ్జీవించాలనే ఉద్దేశ్యం ఉంటే, నిత్యసూరు లకు సేవను అనుగ్రహించేవాడు, వేంకటాచలంలో వేంచేసి ఉండేవాడు, అందమైన సముద్రంవంటి దివ్యరూపాన్ని కలవాడు అయిన స్వామి అధివసించి ఉన్న "తిరు వల్లవాళ్" అనే దివ్యదేశంలో ఉండాలని ప్రయత్నించు.

ధన్యాసిరాగం - రూపకతాళంలో ఈ పాశురం ఉన్నది.

**195. అవ :** తిరుమంగై ఆళ్వార్లు, తిరుమాలిరుఞ్జోలై దివ్యదేశంలో గొప్ప ప్రావణ్యాన్ని కలవారై, సుందరబాహుస్వామి రూపసౌందర్యంలో మనస్సును పోగొట్టుకొన్నవారై, తాము సహజంగా పురుషులం అనే భావనను మఱచి, నాయికాభావాన్ని పొంది తమ స్థితిని మాతృముఖంగా ఈపాశురంలో వ్యక్తం చేస్తున్నారు.

నా కుమార్తె ఆర్తిని చూస్తే సుందరబాహుస్వామిని ఆలింగనం చేసికొంటేతప్ప ధరించలేనట్లున్నది. అతని హత్తుకొని, ఆనందించే భాగ్యం ఈమె ఎపుడు పొందు తుంది- అని పరకాలనాయకినిగూర్చి ఆమె తల్లి వాపోతున్నది.

**వలమ్పురి యాళియనై వరైయార్ తిరళ్‌తోళన్ తన్నై,**
**పులమ్పురినూలవనై ప్పొళిల్ వేఙ్గడవేదియనై,**
**శిలమ్పియలాఱుడైయ తిరుమాలిరుఞ్జోలై నిన్ఱ,**
**నలన్దిగళ్ నారణనై నణుగుఙ్గొల్? ఎన్ నన్నుదలే** 9-9-9

"ప్రణతరక్షాయాం విలంబ మసహ న్నివ" అన్నట్లు తన దాసులకు ఆపత్తు రాగానే ఆలస్యం ఏమాత్రం చేయకుండా రక్షించడంకోసం శంఖచక్రాలను ఎల్లప్పుడూ బాహువులలో ధరించి వెలిగేవాడు, ఆ ఆయుధాలు లేకపోయినా రక్షించగల్గిన బాహుబలిమిని కలవాడు, రక్షించకపోయినా విడువడానికి వీలు లేని రీతిలో మనోహరమైన దివ్యయజ్ఞోపవీతాన్ని ధరించిన అందాన్ని కలవాడు, ఆశ్రితులు వచ్చి చేరేటట్లు పరమసులభుడై, తోటలచే చుట్టబడి ఉండే శ్రీవేంకటాచలంలో అలంకరించుకొని వేంచేసి ఉండేవాడు, "అదికూడా పరత్వం అని చెప్పతగినది" అని పలికేటట్లుగా మిక్కిలి నీచులైనవారికి కూడా సేవను అనుగ్రహిస్తూ తిరుమాలిరుమ్‌శోలైకి వచ్చి నిలచి ఉండడం అనే సౌలభ్యగుణంలోని అతిశయాన్ని కలవాడు అయిన శ్రీమన్నారాయణుని నా కుమార్తె ఏనాడైనా పొందగలదా ?

కమాస్ రాగంలో - రూపకతాళంలో ఈ పాశురం రచింపబడింది.

"శిలమ్బియలాఱు" - నూపురగంగ. "శిలమ్బు" అంటే నూపురం. భగవానుడు త్రివిక్రముడై లోకాలను కొలచినపుడు బ్రహ్మ స్వామి పాదాలను కడుగగా, అపుడు భగవానుని నూపురంనుండి ఈ నది పుట్టింది కాబట్టి ఈ పేరు వచ్చింది. "స్వర్గంనుండి అప్సరసలు వచ్చినప్పుడు వారి కాలి అందెలనుండి పుట్టిన ఏరు" అని పెరియవాచ్చాన్ పిళ్ళై వ్యాఖ్యానంలోని సరసోక్తి.

**196. అవ :** "అత్యంతమనోహరరూపుడైన స్వామిని నిన్న శ్రీవేంకటాచలశిఖరంలో సేవించాను. ఇపుడు తిరుత్తణ్‌కాల్ అనే దివ్యదేశంలో సేవిస్తున్నాను"- అని అంటున్నారు.

**పొన్నై మామణియై అణియార్‌న్దదోర్**
**మిన్నై, వేఙ్గడత్తు ఉచ్చియిల్ కణ్డు పోయ్,**
**ఎన్నై యాళుడై ఈశనై ఎమ్బిరాన్**
**తన్నై, యామ్ శెన్ఱు కాణ్డుమ్ తణ్ కావిలే** **10-1-2**

బంగారంవలె ఆశపడతగినవాడు, నీలమణివలె మనోహరరూపుడు, అతిశయించిన అందాన్ని కల మెఱుపుతీగవలె ఉజ్జ్వలస్వరూపి అయినవాడు, నన్ను దాసునిగా స్వీకరించేవాడు అయిన స్వామిని నిన్న శ్రీవేంకటాద్రి శిఖరంలో సేవించి, ఈనాడు తిరుత్తణ్‌కాల్ అనే దివ్యక్షేత్రంలో పోయి సేవిస్తాము.

దర్బార్ రాగం - ఆటతాళంలో ఈ పాశురం ఉన్నది.

**197. అవ :** పరకాలనాయకి తాను పెంచే పచ్చని చిలుకను (లేత చిలుకను) చూచి "నీవు భగవానుడు ఇక్కడికే వచ్చి చేరేటట్లు కూయాలి" అని ప్రార్థిస్తున్నది.

**శొల్లాయ్ పైఙ్గిళియే!,**
**శుడరాழி వలనుయర్‌త్త,**
**మల్లార్‌తోళ్ వడవేఙ్గడవనై వర,**
**శొల్లాయ్ పైఙ్గిళియే** **10-10-5**

నాకు ప్రియం అయిన ఓ పచ్చని చిలుకా! నీవు దయచేసి కరుణానిధి అయిన ఆ స్వామిని ఇక్కడకు రమ్మని చెప్పు. పచ్చని చిలుకా! ఇక్కడకు రమ్మని చెప్పు. ప్రాప్తి ప్రతిబంధకాలు పలు ఉండగా పరిశుద్ధుడైన అతడు ఇక్కడకు సులభంగా ఏ విధంగా వస్తాడు? అని తలుస్తున్నావా! ఆ విధంగా అనుకోవద్దు. ఆశ్రితుల నిఖిల



పాతకాలను రెండు ఖండాలుగా చేయడానికి తగిన ప్రజ్వలించే శ్రీసుదర్శనాన్ని తన కుడిచేతిలో అతడు ధరించి ఉన్నాడు, ఆ ఆయుధ అధికం అన్న రీతిలో బలం ఏమాత్రం లోటు లేని దివ్యభుజాలను కల నాస్వామి నన్ను ఆలింగనం చేసికోవడానికి పయనించి, ఉత్తరదిక్కులో ఉండే తిరువేంకటాద్రిపై వేంచేసి ఉన్నాడు కదా! అతనిని ఇక్కడకు రమ్మని చెప్పు.

పరశురాగం - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

**198. అవ :** పరకాలనాయకి, తన మనస్సులో భగవానుడు ప్రవేశించి, స్థిరంగా నిలచి ఉన్నా తృప్తి పొందక, కళ్ళారా అతనిని దర్శించలేకపోవడంచేత బాధపడు తున్నది.

**కణ్ణన్ మనత్తుళ్ళే నిఱ్కవుమ్, కైవళైగళ్**
**ఎన్నో కழన్ఱ? ఇవై ఎన్న మాయఙ్గళ్?,**
**పెణ్ణానోమ్ పెణ్మైయోమ్ నిఱ్క, అవన్ మేయ**
**అణ్ణల్ మలైయుమ్ అరఙ్గముమ్ పాడోమే** **11-3-7**

స్వామి దూరస్థుడై ఉంటే అతని విరహాన్ని భరించలేని నా మేని కృశించి, బాధపడడం సహజమే. అతడు నా చిత్తంలోనే సన్నిహితుడై ఉన్నా, ఈ విధంగా నా మేని కృశించడానికి ఏం కారణమో తెలియలేదు. ఇది అత్యంతాశ్చర్యకరం అయిన విషయంగా ఉన్నది. ఆడవారమై పుట్టి, గొప్ప అందచందాలను కల్గినవారం మనం. ఆ విషయం అట్లుండనివ్వండి. ఉన్నంతవరకు ప్రాణధారణను చేయడంకోసం ఆ సర్వేశ్వరుడు మిక్కిలి ప్రీతితో వేంచేసి ఉండే దివ్యస్థలాలలో ఉత్కృష్టమై ఉండే వేంకటాచలాన్ని, శ్రీరంగాన్ని కీర్తించడానికి మనకు ఏదైనా అడ్డు ఉన్నదా! లేదు కదా !

శ్రీరాగం - రూపకతాళంలో ఈ పాశురం కూర్పబడింది.

**199. అవ :** ఆழ్వార్లు భగవానుని దివ్యకల్యాణగుణాలను విలక్షణంగా అనుభ వించాలని ఆశించి, ఒకే కాలంలో రెండు స్త్రీభావనలను (నాయిక-సఖీభావనలను) పొంది, వారిలో నిందిస్తూ పలికే ఒకనాయిక మాటలద్వారా స్వామి సౌలభ్యగుణాన్ని, పొగడే వేఱొక నాయిక మాటలద్వారా పరత్వగుణాన్ని అనుభవిస్తున్నారు.

**కళ్ళత్తాల్ మావలియై మూవడిమణ్ కొణ్డళన్దాన్,**
**వెళ్ళత్తాన్ వేఙ్గడత్తాన్ ఎన్బరాల్ కాణేడీ!,**

**వెళ్ళృత్తాన్ వేఙ్గడత్తానేలుమ్, కలికన్ఱి**
**ఉళ్ళత్తినుళ్ళే ఉళన్ కణ్డాయ్ శాఴలే!** **11-5-10**

సఖీ! నీవు కోరుకొనే స్వామి ప్రామాణికుడు కాడు. వంచకుడు. కృత్రిమవేషంతో మహాబలివద్ద మూడడుగుల నేలను యాచించి, పొంది, మూడు లోకాలను కొలిచిన వాడు కావడంవల్ల నయవంచకుడు. అది అట్లుండనీ! ఎవ్వరూ దరిచేరడానికి వీలులేనట్లు ఎక్కడో క్షీరాబ్ధిలోను, శ్రీవేంకటాచలంలోను ఉండేవాడని చెబుతున్నారే తప్ప, సులభుడై ఉండేవాడు కాడుకదా!- అని ఒక నాయిక అంటే, సఖి ఈ విధంగా బదులిస్తున్నది.

సఖీ! ఇంతమాత్రమేనా నీకు తెలిసినది. తిరుమఙ్గైమన్నన్ మనస్సులోకి వచ్చి నిత్యవాసం చేయడంకోసం ఉపాయానుష్ఠానాన్ని చేయడంకోసంకదా అతడు పాలకడలి లోను, శ్రీవేంకటాచలంలో నివసిస్తున్నాడు. ఇపుడు ఆ చోట్లను అన్నిటినీ విడచి, ఆఴ్వార్ల మనస్సులో నిత్యసాన్నిధ్యాన్ని కల్గిఉన్నాడుసుమా.

ఈవిధంగా ఆఴ్వార్లు నాయిక -సఖి సంభాషణరూపంగా భగవానుని దివ్యకల్యాణ గుణాలను మధురంగా అనుభవిస్తున్నారు. ఇదే పరమభోగ్యంగా ఉన్నందున ఫలశ్రుతి లేకుండానే ఈ దశకం ఈ పాశురంతోనే సమాప్తి అయినది- అని పెద్దల వ్యాఖ్య.

ఘంటారాగంలో - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

పరమపదం, క్షీరాబ్ధి, శ్రీరంగం, వేంకటాద్రి - మొదలైన దివ్యదేశాలకంటే భక్తుల హృదయమే భగవానునకు మిక్కిలి భోగ్యం అని, సమయాన్ని చూచి వారి హృదయా లలో ప్రవేశించడం కోసమే అర్చామూర్తిగా తిరుపతులలో వాసం చేస్తున్నాడు - అని పాశురసారం. "ఎన్నాదన్ దేవిక్కు" అని "కదిరాయిరమిరలి" అనే దశకంలో పెరియాఴ్వార్లు, "పట్టి మేయ్న్దోర్ కారేఱు" అనే దశకంలోని "విరున్దావనత్తే కణ్డోమే" అని గోదాదేవి ఈ అనుభవాన్నే ప్రదర్శించారు. ఆఴ్వార్లు రెండు అవస్థలను ఒకేసారి అనుభవించడం సాధ్యమా! అని అంటే, నిత్యులు, ముక్తులు ఒకే సమయంలో పలు రూపాలను ధరించి భగవత్సేవచేయడంవల్ల, సౌభరివంటి మహర్షుల అనుభవంకూడా ఇటువంటిదే కనుక, సాధ్యమే.

## తిరుక్కుఱున్దాణ్డకమ్

**200. అవ :** విషయాంతరప్రవణులై ప్రవర్తించిన పరకాలసూరిని భగవానుడు సంస్కరించాలని భావించి, వారికి తన లోకాతిశయం అయిన నిరవధిక సౌందర్యాన్ని



దర్శింపజేశాడు. ఆఴ్వార్లు దానిని దర్శించి చాలా ఆశ్చర్యపడి, గొప్ప అభినివేశాన్ని పొంది, తీవ్రమైన ఆకలితో బాధపడే వాడు చక్కని ఆహారాన్ని చూచి అనుభవించి నట్లుగా, ఒక్కసారిగా తదనుభవరసాబ్ధిలో మునిగిపోయారు. భగవానుడు తన ప్రయత్నం ఫలించినందులకు ఆనందాన్ని పొంది, ఈ అభినివేశం వీరికి స్థిరంగా ఉండడంకోసం తిరుమంత్రాన్ని ఉపదేశించి, తన సౌశీల్యాది కల్యాణగుణాలను, తాను అభిమానించి వేంచేసి ఉండే దివ్యదేశాలను దర్శింపజేశాడు.

తత్ఫలంగా ఆఴ్వార్లకు సంసారాన్ని వదలి పెట్టాలనే కోరిక, భగవానుని విషయంలో ప్రావణ్యాతిరేకం కలుగగానే, బహుముఖంగా పలవరించారు. ఒక క్షణం అయినా అతనిని విడచి ఉండలేని ఆఴ్వార్లు, చాలా దాహంతో పీడింపబడేవాడు నీటిలో పడి, నీటిని తాగడం, నీటిని చేతుల నిండుగా తీసికొని తనపై జల్లుకోవడం చేసేటట్లే, ఆస్వామిని నోరారా కీర్తించి, తలతో నమస్కరించి, మనసారా స్మరించి ప్రాణధారణను చేసికోవాలని చూచారు- తిరుక్కుఱున్దాణ్డకమ్ అనే దివ్యప్రబంధంలో.

**"దాణ్డకమ్"** అనేది ద్రావిడంలో ఒకవిధమైన ప్రబంధం. ప్రతిపాదంలో ఆఱు గణాలతోకూడిన పాదాలు నాల్గింటితోగాని, ఎనిమిది గణాలతో కూడిన పాదాలు నాల్గింటితోగాని ఇష్టదేవతాస్తుతిని చేసే ప్రబంధం ఇది. ఆఱు గణాలను కల్గినది **'కుఱున్దాణ్డకమ్"** అని, ఎనిమిది గణాలను కల్గినది **"నెడున్దాణ్డకమ్"** అని అనబడుతున్నది.

తిరుమఙ్గైఆఴ్వార్లు అనుగ్రహించిన తిరుక్కుఱున్దాడకప్రబంధంలో శ్రీవేంక టేశ్వరుని స్తుతించే పాశురం ఒకటి ఉన్నది. ఈ పాశురంలో ఆఴ్వార్లు భగవానుని శీలగుణంలో అభినివిష్టులై, దానినే సదా అనుసంధించగల్గిన భక్తులే నా తలపై ఉండదగినవారు - అని అంటున్నారు.

**ఇమ్మైయై మఱుమైదన్నై ఎమక్కు వీడాగి నిన్ఱ,**
**మెయ్మ్మైయై విరిన్ద శోలై వియన్ తిరువరఙ్గమ్ మేయ,**
**శెమ్మైయై క్కరుమైదన్నై త్తిరుమలై యొరుమైయానై,**
**తన్మైయై నినైవార్ ఎన్దన్ తలైమిశై మన్నువారే** 7వ పా

ఈ లోకంలో తననుగూర్చిన జ్ఞానవికాసాన్ని కల్గించి, ఆనందాన్ని పొందించి, పరలోకంలో నిత్యకైంకర్యంలో లగ్న మయేటట్లు చేసి ఆనందాన్ని కల్గించి, దాసులను ఉజ్జీవింపజేసేవాడు, పూర్వం తెల్పిన ప్రాప్యాలకు నిజమైన ప్రాపకుడై ఉన్నవాడు,

విస్తృతాలైన ఉద్యానవనాలను కల్గిన, చాలా ఆశ్చర్యకరం అయిన శ్రీరంగంలో నిత్యవాసం చేసేవాడు, యుగభేదంతో ఎఱ్ఱని వర్ణాన్ని, నల్లని వర్ణాన్ని కల్గినవాడైన ఆశ్చర్యగుణచేష్టితుడు, ఎంతో భోగ్యం అయిన వేంకటాద్రిలో నిలచి ఉండి, పరమపద వాసులకు, భూలోకవాసులకు సేవను అనుగ్రహించేవాడు అయిన భగవానుని సౌశీల్యగుణాన్నే ఎల్లప్పుడూ సంతోష ఆశ్చర్య - అభినివేశాలతో అనుసంధించే పరమభాగవతోత్తములే నా తలపై స్థిరంగా ఉండతగినవారు.

తోడిరాగం, రూపకతాళంలో ఈ పాశురం రచింపబడింది.

**"శెమ్మైయై క్కరుమైతన్నై"** – ఉపాసకులకోసం భగవానుడు ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క వర్ణాన్ని స్వీకరిస్తాడు. కృతయుగంలో శ్వేతవర్ణుడు, త్రేతాయుగంలో రక్తవర్ణుడు. ద్వాపరంలో వచ్చని వర్ణాన్ని, కృతయగంలో నల్లని వర్ణాన్ని స్వీకరిస్తాడు. తిరుచ్చన్దవిరుత్తంలోని **"పాలిన్ నీర్మై శెమ్పొన్ నీర్మై...."** ఇత్యాది పాశురభావం, నాన్ముకన్ తిరువన్దాదిలోని **"నికఴ్న్దాయ్ పాల్ పొన్ పశుప్పు కార్ వణ్ణమ్ నాన్గుమ్"** అనే సూక్తి భావం స్మరణీయం.

## తిరునెడున్దాణ్డకమ్

**201. అవ :** తిరునెడున్దాడకమ్ అనే దివ్యప్రబంధంలో శ్రీవేంకటేశ్వరుని విషయంగా నాల్గు పాశురాలు ఉన్నాయి. వాటిలో ఒకటి అయిన ఈ పాశురంలో భగవానుడు ఆదరంతో అధివసించి ఉండే పలు దివ్యదేశాలను ఆఴ్వార్లు నోరార కీర్తిస్తున్నారు.

నీరగత్తాయ్ నెడువరైయి నుచ్చిమేలాయ్!
నిలాత్తిజ్గళ్ తుణ్ణత్తాయ్! నిఱైన్ద కచ్చి
ఊరగత్తాయ్!, ఒణ్తుఱైనీర్ వెఃకావుళ్ళాయ్!
ఉళ్ళువారుళ్ళత్తాయ్!, ఉలగమేత్తుమ్
కారగత్తాయ్! కార్వానత్తుళ్ళాయ్! కళ్వా!
కామరుపూఙ్కావిరియిన్ తెన్పాల్ మన్ను
పేరగత్తాయ్!, పేరాదు ఎన్ నెఞ్జినుళ్ళాయ్!
పెరుమాన్! ఉన్ తిరువడియే పేణినేనే 8వ పా

పరమకరుణామూర్తివి అయిన స్వామీ! **"తిరునీరకమ్"** అనే దివ్యతిరుపతి లోను, శ్రీవేంకటాద్రిశిఖరంలోను, **"తిరు నిలాత్తిజ్గళ్ తుణ్డమ్"** అనే దివ్యదేశంలోను, సమృద్ధి నిండిన కాంచీపురంలోని **"తిరువూరకమ్"** అనే తిరుపతిలోను, అందమైన తీర ప్రదేశంలో ఉండే **"తిరువెఃకా"** అనే దివ్యక్షేత్రంలోను, యోగుల హృదయ



పుండరీకం లోను, లోకం అంతా కీర్తించే **"తిరుక్కారకమ్"** అనే దివ్యదేశంలోను, **"తిరుక్కార్ వానమ్"** అనే తిరుపతిలోను, **"తిరుక్కళ్వనార్"** లోను, అభిలషింప తగినదై, మిక్కిలి అందాన్ని కల కావేరీనదికి దక్షిణదిక్కులో చక్కగా ఉండే **"తిరుప్పేర్ నకర్"** లోను ఆనందంగా నివసించినట్లే దాసుని హృదయంలో విడువకుండా వేంచేసి ఉన్నావు. ఆహా! ఏమి నీ సౌమ్యం! వాత్సల్యం! కారుణ్యం!

'నీరగమ్' - కరుణ అనే నీటిని కల (నీటి స్వభావాన్ని కల) స్వామి వేంచేసి ఉండే చోటు కనుక ఈ దివ్యదేశానికి "నీరగమ్" - అని పేరు. "ఊరగమ్" - ఉరగమనే సర్పరూపంలో స్వామి సేవను అనుగ్రహించడంవల్ల ఈ తిరుపతికి ఈ పేరు వచ్చింది. "వెఃకా" - బ్రహ్మ చేసే యాగాన్ని రక్షించడానికై వేగవతీనదిని అడ్డుకోవడంకోసం స్వామి అడ్డుకట్టగా పరుండి ఉన్నందున ఈ తిరుపతికి **"వేగాసేతు"** అనిపేరు కల్గింది. ఈపేరే క్రమంగా **"వేగవణై"** - "వెఃకణై" - "వెఃకా" అయింది. **"నెడువరై"** - ఊర్ధ్వలోకవాసులుకూడా వచ్చి సేవించడానికి వీలుగా ఎత్తుగా వేంకటాద్రి ఉన్నది. కనుక ఈ ప్రయోగం చేయబడింది. **"కళ్వా"** - తిరుక్కళ్వనూర్‌లోని మూర్తి. ఇతరులు గ్రహించలేనట్లు కార్యాన్ని చేయగలవాడు. **"ఇరామడై మూట్టువారైప్పోలే ఉళ్ళే పది కిడన్దు"** - అనే పిళ్ళైలోకాచార్యులవారి సూక్తి స్మరణీయం. **"పేరగమ్"** - శ్రీరంగం సమీపంలోని అప్పకుడత్తాన్ సన్నిధి.

**202. అవ :** "స్వామీ! దివ్యతిరుపతులలో నీవు స్థిరనివాసం ఏర్పరుచుకొన్న అందాన్ని, నీ దివ్యతిరుమేనిలో అహంకారులకుసైతం చోటును ఇచ్చిన శీలాన్ని, నేను నోరార కీర్తిస్తూ సంచరిస్తాను"- అని అంటున్నారు.

వఙ్గత్తాల్ మామణి వన్దున్దు మున్నీర్
మల్లైయాయ్! మదిళ్కచ్చియూరాయ్! పేరాయ్!,
కొఙ్గత్తాల్ వళఙ్గొన్డె యలఙ్గల్ మార్వన్
కులవరైయన్ మడప్పావై ఇడప్పాల్ కొణ్డాన్
పఙ్గత్తాయ్!, పాఱ్కడలాయ్! పారిన్ మేలాయ్!
పనివరైయినుచ్చియాయ్! పవళవణ్ణా!,
ఎఙ్గుఱ్ఱాయ్! ఎమ్బెరుమాన్! ఉన్నై నాడి
ఏఴైయేన్ ఇఙ్గనమే ఉఴిదరుగేనే 9వ పా

గొప్ప రత్నాలను నావలద్వారా తీసికొని వచ్చి, కుప్పలుగా పోసే సముద్రతీరాలను కల కడల్‌మల్లై అనే దివ్యదేశంలోను, గొప్ప ప్రాకారాలతో ప్రకాశించే కాంచీనగరం

లోను, తిరుప్పేర్‌నకర్‌లోను వేంచేసి ఉండేవాడవు, తేనె నిండిన, ఎఱ్ఱనైన కొన్ద్రపూల మాలతో కూడిన వక్షస్థలాన్ని కలవాడు, సద్వంశంలో జన్మించిన, పర్వతరాజపుత్రిక అయిన పార్వతిని ఎడమవైపున కలవాడు అయిన శివుని దక్షిణపార్శ్వంలో కలవాడవు, క్షీరాబ్ధిలో యోగనిద్రలో పవళించి ఉన్నవాడవు, రామకృష్ణాదిరూపాలతో భూమిపై సంచరించిన వాడవు, చల్లని వేంకటాద్రిశిఖరంలో నివసించేవాడవు అయిన నీవు ఎక్కడ ఉన్నావు? పగడపుఛాయవలె అందమైన వర్ణాన్ని కల నాస్వామీ! బీదవాణ్ణి, చపలుణ్ణి అయిన నేను నిన్ను అన్వేషిస్తూ ఈరీతిలో శ్రమపడుతున్నాను.

తోడిరాగం - త్రిపుట తాళంలో ఈ పాశురం ఉన్నది.

**203. అవ :** నా కుమార్తె అయిన పరకాలనాయకి, తాను నాయకుని ఎదుట నిలుచున్నట్లు తలచి అందమైన చిలుకవలె మాట్లాడుతూ, నాయకుడు ఏ సమాధానం పలుకనందువల్ల తానున్న స్థితి చెడి (అవసన్నయై) "నా నాథుని రక్షకత్వ, సౌలభ్య సౌశీల్యాలు నాపై ప్రసరించ లేదే! అయ్యో! అని పెద్దగా రోదిస్తున్నది" అని ఇందులో తల్లి బాధ పడుతున్నది.

పొన్నానాయ్ పొ***ழ***లే***ழ***ుమ్ కావల్ పూణ్డ
పుగ***ழ***ానాయిగ***ழ*** వాయ తొణ్డనేన్ నాన్,
ఎన్నానాయ్ ఎన్నానాయ్ ఎన్నలల్లాల్
ఎన్నఱివనేయేన్, ఉలగమేత్తుమ్
తెన్నానాయ్ వడవానాయ్ కుడపాలానాయ్
కుణపాల మదయానా యిమైయోర్కెన్నుమ్
మున్నానాయ్, పిన్నానార్ వణఙ్గుమ్ శోది
తిరుమూ***ழ***ిక్కళత్తానాయ్! ముదలానాయే 10వ పా

లోకాలన్నీ స్తుతించేది, దక్షిణదేశంలో ఉన్నది అయిన తిరుమాలిరుమ్ శోలై దివ్యక్షేత్రంలో మత్తగజంవలె వేంచేసి ఉన్నవాడా! ఉత్తరదిక్కులో ఉండే వేంకటా చలంలో వేంచేసి ఉండే మదగజంవంటివాడా! పడమరదిక్కులోని శ్రీరంగంలో నిద్రిస్తూ ఉన్న మదగజంతో సమానుడా! తూర్పుదిశలోని తిరుక్కణ్ణపురం అనే దివ్యదేశంలో అధివసించి ఉన్న మత్తగజంవంటివాడా! ఎల్లప్పుడూ నిత్యసూరులకు సేవించదగినట్లున్నవాడా! అవతారాలకు తరువాత జన్మించేవారుకూడ ఆశ్రయించ దగినట్లుండే దివ్యజ్యోతి స్వరూపుడవుగా, తిరుమూ***ழ***ిక్కళమ్ అనే దివ్యదేశంలో వేంచేసి ఉన్నవాడా! ఆదిదైవమా! బంగారంవలె స్పృహణీయుడా! ఏడు లోకాలను



రక్షించడంచేత కల్గిన కీర్తిని కలవాడా! నైచ్యమే రూపుదిద్దుకొన్నట్లుండేవాడను, దాసుడను, జ్ఞానహీనుడను అయిన నేను, "నాకు గజంవంటివాడా" అని నిన్ను పలవరించడం తప్ప ఇంకేమీ తెలియను.

శంకరాభరణరాగంలో - రూపకతాళంలో ఈ పాశురం ఉన్నది.

**204. అవ :** "సర్వేశ్వరా! పలు రీతుల్లో నీ వైభవాన్ని కీర్తించడం తప్ప ఇంక ఏదీ నాకు తెలియదు" - అని ఇందులో అంటున్నారు.

కన్ఱు మేయ్‌త్తు ఇనిదుగన్ద కాళాయ్! ఎన్ఱుమ్
కడి పొ***ழ***ిల్ శూ***ழ*** కణపురత్తు ఎన్ కనియే! ఎన్ఱుమ్,
మన్ఱమరక్కూత్తాడి మగి***ழ***న్దాయ్! ఎన్ఱుమ్
వడ తిరువేఙ్గడమ్మేయ మైన్దా! ఎన్ఱుమ్,
వెన్ఱశురర్ కులమ్ కళైన్ద వేన్దే! ఎన్ఱుమ్
విరిపొ***ழ***ిల్ శూ***ழ*** తిరునఱైయూర్ నిన్ఱాయ్! ఎన్ఱుమ్,
తన్ఱు కు***ழ***ల్ కరునిఱత్తు ఎన్‌తుణైయే! ఎన్ఱుమ్
తుణైములై మేల్ తుళి శోర చ్చోర్‌గిన్ఱాళే 16వ పా

గోవులను మేపి, మిక్కిలి సంతోషించిన యువకశ్రేష్ఠా! అని, సుగంధాన్ని కల తోటలచేత చుట్టబడి ఉండే తిరుక్కణ్ణపురంలో నిద్రించే నా తీయని ఫలమా! అని, అత్యంతప్రీతితో కుంభనృత్యాన్ని ఆడి సంతోషించినవాడా! అని, ఉత్తర దిక్కుకు తిలకంవంటి వేంకటాచలంలో వేంచేసి ఉన్నవాడా! అని, అసురకులాన్ని జయించి నిర్మూలించిన పరాక్రమశాలీ! అని, వికసించిన సుగంధపుష్పాలను కల్గి, అందంగా ఉండే ఉద్యానవనాలచేత పరివృతమైన తిరునఱైయూర్‌లో నిలచి ఉన్నవాడా! అని, దట్టమైన కేశపాశాన్ని, నల్లని దివ్యమంగళవిగ్రహాన్ని కలవాడవైన నాకు సహాయభూతుడా! అని పలవరిస్తూ ఒకదానితో వేఱొకటి పోలి ఉండే స్తనాలపై కన్నీటి బిందువులు పడుతుండగా నాకుమార్తె మిక్కిలి బాధపడుతున్నది. ఇకనైనా నీవు ఆమెను అనుగ్రహించు స్వామీ!

సావేరి రాగం - రూపక తాళంలో ఈ పాశురం రచింపబడింది.

"తుణైములైమేల్ తుళి శోర చ్చోర్‌కిన్ఱాళే" అనే ప్రయోగాన్ని "కన్ఱు మేయ్‌త్తు ఇనిదుకన్ద కాళాయ్" ఇత్యాది ప్రతిపాద ప్రయోగంతో ప్రత్యేకంగా కలిపి అర్థం చెప్పవచ్చు. "మకి***ழ***న్దాయ్" – నృత్యంతో ఇతరులను సంతోషపెట్టడమే కాక, తానుకూడా సంతోషించేవాడు. నర్తనసౌందర్యంతో ఇతరులను వశీకరించుకొనేవాడు,

తాను సంతోషించేవాడై ఉన్నాడు - అని పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యాన సూక్తి. సజాతీయులను వశీకరించుకొన్నానుకదా! అనే తృప్తితో స్వామి ఆనందిస్తున్నాడు.

## శిఱియతిరుమడల్

**205. అవ :** భగవానుని విషయంలో ఆళ్వార్లకు పరభక్తి-పరజ్ఞాన-పరమభక్తులు పూర్ణంగా కలుగగానే, భక్తిప్రకర్షచేత నాయకీ భావం కల్గింది. భగవానుని సాక్షాత్తు దర్శించాని, స్పృశించాలని, ఆలింగనం చేసికోవాలని- ఇత్యాదిగా బాహ్యసంశ్లేషాపేక్ష వారికి కల్గి, అది సాధ్యం కానందువల్ల - "నా స్వరూపాన్ని సైతం చెడగొట్టుకొని అయినా అతనిని దర్శింపజేసికొంటాను'' అని ఆళ్వార్లు నిశ్చయించుకొన్నారు. శ్రీకృష్ణావతారం లోని కుంభ నృత్యమనేలీలలో చిక్కుకొని, అతనిని పొందలేక పోవడంవల్ల మడల్ ఎత్తాలని నిశ్చయించుకొన్న ఒక నాయకి పలికే సూక్తులతో తమ క్లేశాన్ని శిఱియ తిరుమడల్ ప్రబంధంలో ఆళ్వార్లు తెలియజేశారు.

అందులోని ఈ పాశురంలో ఈమె ప్రయత్నాన్ని చూచిన సఖి, "నీవు దర్శించిన తీరు ఏమి?'' అని ప్రశ్నించగా, "అతని గుణగణాలను కీర్తిస్తూ దేశం అంతా తిరిగి, చిక్కిన నా శరీరాన్ని చూపుతూ అతని గుణాన్ని చెడగొట్టి అయినా నేను అతణ్ణి పొందుతాను''- అని బదులిస్తున్నది.

శీరార్ తిరువేఙ్గడమే -----------------

నిత్యసూరులకు, సంసారులకు సమానంగా దర్శనాన్ని అనుగ్రహిస్తూ నిలచి ఉండే సన్నివేశంలో ఉన్న అతిశయం ఉన్నదికదా తిరుమలకు. అక్కడకు పోయి నా శరీరాన్ని చూపి అతడు ఉభయవిభూతికి నాథుడు కాకుండా ఉండేటట్లు చేస్తాను.

నాదనామక్రియరాగం - ఆదితాళంలో ఈ పాశురం ఉన్నది.

## పెరియతిరుమడల్

**206. అవ :** పెరియతిరుమడల్ అనే ప్రబంధంలోకూడా ఆళ్వార్లు పరకాలనాయకీ భావనతో భగవానుని ఉద్దేశించి మడల్ ఎత్తడం ప్రమేయం. ఈ ప్రబంధంలో రెండు సందర్భాలలో వేంకటాచల ప్రసక్తి కానవస్తున్నది. అందులోని మొదటి సందర్భం ఇది.

తెన్ననుయర్ పొరుప్పుమ్ తెయ్వ మడమలైయుమ్

దక్షిణదేశంలో ఉండే తిరుమాలిరుమ్‌శోలై అనే గొప్ప పర్వతాన్ని, ఉత్తరదేశంలోని వేంకటాచలాన్ని రెండు స్తనాలుగా గల శ్రీభూమాదేవులచే సేవింపబడే దివ్యపాదార



విందాలను కలవాడై, నాగపర్యంకంలో శయనించి ఉండే పరమాత్మయే నా స్వామి. అతడు నన్ను ఉపేక్షిస్తున్నాడు. తాను ఇచ్చిన మాటను మఱచి, నన్ను మోస గిస్తున్నాడు. అతడు దుష్టుడు. ప్రజలారా! గుర్తించండి.

నాదనామక్రియరాగం - ఆదితాళంలో ఈ పాశురం, తరువాతి పాశురం ఉన్నాయి.

**207.** మిన్నిమళై తవళుమ్ వేఙ్గడత్తు ఎమ్ విత్తకనై

మేఘాలు తళతళా మెరుస్తూ సంచరించే శిఖరాలను కల్గిన శ్రీవేంకటాచలంలో వేంచేసిఉండే జగత్కారణభూతుడైనవాడే నాస్వామి.

---

## అనుబంధం

# తిరువరఙ్గత్తముదనార్

శ్రీరంగే మీనహస్తే చ జాతం రంగార్యనందనమ్ ।
రంగనాథగురుం వందే రామానుజపదాశ్రితమ్ ॥

తిరువరంగత్తముదనార్లు **"మూఙ్గిల్కుడి"** అనే గ్రామంలో మీనమాసం హస్తా నక్షత్రంలో శ్రీరంగంలో అవతరించారు, అక్కడే నివాసం చేసేవారు. కులక్రమా గతంగా వచ్చిన శ్రీరంగాలయపౌరోహిత్యం, పురాణపఠనం- మొదలైన కైంకర్యాలను నిర్వహిస్తూ, సకలశాస్త్రనిష్ణాతులై ఉండే వీరు **"కోయిల్‌నమ్బి"**గా ప్రసిద్ధి చెందారు. భగవద్రామానుజుల వారు వీరిని కూరేశుల శ్రీచరణాలను ఆశ్రయింపజేశారు. కూరేశులు పరిపూర్ణకటాక్షానికి పాత్రం అయిన వీరు ప్రపన్నశిఖామణులై, మధురకవులు నమ్మాళ్వార్ల విషయంలో చరమపర్వనిష్ఠా ప్రతిపాదకం అయిన కణ్ణినుణ్‌శిఱుత్తామ్బు అనే ప్రబంధాన్ని అనుగ్రహించినట్లే, శ్రీరామానుజులవారి విషయంగా వారి తిరునామాంకితాలైన 108పాశురాలు కల ఇరామానుశ నూత్తన్దాది ప్రబంధాన్ని అనుగ్రహించారు. దీనిని కటాక్షించి, ఆనందించిన శ్రీరామానుజులు ప్రపన్నులు ప్రతిదినం దీనిని అనుసంధించు కోవాలని నియమించారు. అందువల్ల ఈ ప్రబంధానికి **"ప్రపన్నగాయత్రి, ప్రపన్నసావిత్రి"** అనే పేర్లు కలిగాయి. ఈ ప్రబంధం శ్రీరామానుజుల కాలంలోనే అవతరించి నందువల్ల, శ్రీరంగనాథుని ఆజ్ఞానుసారం శ్రీరామానుజుల వారిచేత కటాక్షింపబడి నందువల్ల ఇది నాలాయిరదివ్యప్రబంధంలోని ఇయఱ్పా అనే భాగంలో చివరగా

చేర్చి, అనుసంధింప బడుతున్నది. ఈ ప్రబంధవైభవం వాచామ గోచరం. పురుషసూక్తం తెలియనివాడు బ్రాహ్మణుడు కానట్లు, ఈ ప్రబంధం రానివాడు ప్రపన్నుడు కాడని అభిజ్ఞులైన ఆచార్యుల సూక్తి.

## ఇరామానుశనూఱ్ఱన్దాది

**అవ :** తిరువరఙ్గత్తముదనార్ అనుగ్రహించిన ఇరామానుశనూఱ్ఱన్దాది ప్రబంధంలో రెండు పాశురాలలో శ్రీవేంకటేశ్వరుని తిరునామం కీర్తింపబడింది.

ప్రస్తుత పాశురంలో శ్రీతిరువరంగత్తముదనార్ భగవద్రామానుజులను ఉద్దేశించి- "స్వామీ! దాసునికోసం తమరు ప్రత్యేకంగా ఏమీ చేయనక్కరలేదు. దాసునకు సర్వస్వం అయిన తమ దివ్యపాదరవిందాలను అనుగ్రహిస్తే చాలు- అని ప్రార్థిస్తున్నారు.

**నిన్దవణ్ కీర్త్తియుమ్ నీళ్ పునలుమ్, నిఱైవేఙ్గడ ప్పొ**
**ఱ్కున్ఱముమ్ వైగున్ద నాడుమ్ కులవియ పాఱ్కడలుమ్,**
**ఉన్దనక్కు ఎత్తనై యిన్బన్దరుమ్ ఉన్నిణైమలర్త్తాళ్**
**ఎన్దనక్కుమ్ అదు, ఇరామానుశా! ఇవై యీన్దరుళే** **76వ పా**

భగవద్రామానుజా! శాశ్వతం అయిన, నిరవధికం అయిన కీర్తితో, లెక్కలేనన్ని సెలయేళ్ళ ప్రవాహాలతో పూర్ణం అయిన వేంకటాచలమనే స్పృహణీయం అయిన పర్వతం, వైకుంఠమనే దేశం, శ్లాఘనీయం అయిన క్షీరాబ్ధి - ఇవి నీకు ఎంత ఆనందాన్ని ఇస్తాయో, అంత ఆనందాన్ని మీ దాసుడనైన నాకు మీ దివ్యపాదారవిందాలు కల్గిస్తాయి. వాటిని నాకు అనుగ్రహించండి స్వామీ.

**అవ :** శ్రీరామానుజులు అముదనారులకు తమ విషయంలోగల అతిమాత్ర ప్రావణ్యాన్ని గుర్తించి, "నాపై ఇంత భక్తిని కల వీరి మనస్సును ఒక క్షణంకూడా విడిచి ఉండలేను'' అని నిశ్చయించుకొని, వారి మనస్సులో నిత్యనివాసం చేశారు. దానినిచూచి అముదనార్లు సంతోషాతిశయంలో ఈ పాశురాన్ని పలుకుతున్నారు.

**ఇరుప్పిడమ్ వైగున్దమ్ వేఙ్గడమ్, మాలిరుఞ్జోలై యెన్నుమ్**
**పొరుప్పిడమ్ మాయను క్కెన్బర్ నల్లోర్, - అవై తమ్మొడుమ్ వన్దు**
**ఇరుప్పిడమ్ మాయన్ ఇరామానుశన్ మనత్తు ఇన్ఱు అవన్ వన్దు**
**ఇరుప్పిడమ్, ఎన్దనిదయత్తుళ్ళే తనక్కిన్బుఱవే** **106వ పా**



సర్వేశ్వరుడు ఆదరంగా వేంచేసి ఉండే చోట్లు ఏవి? అని అంటే, పరమపదం, శ్రీవేంకటాచలం, తిరుమాలిరుమ్‌శోలై అనే దివ్యదేశాలు అని పెద్దలంటారు. ఈ దివ్యదేశాలతోపాటుగా భగవానుడు ప్రీతితో వేంచేసి ఉండే చోటు శ్రీరామానుజుల హృదయంలోనే. అటువంటి భగవద్రామానుజులు ఇపుడు ఎంతో కృపతో తనకు అత్యంతప్రీతిపాత్రమైనస్థానం అని వేంచేసి నిత్యవాసం చేసే చోటు నాహృదయంలోనే. ఆహా! ఏమి నా భాగ్యం!

మోహనరాగం - రూపకతాళంలో ఈ పాశురం ఉన్నది.

## శ్రీవేదాంత దేశికులు

కన్యాశ్రవణసంభూతం ఘంటాంశం వేంకటేశితుః ।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికమ్ ॥

అవ : శ్రీవేంకటేశ్వరుని ఘంటయొక్కఅంశతో క్రీ.శ.**1268**వ సం॥లో విభవనామ సంవత్సరం కన్యామాసం శ్రవణానక్షత్రంలో కాంచీపురంలో గల **"తూప్పుల్"** అగ్రహారంలో విశ్వామిత్రగోత్రీయులైన అనంతసూరి, తోతారాంబ దంపతుల పుత్రరత్నంగా అవతరించి, మేనమామ అయిన, అప్పుళ్ళార్ అనబడే ఆత్రేయ రామానుజులవారి పరిపూర్ణకటాక్షానికి పాత్రులై, సకలశాస్త్రపారంగతులై, శతాధిక గ్రంథకర్తలై, కవితార్కిక కేసరి- సర్వతంత్రస్వతంత్ర -వేదాంతాచార్యాది బిరుద భూషితులైన శ్రీమద్వేంకటనాథులు తాము అనుగ్రహించిన అధికార సంగ్రహమనే దివ్యప్రబంధంలో ఒక పాశురంలో శ్రీవేంకటాచలాన్ని కీర్తించారు. ఈ పాశురంలో శ్రీదేశికులు భగవానునకు గొప్ప వాసస్థానం- మహామహిమను గల శ్రీవేంకటమనే దివ్యపర్వతమే - అని అంటున్నారు.

### అధికారసంగ్రహం

**కణ్ణవడియిణై యెమక్కు క్కాట్టుమ్ వెఱ్ప్పు**
**క్కడునినైయ రిరువినైయుమ్ కడియుమ్ వెఱ్ప్పు,**
**తిణ్ణ మిదు వీడెన్న త్తిగḻుమ్ వెఱ్ప్పు**
**తెళిన్ద పెరుమ్ తీర్త్తఙ్గళ్ శెఱిన్ద వెఱ్ప్పు,**
**పుణ్ణియత్తిన్ పుగలిదెన ప్పుగḻుమ్ వెఱ్ప్పు**
**పొన్నులగిల్ పోగ మెలామ్ పుణర్క్కుమ్ వెఱ్ప్పు,**

విణ్ణవరు మణ్ణవరుమ్ విరుమ్బుమ్ వెఱ్ప్పు
వేజ్గడ వెఱ్పెన విళఙ్గుమ్ వేదవెఱ్పే 43వ పా

శ్రీకృష్ణుని శ్రీచరణాల జంటను మనకు దర్శింపజేసేది, క్రూరపాపాలను చేసినవారి ద్వివిధకర్మలను (పూర్వాఘ-ఉత్తరాఘాలను, లేక, పుణ్యాపాపరూప కర్మలను) నశింప జేసేది, దృఢంగా ఈ దివ్యదేశమే పరమపదం అని చెప్పదగినట్లు విలసిల్లేది, స్వచ్ఛంగా ఉండే పలు పుణ్యతీర్థాలలో నిండి ఉండేది, "ఇది పుణ్యాలకు నెలవు" అని ప్రశంసింపబడేది, స్పృహణీయం అయిన పరమపదంలో అనుభవించే దివ్యాను భూతులన్నీ కరతలామలకం చేసేది, పరమపదవాసులైన నిత్యసూరులు, భూలోకంలోని మానవులు ఆశపడేది ఏది? అంటే, శ్రీవేంకటాచలమనే పేరుతో ప్రసిద్ధిచెంది, విరాజిల్లే వేదస్వరూపి అయిన (వేదప్రతిపాద్యమైన) దివ్యపర్వతమే.

